

1962 అక్టోబరు 23 వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో సైనిక గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న మలయా ప్రధాన మంత్రి శ్రీ తుంకూ అబ్దుల్ రహమాన్



వాల్తేరు బీచ్:— రోడు అభివృద్ధి మొదటిదశ పనిని చేపట్టారు.

# విషయసూచిక



వెనుక అట్టమీది చిత్రం :— ఇండియాలోని అమెరికా రాయబారి ప్రొఫెసర్ గాల్‌బ్రెత్ 1962 అక్టోబరు 10వ తేదీన నాగార్జునసాగర్ ప్రాజెక్టును సందర్శించినప్పుడు ఆయన ఒకకట్టతో సిమెంటు కాంక్రీటును మోస్తున్నప్పుడు కార్మికులు తిలకిస్తున్న దృశ్యం.

# "జాతీయ రక్షణనిధికి విరివిగా విరాళాలివ్వండి"



## ఆంధ్రప్రజకు ముఖ్యమంత్రి సందేశం

చేభారతభూభాగంమీద చైనా స్తున్న దురాక్రమణను పురస్కరించుకొని అక్టోబరు 29వ తేదీ రాత్రి ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవ రెడ్డిగారు రాష్ట్ర ప్రజలకు క్రింది సందేశం యిచ్చారు.

మిత్రులారా !

రెండు రోజుల క్రితమే దీపావళి పండుగ జరుపుకున్నాం. ఈ దీపావళి ఆనందోత్సాహాలతో జరుగలేదు. ఆనాడు అంతటా అమవాశ్య చీకట్లే క్రమ్ముకున్నాయి. యుద్ధ వాతావరణమనే కారు మేఘాలు క్రమ్ముకున్నాయి. స్నేహితులని మనం నమ్మినవారే మనలను ముంచారు. మనమీద దండెత్తారు. మన మాతృ భూమిలో కొంతభాగాన్ని కబళించడానికి కబంధహస్తాలు చాచారు. మనకు స్వరాజ్యం వచ్చిన తర్వాత యింతటి ఉపద్రవం ఎప్పుడూ రాలేదు. నేడు మన ఉనికికే ప్రమాదంవచ్చింది. "ఏం చెయ్యాలి నేను ?"—యిదే నేడు ప్రతి భారతీయుడి ఆలోచనా పధంలో ఎదురవుతున్న ప్రశ్న.

అయితే యీ ప్రశ్నకు జవాబు అప్పుడే వచ్చింది. దేశం నలుమూలల నుండి ప్రజలందరు ఐక్యకంఠంతో పలికారు. అందరిదీ ఒకేమాట—చైనావారిని గెంటి వెయ్యాలి. ప్రజలు ఉద్రేకంతో ముందుకు వచ్చి ఎంతటి త్యాగానికైనా సంసిద్ధత తెలిపారు. అనేకసూచనలు చేశారు. సలహాలు యిచ్చారు. తామంతా శత్రువుతో పోరాడడానికి తయారుగా వున్నామనీ, దేశ స్వాతంత్ర్య రక్షణకు ప్రాణాలు ఒడ్డి పోరాడగలమనీ తెలిపారు. మన ప్రజల దీక్ష అజేయం. ప్రజల ఉత్సాహాన్ని, శక్తి సామర్థ్యాలను దేశ రక్షణ కార్యక్రమానికి మనం వినియోగించుకోవాలి. అదే నేడు ముఖ్య కర్తవ్యం. జాతీయ ఉపద్రవం ఏర్పడిన యీ సమయంలో స్వల్పమైన అభిప్రాయ భేదాలకు తావులేదు. అవన్నీ తరువాత చర్చించుకుందాం. నేడు ప్రజలందరూ ఒకే వ్యక్తిగా పనిచేయాలి. జాతి అంతా ఒక మాటమీద నిలబడాలి. ధైర్య స్థైర్యాలు ప్రదర్శించాలి. దేశాన్ని శత్రు విముక్తం చేసుకోవాలి. జాతీయ రక్షణే నేడు ముఖ్యం. మిగిలిన కార్యక్రమాలన్నీ తరువాత. మన సంగతి, మన అవసరాల సంగతి, మన హక్కుల సంగతి ప్రస్తుతానికి మరచిపోదాం. మాతృ భూమికి ఆపద వచ్చింది. భారత మాత బావురు మంటున్నది. ఆమె స్వాతంత్ర్య రక్షణమే నేటి కర్తవ్యం, అదే మన బాధ్యత. అదే మన దీక్ష. ఎందుకంటారా? —భారత దేశం వుంటేనే మనం వున్నాం. భారతీయులమని

గర్వంగా చెప్పుకుంటున్నాం. దేశం లేనిది, దేశానికి స్వాతంత్ర్యం లేనిది మనం ఉండేమి, లేకేమీ ? అనేక సంవత్సరాలు దేశ స్వాతంత్ర్యానికి ఎన్నో త్యాగాలుచేసి పోరాడిన అనుభవం మనకు ఉంది. స్వాతంత్ర్య సమరమంటే ఏమిటో మన తరంవారికి బాగా తెలుసు. మహాత్మాగాంధీ నాయకత్వాన రవి యస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడగడ లాడించాము. మనకు దాసోహ మనిపించు కున్నాము. తమ సర్వస్వాన్ని త్యాగంచేసి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న వీరయోధులు యిప్పటికీ వున్నారు. అవసరమైతే మళ్లీ త్యాగాలు చేయడానికి సిద్ధంగావున్నారు. మిగిలిన ప్రజలందరూ వారి ఆదర్శాన్ని అనుసరిస్తారు. స్వాతంత్ర్య సాధనకు మనం పోరాడాము. దానిని రక్షించుకోడానికి కూడా వెను దీయము. అయితే ఒక విశేషం బ్రిటిష్ సామ్రాజ్యం మీద మనం పోరాడేనాడు—ఆనాటి మన శత్రువు నాగరికత ఎరిగినవాడు. ధర్మాధర్మ విచక్షణ తెలిసినవాడు. నేడో ! మన శత్రువు నీతి నియమం లేనివాడు. న్యాయానికి కట్టుబడడు. ధర్మాన్ని లక్ష్య పెట్టడు. అదువల్ల మనం పూర్వంకంటె ఎక్కువ దీక్షతో పోరాడవలసిన సమయమిది. మనలోని త్యాగ శీలము, పట్టుదల, మాతృదేశ సేవానురక్తి యీనాడు ద్విగుణీకృతంగా ప్రదర్శించాలి. మన ప్రధానమంత్రి చెప్పినట్లు చైనా దండయాత్రతో మన దేశ చరిత్రలో ఒక అధ్యాయం పూర్తిఅయి, నూతనాధ్యాయం ప్రారంభమైంది. ఈ ఘట్టంలో మనలను చరిత్ర ధైర్య సాహసోపేతులైన వీరులుగా వర్ణించేటట్లు మనం ప్రవర్తించాలి. లేదా, ముందు తరాలవారు మనలను పిరికి పందలని వెక్కిరిస్తారు. చైనాను ఎదిరించలేని చేతగానివారని మనలను నిందిస్తారు.

## యుద్ధభూమి మధ్యలో వున్నాం

పేరుకు యుద్ధం ప్రకటించలేదనే కాని—యీ నాడు మనం యుద్ధభూమి మధ్యలోనే వున్నాం. ఇది కేవలం సైనికులు మాత్రమే చేసే యుద్ధం కాదు. మనందరం యుద్ధం చేయవలసిందే. ఈ యుద్ధంలో మన దేశంలోని ప్రతికుటుంబం పాల్గొనాలి. అంటే మనలో ప్రతి ఒక్కరు యుద్ధానికి సర్వ సహాయం చేయాలి. ఎంతటి త్యాగానికైనా వెనుతీయకూడదు. మన భారతీయ సైనికులు నేడు ఎత్తయిన కొండ ప్రాంతాలలో యుద్ధం చేస్తున్నారు. అంత ఎత్తున యుద్ధం చరిత్రలో ఏనాడు జరుగలేదు. భారతీయ సైనికుల శక్తి సామర్థ్యాలు జగద్విదితం. అనేక రంగాలలో మన సైనికులు వీరోచితంగా యుద్ధాలు చేశారు. అయితే సైనికులు సాధించే విజయాలకూ, ప్రజల నైతిక స్థాయికీ చాలా సంబంధం వుంది. ప్రజల ధైర్యసాహసాలే సైనికుల ధైర్యసాహసాలు. మనం భయపడకూడదు. ధైర్యంగా ఉండాలి. ప్రజల్లో మనోభీతి కల్గించే ప్రచారాలేవీ చేయకూడదు. పుకార్లవల్ల దుష్ఫలితాలు కలుగుతాయి. మనం ధైర్యంగా వుండి మన సైనికులకు మద్దతు యివ్వడానికి ప్రతిజ్ఞ పూనుదాం. యుద్ధ ప్రయత్నాలకు భంగకరమైన ఏపనీ చేయమని శపథం చేద్దాం.

రాష్ట్రపతి దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడిందని ప్రకటించారు. దేశ రక్షణ చట్టం అమల్లోకి వచ్చింది. అంటే యిప్పుడు మన హక్కుల కంటే బాధ్యతలు ముఖ్యం. కర్తవ్య నిర్వహణకే అగ్రస్థానం. ఈ తీవ్రపరిస్థితిని మనం గుర్తించాలి. అందుకు అనుగుణంగా ప్రవర్తించాలి. స్వాతంత్ర్యం పొందడానికి, అర్హులమనీ, దానిని రక్షించుకోడానికి సమర్థులమనీ మనం ప్రపంచానికి ఎలుగెత్తి చాటాలి.

## ప్రజలు చూపుతున్న ఉత్సాహం

దేశం నలమూలలనుండి ప్రజలు చూపుతున్న ఉత్సాహాన్ని గురించి వార్తలు వస్తున్నాయి. అవి వింటుంటే ఒడలు గగుర్పొడుస్తున్నది. మన ప్రజల దేశభక్తి పరవళ్లు తొక్కుతున్నది. ఇదే చాలు అంతిమ విజయానికి. ప్రజల దేశ భక్తి పూరితమైన ఉత్సాహం, త్యాగశీలమే తుది విజయానికి దారి. దేశ రక్షణ కార్య క్రమానికి ప్రజలు ఏ విధంగా సహాయపడాలి అనేది ముఖ్యమైన ప్రశ్న. నాకు తోచినంతలో కొన్ని ముఖ్య విషయాలు మనవి చేస్తాను.

## ఉత్పత్తి అధికం చేయండి

అన్నిటి కంటే ముఖ్యం వివిధ రంగాలలో ఉత్పత్తి అధికం చేయడం. మనది వ్యవసాయ రాష్ట్రం. ఆహారధాన్యాల విషయంలో మనది యిప్పటికే మిగులు రాష్ట్రం. ఆహార పదార్థాలు నిత్యావసరం కదా. అందుకని ఉత్పత్తిని మనం ఇంకా ఎక్కువ చేయాలి. మన సైనికులకూ, దేశ ప్రజలందరికీ సరిపడినంత ఆహారం మనం అందివ్వగలగాలంటే ఉత్పత్తి పెంచడమే మార్గం.

ఇతర పదార్థాల ఉత్పత్తి—పబ్లిక్, ప్రైవేటు రంగాలలో కూడా ఎక్కువ చేసుకోవాలి. మనలో ఎవ్వరూ, ఎప్పుడూ ఏ మాత్రం కాలం వృథా చెయ్యకూడదు. కార్మికులు, కార్మిక నాయకులు, ఫ్యాక్టరీ యజమానులు తమ అభిప్రాయభేదాలను తక్షణం మరచిపోవాలి. నేటి తీవ్ర పరిస్థితి ముగిసేవరకు సమ్మెలు.

లాకవుట్లు అనే ప్రసక్తే రాకుండా ఉత్పత్తిని పెంచుకోవాలి. మరొక ముఖ్యాంశం. ప్రతిదానిలోనూ పొదుపుచేసి, కూడబెట్టి, దేశ రక్షణ కార్యక్రమానికి అందించాలి. అనవసరమైన అన్ని ఖర్చులూ తగ్గించుకోవాలి.

ఈ క్లిష్టసమయంలో ప్రజలనుండి విరాళాలు వసూలు చేయడం అవసరం. దేశరక్షణ నిధికై అనేక సంస్థలు, వ్యక్తులు ప్రజల నుండి విరాళాలు వసూలు చేయడం అప్పుడే ప్రారంభించారు. మంచిదే. కాని మన డబ్బు సరియైన వ్యక్తుల చేతికి అందేటట్లు మనం జాగ్రత్తపడాలి. ధన వస్తు రూపంలో ప్రజల నుండి నిధి వసూలు చేయడానికి ఏయే అధికార్లను నియమించడం జరిగిందో వారి పేర్లు, హోదాలతోసహా త్వరలోనే వివరాలు ప్రకటించబడతాయి. ప్రస్తుతానికి విరాళాలు పంపదలచినవారు ముఖ్యమంత్రి పేరగాని లేక ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పేరగాని పంపవచ్చు.

విరాళాలివ్వండి

ఏ రకం విరాళమైనా స్వీకరిస్తారు. కాని అన్నిటికంటే ముఖ్యం బంగారం. మన దేశంలో ఎంత బీదవారికైనా కాస్తో కూస్తో బంగారం వుంటుంది. మాతృభూమి మీద మన భక్తి శ్రద్ధలు చూపడానికి యిదే సమయం. ప్రతి కుటుంబం నుంచి కనీసం ఒక తులం బంగారమైనా విరాళంగా యివ్వాలని ప్రజలందరికి నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

యుద్ధభూమిలో సైనికులు గాయపడతారు. వారికి కొన్ని సమయాలలో రక్తం ఎక్కించవలసివస్తుంది. మనలో ఆరోగ్యవంతులందరూ తక్షణం రక్తదానం చెయ్యాలి. రక్తపు బ్యాంకులలో తమ రక్తాన్ని యిచ్చి, మనకోసం, మాతృభూమి రక్షణ కోసం వీరోచితంగా పోరాడుతున్న సైనికులకు సహాయం చెయ్యాలి.

వేల సంవత్సరాల క్రితం, ద్వాపరాంతంలో కురుక్షేత్ర యుద్ధరంగంలో శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి విజయ రహస్యం బోధించాడు. అదే నిష్కామ కర్మ యోగము. శ్రీకృష్ణభగవానుని గీతాబోధను మించి మనం చెప్పగలిగినదేముంది? నీ విధి నీవు నిర్వహించాలి. ఫలితం మాట మరచిపోవాలి.

అధికారులు, ప్రభుత్వోద్యోగులకు నా విజ్ఞప్తి ఏమంటే వారు యిదివరకటికంటే ఎక్కువగా కష్టపడిపనిచేయాలి. విద్యార్థులు సైనికులవలె క్రమశిక్షణతో ప్రవర్తిస్తూ విద్యాభ్యాసం కొనసాగించాలి. అవసరమైనప్పుడు మీకు పిలుపువస్తుంది. త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వుండండి. మాతృదేశ గౌరవం నిలబెట్టండి. ప్రాణత్యాగం చేసి భారతదేశ ప్రతిష్ఠను కాపాడడానికి తయారుగా వుండండి. నేషనల్ వాలంటరీ రైఫిల్స్ సంస్థలో చేరండి.

ఉత్పత్తిదార్లు, వ్యాపారస్థులు, ప్రజలు, అందరూ కలిసి ధరల పెరుగుదలను అరికట్టడం అవసరం. కృత్రిమంగా వస్తువుల కొరత కలిగేటట్లు చేయడం మంచిది కాదు. ఇటువంటి చర్యలు ఏవీ తీసుకోకుండా వుండవలసిందని వారికి నేను విజ్ఞప్తిచేస్తున్నాను.

దేశంలో కొన్ని సంఘ వ్యతిరేక శక్తులు, దేశ ద్రోహ శక్తులు వున్నాయి. ఇటువంటి జాతీయ సంక్షోభ సమయంలోనే వారు తమ స్వార్థం కోసం ప్రయత్నం చేస్తుంటారు. వారెవరైనా సరే, సంఘంలో వారికి ఎట్టి స్థానమున్నా సరే, అట్టివారిపై కఠిన చర్యలు గైకొనాలని ఆదేశాలు యివ్వడం జరిగింది. ఈ హెచ్చరికను గుర్తించి వారు ప్రవర్తించడం మంచిది. వారి యిష్టం వచ్చినట్లు ఆట ఆడడానికి తగిన సమయం కాదిది. వారు దేశద్రోహులు. మన మీద దండెత్తి వచ్చిన శత్రువుల కంటె మించిన శత్రువులు వీరు. మన మధ్యనే వున్న ప్రజాశత్రువులు.

ప్రభుత్వం దేశరక్షణకు తగు చర్యలు తీసుకుంటున్నది. ఈక్లిష్ట పరిస్థితి నుండి బైటపడడానికి ఏయే చర్యలు తీసుకోవాలో ప్రభుత్వం వాటిని తీసుకుంటున్నందున, ప్రజలు ఏ మాత్రమూ ఆందోళన చెందనవసరం లేదని విజ్ఞప్తి చేస్తున్నాను. భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి నిర్ణయించుకోడానికి ఉన్నత స్థాయి సమావేశం జరుపుతున్నాం. ఎప్పటికప్పుడు ఏ చర్యలు తీసుకున్నా ప్రజలకు తెలియపరచడం జరుగుతుంది. అవసరమైనప్పుడు మళ్ళీ ప్రజలతో నేను ప్రసంగిస్తాను. ఇప్పుడు మనకు ఒకే మార్గం వుంది. శత్రువు ఏమైనా చేసుకోనీ. మన పని మనం దీక్షగా చేసుకుందాం.

మా అభివృద్ధికి అడ్డురావడం అనుకున్నంత సులభం కాదని చైనావారికి తెలిసేటట్లుచేద్దాం. మన స్వాతంత్ర్య జ్యోతి ఆరేది కాదు. మన రక్తమనే తైలంపోసి దానిని వెలిగిద్దాం. భారతజాతి ప్రతిష్ఠను యినుమడింపజేద్దాం.

చైనా సైనికులారా! మమ్మల్ని జయించడం అంత సులభం కాదు సుమా—అని హెచ్చరిద్దాం.

జై హింద్

# దివ్యాంధ్రి

రాయప్రోలు సుబ్బారామయ్య

ఓ ప్రభాత జాత పూత శీతానిల సంచరణా!
ఓ ప్రభూత విఖ్యాత వినీత కళాంచిత వరణా!

పూజలు గొను మాంధ్రమాత!
జేజేలివె! శ్రీ సమేత!—

పొరుగు రాష్ట్రములకు నీదు పోడిమియే సంపూజ్యం,
తరుగని మెఱుగుల ఖని నీ వరసితి శ్రేయోరాజ్యం;
పంచాయత్యమృతము నీ పంచలలో అనుభోగ్యం;
మించి ఆస్వదించి సుతులు గాంచి రమర సమభాగ్యం;

తత సథక విధాయినీ!
సతత సౌఖ్య దాయినీ!—

'మండల వికాస' మండన మండితమై రంజిల్లెను
నిండుగ నీగళ; మిటుపై నీ చీకటితెర డుల్లెను;
జనతా సమతా ఘనతను వినుతాదృతి 'సమితు' లౌరసె;
నవతా నవ జవ తావక భవితవ్యము నిన్నుదరిసె;

ఓ త్రివాహినీ జీవని!
ఓ త్రిలింగ సంభావని!—

భారత భారతి కీరితి మీటెను నీ వీణారుతి,
భారత జాతీయోన్నతి కారతి నీ పటు ప్రగతి;
నీకేమి కొఱంత? తల్లి! నీకేలోక కల్పవల్లి;
మాకేమీ కలంత లేదు మాకూరిమి పాలవెల్లి;—

జయ నితాంత నిస్తంద్ర సుహాసినీ!
జయ దిగంత దివ్యాంధ్ర సుభాషిణీ!



ఆంధ్రప్రదేశ్

# సహకారోద్యమానికి చేయూత



కాసు బ్రహ్మానందరెడ్డి





ప్రణాళికా బద్ధమైన అభివృద్ధిలో ఒక భాగంగా సహకార రంగాన్ని రూపొందించడం అనేది జాతీయ విధానంముఖ్యాశయాల్లో ఒకటి. సహకార సిద్ధాంతాన్ని ఎక్కడ వీలు పడితే అక్కడ వర్తింప చేయాలని, క్రమక్రమంగా అభివృద్ధి చెందుతున్న ప్రైవేట్ రంగం కార్యకలాపాలను సహకార విధానాలపైనే రూపొందించాలని 1956 వ సంవత్సరపు పారిశ్రామిక విధాన ప్రతిపాదన నిశ్చయించింది. పారిశ్రామిక, వ్యవసాయ అవసరాలకై సహకార విధానంపై నిర్వహింపబడుతున్న సంస్థలతో ప్రభుత్వం ప్రత్యేక సహాయం అంద జేయాలని ఆ ప్రతిపాదన నొక్కి చెప్పింది. అంతేగాక సామ్యవాద సరళి సమాజాన్ని ఏర్పాటు చేసుకోటానికి సహకార రంగాన్ని అభివృద్ధి చేయడం అత్యవసరం అని కూడా అది సూచించింది. ఈ రంగంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పంచవర్ష ప్రణాళికల క్రింద ఎంతో అభివృద్ధిని సాధించింది. ఈ విషయాన్ని గత ఐదేళ్ళకు సంబంధించిన ఈ క్రింది లెక్కలు తెలుపుతాయి.

| | 1955_56 | 1960_61 |
|---|---|---|
| సహకార సంఘాల సంఖ్య | 18,444 | 24,856 |
| సభ్యత్వం (లక్షలలో) | 20.79 | 33.06 |
| చెల్లించిన పెట్టుబడి (కోట్ల రూపాయలలో) | 7.33 | 19.38 |
| నిర్వహణ పెట్టుబడి (కోట్ల రూపాయలలో) | 54.48 | 129.56 |

వ్యవసాయోత్పత్తినధికంచేసి, వ్యవసాయార్థిక పరిస్థితిని చక్కదిద్దడం పంచవర్ష ప్రణాళికల లక్ష్యం. తదనుగుణంగానే సహకారాభివృద్ధికై సహకార పరపతి, క్రయవిక్రయాలకు, వ్యవసాయాలకు ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వబడుతున్నది.

తృతీయ ప్రణాళిక క్రింద అన్నిరంగాలలో (చేనేత మగ్గాలు మినహా చక్కెర ఫ్యాక్టరీలు, గృహ పాడిపరిశ్రమ నిర్మాణ రంగాలలో కూడా సహకార కార్యక్రమానికై 8.59 కోట్ల రూపాయలను కేటాయించారు. ఈ మొత్తం ద్వితీయ ప్రణాళికలో 6.11 కోట్ల రూపాయలు మాత్రమే.

## వ్యవసాయ ఋణాలు

వ్యవసాయఋణాల విషయంలో ఎంతో అభివృద్ధి జరిగింది. గత ఐదేళ్లలో సహకార సంఘాల అభివృద్ధికి సంబంధించిన లెక్కలు ఈ క్రింది పట్టికలో ఇవ్వబడినాయి.

| | ఆంధ్ర ప్రాంతం | | తెలంగాణా ప్రాంతం | |
|---|---|---|---|---|
| | 1955_56 | 1960_61 | 1955_56 | 1960_61 |
| 1. సంఘాల సంఖ్య | 6,679 | 8,106 | 3,013 | 5,685 |
| 2. సభ్యత్వం (లక్షలలో | 6.45 | 11.59 | 0.96 | 2.79 |
| (లక్షల రూపాయలు) | | | | |
| 3. చెల్లించిన వాటా పెట్టుబడి | 111 | 325 | 20 | 82 |
| 4. నిర్వహణ పెట్టుబడి | 743 | 2044 | 107 | 570 |
| 5. సంవత్సరంలో సభ్యులకు ఇచ్చిన ఋణాలు | 580 | 1551 | 73 | 343 |
| 6. సభ్యులు చెల్లించ వలసిన ఋణాలు | 628 | 1692 | 73 | 452 |

ఈ పట్టికను బట్టి ఆంధ్ర ప్రాంతంలో సహకార సంఘాలలో సభ్యుల సంఖ్య రెండింతలు, తెలంగాణా ప్రాంతంలో మూడింతలు పెరిగినట్లు తెలుస్తున్నది. గత ఐదేళ్ళ కాలంలో ఈ సంఘాలలో

వార్షిక ఋణాల వ్యవహారాలు ఆంధ్ర ప్రాంతంలో మూడింతలు పెరగగా, తెలంగాణా ప్రాంతంలో ఆరింతలు పెరిగింది. 30-6-1957 నాటికి ఈ సంఘాల క్రింద వున్న గ్రామాలు, జనాభా శాతం వరుసగా 58,17 కాగా ఆ శాతం 1961-62 వరకు 81 శాతానికి 30 శాతానికి (దాదాపుగా) పెరిగింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో వున్న సహకార సంఘాలు వ్యవసాయ దారులకవసరమయ్యే మొత్తం ఋణాలలో 14 శాతాన్ని ఇస్తున్నాయి. ఈ శాతం మొదటి ప్రణాళికలో 3 మాత్రమే

పంచవర్ష ప్రణాళికల క్రింద తలపెట్టిన అధిక వ్యవసాయోత్పత్తికై మూడవ ప్రణాళిక చివరకు వ్యవసాయదారులకు కావలసిన ఋణాల అవసరాలలో 50 శాతాన్ని సమకూర్చాలని సహకార సంఘాలు నిశ్చయించాయి. ఇందుకై తృతీయ ప్రణాళికలో సహకార సంఘాల సభ్యత్వానికి 40 లక్షలకు పెంచాలని తృతీయ ప్రణాళిక చివరి సంవత్సరానికి 60 కోట్ల రూపాయల వరకు స్వల్ప, మధ్యకాలిక ఋణాలకై ఈ సంఘాలు ఇవ్వాలని తలపెట్టారు. ఈ లక్ష్యం వల్ల నూటికి 66 శాతం వ్యవసాయ కుటుంబాలు సహకార పరిధిలోకి వస్తాయి. వారి ఋణాల అవసరాలలో నూటికి 33 శాతం వరకు తీరుతాయి.

పరపతి సౌకర్యాల రంగంలో తృతీయ పంచవర్ష ప్రణాళిక క్రింద చేపట్టిన ఒక ముఖ్యమైన కార్యక్రమం గ్రామీణ సహకార సంఘాలు, కేంద్ర సహకార బ్యాంకులకు సంబంధించిన చెల్లించని అప్పుల ప్రత్యేక రిజర్వులకు, ఈ సంఘాలు లేదా బ్యాంకులు ఏదైనా సంవత్సరంలో అంతక్రితం సంవత్సరంలో పెటిన అప్పులకు మించి చేసిన అదనపు ఋణాలలో వరుసగా 3 శాతం, ఒక శాతం చొప్పున ప్రభుత్వం పూర్తిగా గ్రాంట్లు చెల్లించడానికి సంబంధించినది. సమాజంలో శక్తిహీనులైన వారికి కూడా ఎటువంటి మినహాయింపులు లేకుండా సహకారసంఘాలు పరపతి సౌకర్యాలు చేకూర్చడానికై వాటిని ప్రోత్సహించడమే ఈ కార్యక్రమం లక్ష్యం.

సంస్థాగతమైన స్వల్పకాలిక పరపతి సౌకర్యాలను పూర్తిగా సహకార సంఘాల ద్వారా సమకూర్చే ఒక పథకాన్ని 1958 మే నుంచి నిర్ణీతమైన ఆరు బ్లాకులలో ప్రయోగాత్మకంగా అమలు పరుస్తున్నారు. దీనివల్ల చేకూరిన ప్రోత్సాహవంతమైన ఫలితాలను పురస్కరించుకొని 1961-62 వ సంవత్సరంలో ప్రభుత్వం ఈ పథకాన్ని, ఆంధ్ర ప్రాంతంలోని మిగతా అయిదు జిల్లాలలోనూ ఒక్కొక్క బ్లాకులో ప్రవేశపెట్టింది.

## దీర్ఘకాలిక పరపతి సౌకర్యాలు

భూములను శాశ్వతంగా అభివృద్ధిపరచుకోడానికై వ్యవసాయదార్లకు అవసరమైన దీర్ఘకాలిక ఋణాలను 110 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు లభింపజేస్తున్నాయి.

1960-61 వ సంవత్సరంలో వీటి ద్వారా జరిగిన ఋణాల పంపిణీ రూ. 176 లక్షలకు హెచ్చింది. ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో రూ. 600 లక్షలు పంపిణీ చేయడానికి లక్ష్యంగా పెట్టుకున్నారు. 1960-61 వ సంవత్సరంలో దేశంలోని ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులన్నీ రూ. 717 లక్షల మేరకు ఋణాలు పంపిణీచేయగా ఒక్క మనరాష్ట్రంలోని ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు మాత్రమే రూ. 176 లక్షల వరకు ఋణాలు లభింపజేశాయనే విషయం ఈ సందర్భంలో గమనార్హం. 1961 జూన్ 30 వ తేదీ నాటికి సభ్యులు చెల్లించవలసివున్న ఋణాల బకాయీల దృష్ట్యా అన్ని రాష్ట్రాలలోనూ ఆంధ్రప్రదేశ్ దే ప్రథమ స్థానం. దేశం మొత్తం మీద రూ. 2,579 లక్షల మేరకు అప్పుల బకాయీలు చెల్లింపబడవలసివుండగా ఆంధ్రప్రదేశ్‌లోని ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల సభ్యుల నుండి వసూలు కావల్సిన బకాయీల మొత్తం రూ. 719.57 లక్షలు.

వినియోగంలోకి వచ్చిన అనేక సేద్యపు నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద విస్తృతమైన ప్రాంతాలకు నీటి పారుదల చేసే కార్యక్రమంతో పాటుగా దీర్ఘకాలిక పరపతి సౌకర్యాలను విస్తృతీకరించే కార్యక్రమం కూడా కొనసాగుతున్నది.

పరపతి సౌకర్యాలను చేకూర్చే కార్యక్రమాన్ని అమలు పరచడానికి వీలుకలిగేందుకై కేంద్ర భూమి తనఖా బ్యాంకు డిబెంచర్లను జారీ చేస్తుంది. 1962 మార్చి 31 వ తేదీనాటికి రూ. 8.35 కోట్ల మేరకు డిబెంచర్లు చలామణిలో వున్నాయి. ఆంధ్ర, హైద్రాబాదు కేంద్ర సహకార భూమి తనఖాబ్యాంకులను ఇటీవల విలీనం చేశారు. ఈ విధంగా ఒకటిగా ఏర్పడిన బ్యాంకు ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర భూమి తనఖాబ్యాంకుగా వ్యవహరించబడుతున్నది.

## సంపూర్ణ ఋణ సహాయ పథకం

నల్గొండ జిల్లాలోని మూసీ మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టు ప్రాంతానికి చెందిన రైతులకు అవసరమైన స్వల్ప, మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలను ఆ ప్రాంతంలోని గ్రామీణ సహకార

(మిగతా 90 వ పేజీలో)

# "నేడు మనం సైనికులం"

నీలం సంజీవరెడ్డి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి అప్పుడే ఆరేళ్లనిండింది. నవంబరు 1 వ తేదీ మన రాష్ట్రానికి త్రివిధ ప్రాధాన్యంగల రోజు. ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం, పంచాయతీరాజ్య వార్షికోత్సవం, ప్రణాళికా ప్రచార వారోత్సవం ఈరోజు మనం జరుపుకుంటున్నాం. *

## ఆంధ్రరాష్ట్రమేర్పడక ముందు

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రమేర్పడకముందు మన పరిస్థితిని ఇప్పటి పరిస్థితితో పోల్చిచూసుకుంటే మనం చెప్పుకోదగిన అభివృద్ధి సాధించినట్లు స్పష్టంగా తెలుస్తుంది. ఆనాడు మన ప్రాంతాలకు రావలసినంత ప్రాధాన్యం రాలేదనేవిషయం యదార్థం. ముఖ్యంగా విద్యుచ్ఛక్తి రహదారి రంగాలలో తగినంత పని జరుగలేదు. ఆంధ్రరాష్ట్రమేర్పడిన తరువాత మన పనులు మనం చక్కబెట్టుకునే అవకాశం లభించింది. ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారి నాయకత్వంలో అప్పటి ఆంధ్రరాష్ట్రం వివిధ రంగాలలో ప్రగతి సాధించింది. శ్రీ గోపాలరెడ్డి రాష్ట్రానికి సారథ్యం వహించిన కాలంలో కూడా రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలు విజయవంతంగా కొనసాగించుకోగలిగాము. కృష్ణా బారేజి నూతన రాష్ట్రావతరణ అనంతరం మనం నిర్మించుకున్న తొలి పెద్ద ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు ఆదిలో అనుకున్నదానికంటె చాలా ముందుగా పూర్తిచేసుకోగలగడం ఆంధ్ర ఇంజనీర్ల ప్రతిభను వేనోళ్ల చాటింది. అలాగే విద్యుచ్ఛక్తి కార్యక్రమాల విషయంలో కీ.శే. బి. ఆర్. సోమయాజులు వంటి ఇంజనీర్లు ఎంతో దోహదం చేశారు. ఈ కాలంలోనే రాష్ట్రాభివృద్ధికి అత్యవసరంగా చేపట్టవలసిన సమస్య మైనర్ ఇరిగేషన్ కార్యక్రమాలు అనే విషయం గ్రహించడం జరిగింది. ఎంతో దూరదృష్టితో ఈ కార్యక్రమాలను మనం ఆనాడే ప్రారంభించాం. వెనుకబడిన జిల్లాలలో మైనర్ ఇరిగేషన్ పథకాలను ప్రారంభించి వీలైనంత వరకు స్థానిక సమస్యలను పరిష్కరించుకోవడానికి ప్రయత్నం చేశాం.

మూడు కోట్ల తెలుగు ప్రజలతో ఆంధ్రప్రదేశ్ వచ్చిన తర్వాత ఇంకా ఎక్కువ అనుకూల పరిస్థితి ఏర్పడింది. ఈ కాలంలోనే మనం రాష్ట్ర ద్వితీయ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా ముగించుకుని తృతీయ ప్రణాళిక అమలుపరచడం ప్రారంభించాం.

## సాంకేతిక విద్య అవసరం

పంచవర్ష ప్రణాళికలద్వారా దేశంలో ఆర్థికాభివృద్ధి సాధించడానికీ, తద్వారా తరతరాల దారిద్ర్యంతో క్రుంగిపోయిన ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచి వారిలోని సృజన శక్తులను దేశాభివృద్ధికి వినియోగించుకోడానికీ నేడు తీవ్రంగా కృషి జరుగుతున్నది. అయితే ఆర్థిక ప్రగతి సాధనకు ప్రజలు, ప్రజా ప్రతినిధులు ఎంత పట్టుదలగా పనిచేయాలో అలాగే దానికి అవసరమైన సాంకేతిక సిబ్బందిని కూడా సకాలంలో సమకూర్చుకోవాలి. ప్రస్తుత కాలంలో సాంకేతిక విజ్ఞానం లేనిదే ఏపని సాధ్యం కాదు. ఉదాహరణకు భారీ ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రతిభావంతులైన ఇంజనీర్లు కావాలి. అలాగే ప్రజారోగ్య స్థాయి అభివృద్ధి పరచుకోడానికి డాక్టర్లు కావాలి. ఇంకా వివిధ రంగాలకు సంబంధించిన సాంకేతిక విషయజ్ఞులు కూడా తగినంత మంది లభిస్తేనే మన ప్రగతి కార్యక్రమం విజయవంతమవుతుంది. అందుకే మన రాష్ట్రంలో అవసరమైన ఇంజనీరింగ్ కళాశాలలు, వైద్య కళాశాలలను అభివృద్ధి పరచుకోడానికి మనం కృషిచేస్తున్నాం. కలకత్తా వంటి మహానగరాలలో ఇటువంటి వృత్తి కళాశాలలన్నీ కేంద్రీకృతమై ఉంటాయి. కొన్ని ఇతర రాష్ట్రాలలో ముఖ్యమైన కళాశాలలు నగరాలలోనే ఏర్పాటు చేసే అలవాటు వుంది. మనం అలా కాకుండా, రాష్ట్రంలో వివిధ ప్రాంతాలకు అనుకూలంగా వుండే రీతిగా ప్రాంతీయ పద్ధతిపై ఇటువంటి సాంకేతిక సంస్థలను వృద్ధి చేసుకుంటున్నాం. ఆంధ్రప్రాంతంలో 1946 లో కాకినాడ,

* మన దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించబడిన తరువాత యీ ఉత్సవ కార్యక్రమాలను రద్దు చెయ్యడం జరిగింది.

అనంతపురం ఇంజనీరింగు కళాశాలలు ఏర్పడడంతో ఉన్నత సాంకేతిక విద్యకు అంకురార్పణ జరిగింది. తరువాత 1955 లో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధంగా మరొక ఇంజనీరింగ్ కళాశాల ప్రారంభించబడింది. తెలంగాణా ప్రాంతానికి ఉపయోగ పడే విధంగా వరంగల్లులో ఒక ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాలను నెలకొల్పడంకూడా జరిగింది. మొదటి ప్రణాళిక ప్రారంభంకాకముందు మనకు 3 ఇంజనీరింగ్ కళాశాలలు మాత్రమే ఉండేవి. రెండో ప్రణాళిక చివరకు మన రాష్ట్రంలో ఆరు ఇంజనీరింగ్ కళాశాలలు, పంతొమ్మిది పాలీటెక్నిక్‌లు పని చేస్తున్నవి.

అలాగే వైద్య కళాశాలలను కూడా ఆయా ప్రాంతాల అభివృద్ధికి దోహదకరంగా వివిధ కేంద్రాలలో ఏర్పాటు చేసుకుంటున్నాము. సాంకేతిక విద్యా వ్యాప్తిరంగంలో మనం అనుసరిస్తున్న విధానంలో ఇదొక ప్రత్యేకత. దీనివల్ల అన్ని ప్రాంతాలవారికి ఉన్నతస్థాయి సాంకేతిక విద్య అందుబాటులోకి వచ్చింది. మన రాష్ట్రం ఇంజనీరింగ్ పట్టభద్రులకు సంబంధించినంతవరకు మిగులు రాష్ట్రమని చెప్పవచ్చు. అవసరమై అడిగితే ఇతర రాష్ట్రాలకు సైతం ఇంజనీర్లను పంపగలస్థితిలో ఇప్పుడు మనం ఉన్నాం. ఏటేటా రాష్ట్రం మొత్తంమీద వైద్య విద్యార్థుల సంఖ్య పెరుగుతున్నది. మన రాష్ట్రంలో ఇప్పుడు విశాఖపట్నం, గుంటూరు, కర్నూలు, కాకినాడ, తిరుపతి, వరంగల్లు, హైదరాబాద్ కేంద్రాలలో మొత్తం ఎనిమిది వైద్య కళాశాలలు వున్నవి. హైదరాబాద్‌లో రెండు కళాశాలలు వున్నవి. వీటిలో ఏటేటా 845 మంది వైద్య విద్యార్థులను చేర్చుకోడానికి వసతి వుంది. వచ్చే మూడు నాలుగు సంవత్సరాల కాలంలో డాక్టర్ల విషయంలో కూడా మనరాష్ట్రం స్వయంసమృద్ధిని సాధించగలదనే నావిశ్వాసం. ఇదేవిధంగా ప్రతి జిల్లాలోనూ పాలీటెక్నిక్ సంస్థలను అభివృద్ధి చేసి దిగువ స్థాయిలోకూడా వృత్తి విద్యలను ప్రోత్సహించడం మన విధానం. హైదరాబాద్‌లో స్త్రీల కొరకు ప్రత్యేకంగా ఒక పాలీటెక్నిక్ సంస్థ ఏర్పడి పనిచేస్తున్నది.

## మరి రెండు ముఖ్య కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనతికాలంలోనే మనం మరి రెండు ముఖ్య కార్యక్రమాలను చేపట్టాం. రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలలో బస్సులను జాతీయం చేశాం. అలాగే పాఠ్యపుస్తకాల జాతీయకరణ విధానాన్ని అమలు పరుచుకుంటున్నాం. ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా కార్పొరేషన్ ఏర్పాటుచేసి తెలంగాణా ప్రాంతంలో లోగడనే అమలు జరుగుతున్న జాతీయకరణవిధానాన్ని కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి వంటి ఆంధ్ర ప్రాంతాలకు విస్తరింపచేశాం. ఆరంభంలో కొన్ని వర్గాలనుండి, కొందరు వ్యక్తుల నుండి దీనికి గట్టి ప్రతిఘటన వచ్చింది. కాని ప్రజానీకం యొక్క శ్రేయస్సుదృష్ట్యా ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికే ప్రభుత్వం సంకల్పించుకుంది. ప్రైవేటు వ్యక్తుల యాజమాన్యంలో కంటే ఒక పటిష్టమైన సంస్థ ఆధ్వర్యంలో ప్రయాణ సౌకర్యాలు కలుగ చేయడం సక్రమమైన పద్ధతి అనిఅందరూ అంగీకరిస్తారు. పాఠ్య గ్రంథాల జాతీయకరణ కార్యక్రమానికికూడా ప్రకటన కర్తలు పుస్తక విక్రేతలనుండి కొంత ప్రతిఘటన కలిగినా ఆ కార్యక్రమం నేడు విజయవంతంగా నడుస్తున్నది. జాతీయం చేయబడిన పాఠ్య గ్రంథాల ప్రచురణకై ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక ముద్రణాలయాన్ని కూడా ఏర్పాటు చేసింది. కొన్ని నియంతృత్వదేశాలలోవలె పాఠ్యగ్రంథాల విషయంలో ప్రభుత్వం జోక్యం కల్పించుకుని బాల బాలికలకు కొన్ని సిద్ధాంతాలు నూరిపోయడం ఈ ఉద్యమం యొక్క ఉద్దేశం కాదు. పేదవారికి సైతం అందుబాటులో వుండేటట్లు పాఠ్య పుస్తకాలను చవుకధరలకు అందించడం, అందులోనూ మంచి మంచి రంగులతో, బొమ్మలతో బాల బాలికలకు ఆకర్షకంగా వాచక పుస్తకాలను తయారు చేయించడమే ఈ కార్యక్రమ లక్ష్యం. మూడో పంచవర్ష ప్రణాళికకాలంలో నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని అమలు పరిచే సందర్భంలో దానికి దోహదకరంగా చౌకగా పాఠ్య గ్రంథాలను అందించడం తప్పనిసరి.

## పంచాయితీ రాజ్యం

దేశానికంతటికీ మార్గదర్శకంగా మన రాష్ట్రంలో పంచాయితీ రాజ్యాన్ని స్థాపించుకున్నాం, ఇప్పటికి మూడేళ్లు నిండింది, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సిద్ధాంతాన్ని పరిపాలనా వ్యవహారాలకు వర్తింపచేసుకున్నాం. గ్రామ, సమితి, జిల్లా స్థాయిలలో ప్రజా ప్రతినిధి సంస్థలు ఏర్పాటయ్యాయి. పాలనాధికారం వాటికి సంక్రమించింది. దీనివల్ల ప్రజలలో ఒక నూతన చైతన్యం వెలసిల్లింది. తమ భవిష్యత్తుకు తామే కర్తలమనే ఆత్మవిశ్వాసం ఏర్పడింది. గ్రామాలలో అన్నింటి కంటె ముఖ్యమైనది వ్యవసాయ కార్యక్రమం, అందుకే మైనర్ ఇరిగేషన్ కార్యక్రమాల నిర్వహణ బాధ్యత పూర్తిగా సమితుల పరం చేయబడింది.

(మిగతా 92వ పేజీలో)

## వెలుగు బాటలు

"ఉదయభాను"

సోషలిస్టు సమాజ నిర్మాణ లక్ష్యంతో పురోగమిస్తున్న దేశంలో అధికోత్పత్తి సాధన అత్యవసరం. అందుకు కార్మిక వర్గంలో తృప్తి ఉండటం మరీ అవసరం.

కార్మికులకు మంచి ఆరోగ్యం, సాంఘిక భద్రత, విద్యా, సాంకేతిక శిక్షణ సౌకర్యాలు కల్గించడం, యజమానులతో తలెత్తిన వివాదాల్ని సామరస్యంగా పరిష్కరించడానికి తగు యంత్రాంగాన్ని కల్పించి రాష్ట్రప్రభుత్వ కార్మికశాఖ ఎనలేని కృషి చేస్తున్నది. ఎక్కడో ఒకటి, రెండుచోట్ల కొంతయిబ్బంది ఉన్నా మొత్తంమీద రాష్ట్రంలో కార్మిక పరిస్థితి ప్రశాంతంగా సంతృప్తికరంగా ఉంది.

1962–63 రాష్ట్ర బడ్జెట్‌లో కార్మిక, ఉద్యోగకల్పన శాఖకు రూ. 35,80,800 కేటాయించారు.

### ప్రవర్తన నిబంధనావళి

ప్రవర్తన నిబంధనావళి (Code of Discipline)ను కార్మికులు యజమానులు కూడ అమలు జరిపేటట్లు చూసే యంత్రాంగం కార్మికశాఖలో ఉంది. ఉభయులమధ్య కుదిరిన ఒప్పందాలు, అవార్డులు అమలుజరిగేటట్లు యీ విభాగం ప్రయత్నిస్తుంది ప్రభుత్వ పరిశ్రమలకు ఒకటి, ప్రయివేటు పరిశ్రమలకు ఒకటి–మొత్తం రెండు కమిటీలు, గుంటూరు, విశాఖపట్నంలలో ఒక్కొక్కటిచొప్పున స్థానిక కమిటీలు పనిచేస్తున్నవి. ఈ యంత్రాంగానికి రాష్ట్ర స్థాయిలో ఇన్‌ఛార్జిగా ఉన్న స్పెషల్ ఆఫీసర్ హోదా కార్మికశాఖ డిప్యూటీ కమీషనర్ స్థాయికి పెంచబడి ఐదుగురు ఇన్‌స్పెక్టర్లను నియమించడం గత సంవత్సరమే జరిగింది. ఈ చర్యవలన ఒప్పందాలను అమలు జరిపే కార్యక్రమం మరింత చురుగ్గా కొనసాగుతున్నది.

### వేతన సంఘాలు

వివిధ వేతన సంఘాల సిఫార్సుల్ని అమలు జరపడానికి కార్మికశాఖ కృషిచేస్తున్నది. రాష్ట్రంలోని ఒకటి తప్పించి మిగిలిన అన్ని టెక్స్టైలు మిల్లులు, 11 చక్కెరఫ్యాక్టరీలలో 10, మొత్తం ఐదు సిమెంటు ఫ్యాక్టరీలూ కార్మికులకు సంతృప్తికరంగా వేతన సంఘాల సిఫార్సుల్ని అమలు జరిపాయి. సహకార చక్కెర ఫ్యాక్టరీలలో కార్మికుల అనుమతితోనే అవి యింకా అమలు జరగకుండా ఉండిపోయినవి. జనపనార మిల్లులన్నీ కూడ అమలు జరిపినవి.

### కంట్రాక్టు కార్మికులు

మార్కెట్ ప్రాంతంలో పనిచేసే హమాలీల పని పరిస్థితులు చాల అసంతృప్తికరంగా ఉన్నవని గుర్తించి ప్రభుత్వం ఒక దర్యాప్తు కమిటీని వేసింది. అదే విధంగా కంట్రాక్టర్ల దగ్గర పనిచేసే కార్మికుల పరిస్థితిని దర్యాప్తు చేయించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

### వర్క్సు కమిటీలు

వందమందికి తక్కువలేకుండా కార్మికులున్న పారిశ్రామిక సంస్థలన్నీ పారిశ్రామిక వివాదాల చట్టంక్రింద వర్క్సు కమిటీలను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం గత సంవత్సరం ఆదేశించింది. వందకుపైగా వర్క్సు కమిటీలు రాష్ట్రంలో పనిచేస్తున్నవి కూడ

### కార్మిక శాసనాలు

కార్మికశాసనాల్ని కట్టుదిట్టంగా అమలుపరచడం కార్మికశాఖ విధులలో ప్రధానమైనది. కార్మికుల నష్టపరిహారం, పారిశ్రామిక వివాదాలు, కార్మిక సంఘాలు, పారిశ్రామిక ఎంప్లాయిమెంట్ ప్రసూతి సౌకర్యం, పిల్లలకు ఉద్యోగాలు, షాపులు ఎస్టాబ్లిష్‌మెంట్లు, మోటార్ ట్రాన్సుపోర్టు కార్మికులకు సంబంధించిన చట్టాలున్నవి.

### నష్టపరిహారం

కార్మికుడు తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించడంలో ఏదైనా ప్రమాదం కలిగితే సహాయం చేయడానికి ఉద్దేశించిన యీ చట్టం కార్మిక కుటుంబాలకు సాంఘిక భీమావంటిది. రైల్వేలు, ట్రామ్‌వేలు, ఫ్యాక్టరీలు, బొగ్గుగనులు, నౌకాశ్రయాలు, నిర్మా

ణాలు, రోడ్లు, వంతెనలు, తంతి తపాలాశాఖపనులు, త్రవ్వకాలు, లైట్‌హౌస్‌లు, కాఫీ, తేయాకు, రబ్బరుతోటలు, విద్యుచ్ఛక్తి లేక గ్యాస్ ఉత్పత్తిలాటి అనేక పనులలో నిమగ్నమైన కార్మికులకు యిది వర్తిస్తుంది.

డబ్బులేని కార్మికులు కార్మిక నష్ట పరిహార చట్టంక్రింద కేసులు దాఖలు చేయడానికి ప్రభుత్వం కొంతసహాయం చేస్తున్నది. కేసుకు రు. 50 కు మించకుండా యీ సహాయం చేయబడుతుంది.

## ప్రసూతి సహాయం

1952 మే 1 నుండి ఆంధ్రప్రదేశ్ అంతటికీ వర్తించే క్రొత్తశాసనం రావడంతో ఫ్యాక్టరీలలో పనిచేసే స్త్రీ కార్మికులందరికీ మరిన్ని సౌకర్యాలు లభించినవి. వారికి 11 వారాల ప్రసూతి సెలవు యివ్వబడుతుంది. క్రొత్తచట్టం అమలు జరపకముందు 7 వారాల సెలవు మాత్రమే లభించేది.

## పిల్లల ఎంప్లాయిమెంట్

ఫ్యాక్టరీలలో పిల్లల్ని నియమించకుండా నిరోధించే శాసనం క్రింద రాష్ట్రంలోని ఏ ఫ్యాక్టరీలోనూ పిల్లలు పనిచేయకుండా చేయడం జరిగింది.

## షాపులు, ఎస్టాబ్లిష్‌మెంట్‌లు

షాపులు అలాంటి యితర సంస్థలలో పనిచేసే గుమాస్తాలు తదితరులకు బలమైన సంఘాలు లేనందున వారికి సహాయం చేసే ఆశయంతో ఒక శాసనం చేయబడింది. ఆంధ్ర ప్రాంతంలో మునిసిపాలిటీలు, మేజర్ పంచాయతీలకు యీ చట్టం వర్తిస్తుంది. మొత్తం 460 వేల మందికి యీ చట్టం వర్తిస్తుంది. తెలంగాణాలో మరో 20 ప్రదేశాలకు విస్తరింపజేసే ప్రతిపాదన ఉంది. అదీగాక మొత్తం రాష్ట్రానికి సమీకృత శాసనాన్ని తేవాలని ప్రభుత్వం సంకల్పిస్తున్నది.

## రవాణా కార్మికులు

మోటార్ రవాణాలో పనిచేసే కార్మికుల ప్రయోజనాల పరిరక్షణకు భారత ప్రభుత్వం తెచ్చిన క్రొత్తశాసనం యీ సంవత్సరం ఫిబ్రవరి 1 నుండి రాష్ట్రంలో అమలు జరుపబడింది. ప్రథమ చికిత్స, విశ్రాంతి గృహాలు, కేంటీన్ సౌకర్యాలు కల్పించడం, మామూలు పని గంటలకుమించి చేసిన పనికి ఓవర్‌టైం వేతనాలిచ్చేటట్లు చేయడం యీ క్రొత్త చట్టంలోని ప్రధానాంశాలు.

## వేతనాల చెల్లింపు

కార్మికులకు వేతనాలు సక్రమంగా చెల్లించేటట్లు చూడడానికి ఒక చట్టంఉంది. కార్మికశాఖ కమీషనర్, అసిస్టెంట్ కమీషనర్లు యీ విషయమై తలెత్తే వివాదాల పరిష్కారానికి అధికారాల్ని కలిగి ఉంటారు.

## కనీస వేతనాలు

వివిధ పనులలో నిమగ్నమై ఉండే కార్మికులకు కనీస వేతనాలు లభించేటట్లు చేయడానికి ఒక చట్టం ఉంది. కార్మికుల కనీస అవసరాలను—ఆహార పదార్థాలు, యితర వస్తువుల ధరల పెరుగుదల దృష్ట్యా—గమనించి ప్రభుత్వం కనీస వేతనాలను నిర్ణయిస్తుంది. ఆ విషయాల దర్యాప్తుకు కమిటీలను కూడ వేస్తుంది.

ఇప్పటికి యీ క్రింద వాటిలో పనిచేసే వారికి కనీస వేతనాలు నిర్ణయించబడినవి. ఉన్ని కంబళ్లు, బియ్యం మిల్లులు, పప్పు మిల్లులు, పొగాకు బీడీ పరిశ్రమలు, నూనె మిల్లులు, స్థానికసంస్థలు, రోడ్ల నిర్మాణం, భవనాలు, రాళ్ళను బద్దలు కొట్టే పని, మైకా, మోటార్ రవాణా, చర్మ పరిశ్రమ, వ్యవసాయ పనులు, సినిమా థియేటర్లు, కర్రపని, హోటళ్లు.

కొంత కాలానికి కనీస వేతనాల్ని పునః పరిశీలించడానికి ప్రభుత్వం కమిటీలను వేయవచ్చు. నిర్ణయించిన కనీస వేతనాల అమలుకు ప్రభుత్వం గట్టి చర్యల్ని గైకొంటుంది.

## ట్రేడ్ యూనియన్లు

భారత ట్రేడ్ యూనియన్ల చట్టం క్రింద రాష్ట్రంలో సుమారు 600 ట్రేడ్ యూనియన్లు పనిచేస్తున్నవి. క్రొత్త యూనియన్లు నిరంతరం రిజిష్టరవుతుంటాయి.

రాష్ట్రంలో ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఐ.ఎన్.టి.యు.సి.) అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ లాటి వివిధ రాజకీయ పార్టీలచే నెలకొల్పబడిన కార్మిక సంఘాలున్నవి. అనేక కార్మిక సంఘాలు వీటిలో ఒక దానికి అనుబంధించబడినా స్వతంత్రంగా ఉన్న కార్మిక సంఘాలు కూడ కొన్ని ఉన్నవి.

యజమానులలో ఎలాంటి వివాదం తలెత్తినా యీ కార్మిక సంఘాల ప్రతినిధులు కార్మిక శాఖ అధికార్లను కలుసుకొని వివేదిస్తారు.

## పారిశ్రామిక వివాదాలు

ప్రభుత్వం కార్మికులకు యజమానులకు మధ్య తలెత్తిన అన్ని వివాదాల్నీ సామరస్యపూర్వకంగా పరిష్కరించడానికి ప్రయత్నిస్తుంది. వివాదాల్ని సాధ్యమైనంత వరకు రాజీ మార్గంలో కార్మిక ఉద్యోగుల మంచితనంతో-పరిష్కరించడానికి ప్రయత్నం జరుగుతుంది. రాజీ చర్చలు విఫలమైతే మధ్యవర్తి పరిష్కారానికి నివేదించడం జరుగుతుంది. చివరకు విధిలేని పరిస్థితులలోనే కోర్టుకు వెళ్లడం జరుగుతుంది. ఈ ప్రభుత్వ విధానం వలన ఏటా సమ్మెల సంఖ్య బాగా తగ్గిపోతున్నది. విధిలేని పరిస్థితుల లోనే యజమానులపై ప్రాసిక్యూషన్‌కు ప్రభుత్వం పూనుకొంటుంది. ఉదాహరణకు 1961 లో కేవలం 7 సందర్భాలలోనే పారిశ్రామిక వివాదాల చట్టంలోని నియమాలను ఉల్లంఘించిన నేరంపై చర్య తీసుకోవడం జరిగింది.

## కార్మిక న్యాయ స్థానాలు

కార్మిక ఉద్యోగుల రాజీచర్చలు అన్నీ విఫలమైతే కార్మిక-యజమానుల వివాదాలు కోర్టులకు వస్తాయి. కార్మిక కోర్టులు గాక అడ్జుడికేషన్‌కు పారిశ్రామిక న్యాయ స్థానం (ట్రిబ్యునల్) ఉంది. అపెలేట్ ట్రిబ్యునల్స్ 1956 లో రద్దయినవి. పారిశ్రామిక ట్రిబ్యునల్, కార్మిక కోర్టులపై హైకోర్టు పర్యవేక్షణ ఉంటుంది.

## ఫ్యాక్టరీల చట్టం

చీఫ్ ఇన్‌స్పెక్టర్ అధీనంలో గల ఫ్యాక్టరీలశాఖ ప్రధాన కర్తవ్యం ఫ్యాక్టరీల చట్టం అమలుజరిగేటట్లు చూడటం. ఆ చట్టం పారిశ్రామిక ప్రమాదాలు జరగకుండా చూస్తుంది. పారిశ్రామిక సంస్థలలో పరిశుభ్రత ఉండేటట్లు, గాలి వెలుతురు వచ్చేటట్లు, పని గంటలు క్రమపరచబడేటట్లు, విశ్రాంతి, సెలవు నిబంధనలు పాటించబడేటట్ల, కార్మిక సంక్షేమానికి తగు చర్యలు తీసుకోబడేటట్లు యీ శాఖ శ్రద్ధ వహిస్తుంది.

ఈ శాఖ ఉద్యోగులు తరచు ఆయా ఫ్యాక్టరీలను పరిశీలిస్తారు. ఫ్యాక్టరీల నిర్మాణం, పునర్నిర్మాణం, విస్తరణలు, కొత్త యంత్రాంగాల స్థాపన విషయమై పథకాల్ని చీఫ్ ఇన్‌స్పెక్టర్ ఆమోదించాలి. ఫ్యాక్టరీల చట్టం క్రింద లైసెన్సు ఫీజు వసూలు చేయబడుతుంది.

## కార్మికుల ఆరోగ్యం, భద్రత

ధూళిని కార్మికులు లోపలికి పీల్చకుండా తగు ఏర్పాట్లు చేయాలనీ, ప్రకృతి సిద్ధమైన వెలుతురు కార్మికులకు లభించేటట్లు భవన నిర్మాణాలు కావించాలనీ, ప్రమాదకరమైన యంత్రాల చుట్టూ కంచె ఉండాలనీ యీ శాఖ పట్టుబడుతుంది.

· అలాగే కార్మికులకు తగినన్ని కేంటీన్‌లు, విశ్రాంతి గృహాలు, కార్మిక స్త్రీల పిల్లలకు క్రెచ్‌లు ఏర్పాటు చేయించే విషయంలో కూడా ప్రభుత్వం శ్రద్ధ తీసుకొంటుంది. యజమానులు రిజిష్టర్లు పెట్టేటట్లు నోటీసు బోర్డులలో ప్రకటనలను అంటించేటట్లు చూస్తుంది.

## గృహ వసతి

కొన్ని పారిశ్రామిక సంస్థలు తమ కార్మికులకు గృహ వసతి కల్పించినవి. కార్మికుల సహకార సంఘాలు కూడా పని చేస్తున్నవి. ప్రభుత్వం వీటిని ప్రోత్సహిస్తుంది.

ఫ్యాక్టరీల చట్టాన్ని అమలు జరిపే విషయమై ఫ్యాక్టరీల చీఫ్ ఇన్‌స్పెక్టర్ కొద్ది సందర్భాలలో మాత్రమే మినహాయింపులకు అనుమతిస్తారు.

## బాయిలర్ల చట్టం

ప్రభుత్వ బాయిలర్ల చీఫ్ ఇన్‌స్పెక్టరు భారత బాయిలర్ల చట్ట నిర్వహణ పని చూస్తారు. ఇటీవలనా నవీన బాయిలర్లు దిగుమతి కావడంతో బాయిలర్ల శాఖ బాధ్యత పెరిగింది. బాయిలర్ల రిజిస్ట్రేషన్, అక్కడి కార్మికులకు ప్రమాదాలు జరగకుండా చూడటం యీ శాఖ చేస్తుంది.

## కార్మిక సంక్షేమ కేంద్రాలు

కార్మిక సంక్షేమానికి నెలకొల్పబడే యీ కేంద్రాలలో పిల్లలకు క్రెచ్‌లు, నర్సరీ విభాగాలు, స్త్రీలకు ప్రత్యేక విభాగాలు, వయోజన కార్మికులకు విద్యా తరగతులు, పఠన మందిరాలు, గ్రంథాలయాలు, వినోద కాలక్షేపం, సినిమా ప్రదర్శనలు, ఆటలకు అవకాశాలుంటాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో 10 కేంద్రాలు నెలకొల్పబడినవి. తృతీయ ప్రణాళికా కాలంలో మరో 12 నెలకొల్పబడుతాయి.

## వయోజన విద్యా తరగతులు

నిరక్షరాస్యులైన కార్మికులకు విద్యాభ్యాస సౌకర్యాల్ని కల్పించేందుకు యీ తరగతులు తోడ్పడుతాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో 14 తరగతులు నెలకొల్పబడినవి. తృతీయ ప్రణాళికా కాలంలోమరో 12 నెలకొల్పబడుతున్నవి.

## కార్మిక విద్యా పథకం

కార్మిక విద్యా పథకాన్ని భారత ప్రభుత్వం రూపొందించింది. దీని ఆశయం కార్మికులలో ఆత్మ విశ్వాసం, విజ్ఞానం పెంపొందించి తమ బాధ్యతల్ని వారికి గుర్తింప జేయడం.

ఈ పథకం క్రింద హైదరాబాద్‌లో ఒక కేంద్రం, జిల్లాలలో 69 ప్రాథమిక కేంద్రాలు పనిచేస్తున్నవి. హైదరాబాద్ కేంద్రంలో 196 గురు కార్మిక ఉపాధ్యాయులకు, ప్రాథమిక కేంద్రాలలో 3394 గురికి యింతవరకు శిక్షణ గరపబడింది. శిక్షణ పొందిన వారు వివిధ ఫ్యాక్టరీలు, వాణిజ్య సంస్థలకు చెందినవారు.

## ఉత్పత్తి సంస్థ

పారిశ్రామిక భద్రత, ఆరోగ్యం, ఉత్పత్తిని అధికం చేసే ఆశయంతో హైదరాబాద్‌లో పారిశ్రామిక భద్రత, ఉత్పత్తి సంస్థ నెలకొల్పబడింది. లక్ష రూపాయిలతో ఒక భవనం గత సంవత్సరం నిర్మించబడింది. పారిశ్రామిక వేత్తలు పరికరాలు, యంత్రాలు కొనడానికి రు. 1 లక్ష యిచ్చారు. ఈ కేంద్రంలో యంత్రాల్ని పరిరక్షించే ఆధునిక పద్ధతులు, భద్రతకు తీసుకోవలసిన చర్యలు గాలి వెలుతురు వచ్చేటట్లు చేయడం గురించి ప్రదర్శించబడును. పారిశ్రామిక భద్రతలో శిక్షణ కోర్సును కూడ యీ సంస్థ నిర్వహిస్తున్నది.

## అధికోత్పత్తికి కౌన్సిల్

దేశంలో ఉన్న మనుష్యులు, యంత్రాల్ని గరిష్ఠ స్థాయికి వినియోగించి వ్యర్థ్యం జరగకుండా అరికట్టి ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించేందుకు యజమానులు, కార్మికులు, ప్రభుత్వం, తదితర ప్రతినిధులతో జాతీయ ఉత్పత్తి కౌన్సిల్ ఏర్పాటు చేయబడింది. ఈ కౌన్సిల్ ఉత్పత్తి పద్ధతులపై సమాచారాన్ని సేకరిస్తుంది. రాష్ట్ర కౌన్సిల్ కూడ ఉంది. పారిశ్రామిక సంస్థల నిర్వహణ, పారిశ్రామిక ఇంజనీరింగ్, పారిశ్రామిక సంబంధాలపై శిక్షణ గరపడం, పరిశోధనలు జరపడం యీ కౌన్సిల్ కార్యక్రమంలో ఉన్నవి. రాష్ట్ర కౌన్సిల్ చక్కెర, సిమెంటులకు రెండు కమిటీలను నెలకొల్పి ఉత్పత్తి సాంకేతిక శిక్షణ కోర్సును నిర్వహించింది.

## రాష్ట్ర కార్మిక సలహా బోర్డు

ఈ అన్ని అంశాల్ని పరిశీలించి ప్రభుత్వానికి సలహాలివ్వడానికి రాష్ట్ర కార్మిక సలహా సంఘం ఉంది. ప్రతి నాల్గు నెలలకొకసారి బోర్డు సమావేశమౌతుంది. కార్మిక మంత్రి దీనికి అధ్యక్షుడు.

## ఉద్యోగుల ప్రభుత్వ భీమా పథకం

పారిశ్రామిక కార్మికుని ఆరోగ్య రక్షణకు ఉద్దేశించబడిన యీ పథకం 1955 లో రాష్ట్రంలో ప్రవేశపెట్టబడింది. దీని క్రింద అనేక డిస్పెన్సరీలను నెలకొల్పి చికిత్స, ప్రసూతి సౌకర్యం, రొక్కపు సౌకర్యం కార్మికులకు లభింపజేస్తుంది. సుమారు 64,500 మందికి యీ పథకం వర్తిస్తున్నది. 16 కేంద్రాలలో అమలు జరుగుతున్నది.

## మంత్రి వివరణ

కార్మిక మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి రాష్ట్రంలో కార్మిక సంక్షేమానికి అన్ని విధాలయిన చర్యల్ని ప్రభుత్వం గైకొంటుందన్నారు. పరిశ్రమల యాజమాన్యంలో కార్మికుల భాగస్వామ్యం కొన్ని చోట్ల విఫలమైనదనీ, ఒకే పరిశ్రమలో ఒకే కార్మిక సంఘం ప్రతిపాదన అమలు జరగడం లేదనీ, అయినా కార్మికులు సుఖంగా జీవించడానికి, సంతృప్తితో ఉత్పత్తిని అధికం చేసి దేశాభ్యుదయ సాధనకు పాటుపడడానికి అనువైన వాతావరణాన్ని కల్పించడమే తమ లక్ష్యమన్నారు.

షాపులు, ఎస్టాబ్లిష్‌మెంట్ల విషయమై ఆంధ్ర-తెలంగాణా లలో ఉన్న ప్రస్తుత శాసనాల్ని సమీకరించే బిల్లును త్వరలోనే తేగలమన్నారు.



# నవలా రచయిత శిల్పము

బి.వి. కుటుంబరావు

నవలా రచయితృ శిల్పమనఁగా నవలను నిర్మించుటలో జూపు పనితనము. ఇది యనేక రకములుగా నుండును. కథను జక్కఁగఁ గూర్చి చెప్పు నేర్పు పేరు కథా సంవిధానము. ఇది శిల్ప ప్రధానమైన యంగము. అట్లే పదకము పన్నుట యనునది రెండవ నేర్పు. ఇట్టి వానిని బట్టియే నవలా నిర్మాణములో జాలఁ బనితనము చూపినాఁడందుము. వీనిలో ముఖ్యమైన కొన్నిఁటిని గూర్చి పరామర్శించుట శిల్ప పరీక్ష.

కథా సంవిధాన శిల్పమును బహు స్థూలముగ ద్విధాకరింప వచ్చును. దేని సులువు బరువులు దాని కున్నవి. మొదటిది యుత్తమ పురుష విధానము; రెండవది ప్రథమ పురుష విధానము. ఉత్తమ పురుష విధానమనఁగా 'నేను,' 'నేను' అనుచు నవలలో రచయిత తానొక పాత్ర యగుట. నాయకుఁడే కావలెనని నియమము లేదు. ప్రథమ పురుష విధానమనఁగా సర్వజ్ఞమైన పద్ధతి; ఇందు రచయితయే సర్వము చెప్పుచు సర్వసాక్షిగ మెలఁగును.

తొలుతఁ జెప్పిన యుత్తమపురుష పద్ధతి, కథనమునకు వాస్తవికతా భ్రాంతినాపాదించి తన ధ్యేయమునుండి రచయిత నేమరనీయదు. ఎందులకనఁగా నీ విధానములో నెంతవఱకును దాను జూచినవి, చేసినవి, వినినవి తనపైఁ బెట్టుకొని చెప్పవలెను. ఈ పద్ధతి నవలంబించుటతో గొన్ని కొన్ని ప్రమరణ సంస్థల ప్రత్యేకరీతుల వలనను, గొన్ని కొన్ని జాతి పరములైన స్వాభావిక విశేషములవలనను వాటిల్లు దోషములు వాటిల్లవు. ద్రావిడ ప్రాణాయామము లేక సుష్ఠైన కథనము కుదురును. కథయిత యెడలఁ జదువరికి సానుభూతి కలుగుట కీ విధానములో వీలు కూడఁగలదు. పఠిత యతనితో బూర్తిగ నేకీభవింపకపోవచ్చును. కాని చదువరి శ్రద్ధాసక్తులనాతఁడు గుప్పిటఁ బెట్టుకొనఁగలఁడు. అతనికిఁ దనపైననే యొక వ్యగ్రత కల్గునట్లుఁ జేసికొనను గలఁడు.

కథకుఁడు నాయకుఁడే కానక్కఱలేదు; అది యాత్మవృత్తాంతము కానక్కఱలేదుకూడ ననుకొంటిమి. అప్పుడు కథయిత దేశకాల పరిస్థితులను బాగుగఁ బరిశీలింపఁగలఁడు; అనుగుణమైన హితము బోధింపఁగలఁడు. కాని కథా ప్రవాహమును దన యిష్టానుసారముగ మఱలించు శక్తి మాత్రమాతని కుండదు. ఐనను జదువరిని దనలోని వానినిగా జేసికొనవచ్చును. పాత్రల యుద్దేశములు, ప్రవర్తనలు, శీలములు మొదలైన వానిలో వారిర్వురకు నుపేక్షాపేక్షలు సమానముగఁగల్గును. తాను సృష్టించిన పాత్రలతో దనకెంత పరిచయమో, యంత పరిచయమును రచయిత పఠితలకుఁ గల్గింపఁగలఁడు. తనకుఁబ్రతినిధిగా నొక నాయకుని నిర్మించి తనకుఁదానే నాయకుఁడైన దానికంటెఁ జదువరుల సానుభూతిని జూఱఁగొనఁగలఁడు.

ఈ ప్రక్రియలో లోపములుగూడ నున్నవి. నాయకుఁడే కథకుఁడైనచో నాత్మస్తుతి పరాయణత యనునది యిందు ముఖ్యముగ నెల్లరు చెప్పెడి ప్రధాన దోషము. కాని యాతఁడు గుణములనే వర్ణించుకొనునని రూఢిగ నెట్లుచెప్పఁగలము? దోషములను గూడ వర్ణించుకొనవచ్చును. ఒకవేళ నతఁడు తన పొరపాటులనే చెప్పుకొను నాయకుఁడు కాకూడదా? లేక యెంత మహాకథకుఁడైనను నే మధ్యమ పాత్రయో కావచ్చును గదా! పోనిమ్ము నాయకుఁడే యయి స్వగుణవర్ణనమే చేసికొనినను ధీరశాంతుఁడై యుండి కేవలము గతమును లోకసంగ్రహార్థము గ్రంథస్థము చేయు దృష్టితో దానిని నిగర్వముగ నిర్వహింపవచ్చును గదా! కాఁబట్టి యిది సార్వత్రికమైన దోషము కాదు.

తనచే వర్ణింపఁబడినది తన చరిత్రయేయైన నవలల యందు నాయకుఁ డితర పాత్రల కంటె వెలవెల పోవచ్చును. కాని దీనికిఁ గారణమేమి? రచయిత యాంతర దృష్టితో దన్ను దా బరిశీలించుకొని త్రికరణశుద్ధితో జిత్రించుకొనుటయే. తనకు

నిజమైన యా తత్తరపాటే యా దౌర్బల్యమే. యాయనిశ్చలతయే- తన కథనమునందుఁగూడఁ బ్రతిబింబించును. అట్లుఁగాక బాహిరపు దృష్టితో బరిశీలించి యితర పాత్రలను భావనాశక్తి చేతను, నుపజ్ఞ చేతను, దాను జిత్రించును గాఁబట్టి, రచయిత నాయకుఁడు కాని నవలలు మెఱుఁగుగ నుండును. నాయక ఖ్యాత స్వవృత్తము కంటె నాయక ఖ్యాత పరవృత్తము బాగుండుటకిదియే ప్రధాన హేతువు. ఆది విసర్గ నగ్న వాస్తవిక జగత్తుగదా మఱి!

ఈ యుత్తమ పురుష విధానమింకొక పరిమితికి లోనై యున్నది. నవలలోని పాత్రలెందఱు మరణించినను రచయిత మాత్రము మరణింపరాదు. 'అంతట నేను మరణించితిని' అన్నచో మనకీనవల వినిపించునదెవరన్న ప్రశ్న పుట్టును. కాఁబట్టి యిట్టివే యెన్నో సాధకబాధకము లీ పద్ధతిలో గలవు.

ఇఁకఁ గథన శిల్పములో ప్రథమ పురుష విధానమును గూర్చి యాలోచింతము. ఇందు కథకుఁడు సర్వజ్ఞత్వము నారోపించుకొని కథనాకళింపఁ జేసికొనుటకును, బాత్రల నర్థము చేసికొనుటకును, జదువరికిఁగావలెనని తనకుఁదోచిన విషయముల నన్నిఁటిని చెప్పును. పాత్రల రసభావములను, ప్రధానోద్దేశములను వర్ణించును. కొంత సేపు కొన్ని పాత్రలకు సంబంధించిన కొన్ని విషయములలో నిమగ్నుఁడగును; మఱి కొంత సేపు తద్భిన్నమైన పాత్రలకు సంబంధించిన విషయములలో మునిఁగి తేలును. మార్పులతోడి యీ ప్రక్రియ నవలంబించిన రచయిత చదువరికి విసుగు కల్గనీయఁడు; కథకుఁడక్కని చిక్కని పదకము నల్లుకొనును. దీనితో నవలకు సర్వతోముఖమైన వికాస మమరఁ గలదు. జీవితములోని సంశ్లిష్టత, విభిన్నత మున్నైనవన్నియు దీనితో కుదురుకొనుచున్నవి.

కాని యీ విధానములో గొన్నిపాత్రలు కల్గించు నౌత్సుక్యమును మఱికొన్ని కల్గింపవు. ఒక్కొక్కప్పుడు తనకిష్టములేని వైఖరిగల పాత్ర భోగ్యభాగ్యములను విని చదువరి సహింపవలసి వచ్చును; అట్టే తన కిష్టులైనవారి కష్టనిష్ఠురములకు నోర్పుకూడ వహింపవలెను. ఇట్టి నవలలు బృహత్ గ్రంథములుగ పెఱుగ వచ్చును; కథావస్తువు చిమ్మి వేసినట్లుండవచ్చును; శబ్దాడంబరము పెరుగవచ్చును. ఇట్టివెన్నో దోషములు దొర్లఁగలవు. ఈ పద్ధతి గల నవలల యందు కథకుఁడు సూక్ష్మరూపము ధరించి, యన్ని వేళలయందును వీలుగాని పరకాయ ప్రవేశము చేయవలెను; ఆ వ్యక్తుల భావములను దానునుభవింపవలెను. అనఁగా రచయితకుఁ బాత్రకు సాజాత్యము, సాధర్మ్యము ననునవి కుదురవలెను. తన పరిమితులుతనకుండుటచే నివియన్నియుఁ గుదరని రచయితలోఁతునకు పోలేక బాహిరఁపు దృష్టిచే పాత్రలను సృష్టించినచో జదువరి కాపాత్రలు సమ్మతిని విశ్వాసమును గొలుపలేవు.

ఈ ప్రథమపురుష కథన శిల్పముగల నవలలలో నింకొక మిశ్రపద్ధతి కార్యకారిగా నుండును. ఆ జాతి నవలలలో రచయిత సర్వవేళలయందు, సర్వపాత్రల విషయములోను సర్వసాక్షి కాఁడు. ఒకానొకపాత్ర విషయమునందుఁగాని, యొకపాత్ర ప్రవర్తనమునందుఁగల కొన్ని కొన్ని సందర్భములయందుఁ గాని, సర్వజ్ఞత్వము నారోపించుకొనును. 'అతఁడామె నవ్వుట చూచెను, అని సర్వజ్ఞుఁడై తానుచూచి వచ్చినట్లనును. అట్లే 'ఆమె నవ్వులోని భావ వైపరీత్యము నాతఁడు గ్రహింపక పోలేదు' అనును. అట్లన్నప్పు డావైపరీత్యమును రచయిత యాపాదించినవాఁడే గాని తాను చూచిరాలేదు; దానిని చూడలేఁడు. ఒక్కొకచోట నీయారోపమప్పుడే రచయిత తన సర్వజ్ఞత్వమును యథేష్టముగ విసర్జించుటయు నుండును.

ఇట్టి యిచ్ఛా పద్ధతియందొకపాత్ర చూచి, విని, యాలోచించి, యూహించిన విషయములను బట్టి యావత్కథయుసాగి, కడమ పాత్రలన్నిఁటి శీలములు గూడ దానితో నావిష్కరింపఁబడుటయేగాక, కథయంతయు వాస్తవికమను భ్రాంతిని గూడఁ గల్గించును. సందర్భ శుద్ధిలేని విషయములుగూడ నిగ్రహింపఁబడును. సంగ్రహాత ఘటిల్లును.

కాని చదువరి తన దృష్టి నొక్క పాత్రమీఁదనే కేంద్రీకరించి, యా పాత్రలాగుకొని పోయినట్లెల్లపోయి, చెప్పిన వన్నియు నమ్మవలెను. అగుచో, గథలో జరుగు విషయముల నన్నిఁటిని గ్రమక్రమముగ నా పాత్ర యాకళించుకొనుచుండుటయే, తనకుఁ జెప్పుచున్నట్లుగా నుండుటవలనఁ బాఠకుడు పాఠము తానే వానిని క్రమతః నిరూపించుకొనుచున్నప్పటివలె, సంతోషమును, భయమును, నిరుత్సాహమును, సందిగ్ధతను బొందుచుండును. వ్యాపక నవలల యందుండు నొకవిధమగు మార్మికత, ఛాయా మాత్రముగ నిట్టి కథ నావహించును.

కథన శిల్పమునందుఁ జాల నవల లిట్టి విధానమునే యవలంబించుటచేత రచయితకు రచనా పద్ధతి యందెదురగు పెక్కు కష్టములకిది తరుణోపాయమని తోఁచును.

లేఖల రూపమునందును, దినచర్య రూపమునందును నొకరొకరికి వినిపించునట్లును, స్వప్నవివరణాత్మకముగను నిర్మింపఁ

బడిన నవలలు కొన్నిగలవు, వాని పద్ధతి యుత్తమ పురుషము. భిన్నభిన్న పాత్రలు రచించిన లేఖలవి. ఈ పద్ధతి, యెవరో ద్రోహులవలన నా యుత్తరములు తన చేతులలో బడెనన్నంత వాస్తవికత్వభ్రమను గల్గించును. ఎట్టి స్వాప్నిక వృత్తాంతము నైనను సరే, యెంత ప్రాయోభావములేని కథనైనను సరే వాస్తవికమనిపింపవలెనని రచయితలు పాట్లపడుచున్న దినములివి. కాని యీ జాతికథన శిల్పమునందు, ద్రావిడ ప్రాణాయామము, నిష్కారణ క్లిష్టత దుస్సహమైన మందోన్మీలనము, శాబ్దికత్వము, సందర్భ రాహిత్యము నిష్కారణ స్థౌల్యము, మొదలగు దోషము లుండి రచయిత సిద్ధహస్తుఁడుకానియెడల, విసుగు కొల్పవచ్చును.

భాగములు భాగములుగా వెల్వడు ననుక్రమణిక నవల యనునది యొకటికలదు. తీరికలేక రచయితయు, స్థలములేక ప్రచురణకర్తయు నిష్టమువచ్చినచోట్ల నెల్ల నా వారమునకు గథ నాఁపుట, దాని లక్షణముగాదు. పఠనోత్కంఠాపాదకముగఁ బ్రకరణములను ముగించి ముందు ప్రకరణములో నేమి జరుగునో యేమి జరుగునో యనిపింపఁగల్గుటయే దానిలోని శిల్పము.

రచయిత శిల్పమునకుఁ గథనవైఖరి తర్వాతఁ బదకము పన్నుట రెండవయంగమని చెప్పితిని. పదకమునకుఁ బ్రాధాన్య మివ్వరాదను దృష్టికూడ నొకటికలదు. కొన్ని సన్నివేశములను సృష్టించి వానిలో బాత్రలను బ్రవేశపెట్టినయెడలఁ బదకము తనంతట తానే యల్లుకొనుచున్నది కదా!

ఔత్సుక్యమును గల్గించు విశ్వజనీనమైన యితివృత్తమును స్వీకరించుటలోగూడ రచయిత శిల్ప నైపుణి యగపడును. విశ్వజనీనత లేని యితివృత్తము వలన నవల సార్వకాలికము కాఁజాలదు. సంఘ సంస్కరణకు మత ప్రచారమునకును వినియోగింపఁబడిన నవలలగతి, గతించినవారము నాఁటి దిన వారపత్రికలవంటిది. నవలలోని వస్తు వుచితమై, పరిపూర్ణమై, విరోధరహితమై యుండవలెను. ఇందన్ని విషయము లయందు సమీచీనత్వము, సుషమ, సమానత్వము ననునవి పొసఁగవలెను. వర్ణితాంశములన్నియు సుసంఘటితములై మూలవస్తువునుండి మాలాపరంపరితములుగ నుండుట ముఖ్యము. అతిసాధారణ విషయముగూడ నసాధారణముగఁ జిత్రించుటలోనే రచయిత సఫలత్వము వ్యక్తమగును. ఘటనల క్రమము సన్నివేశరచన మొదలగునవన్నియు లౌకికమై సుసంగతమై స్వాభావికమై తోఁచవలెను. అది యెంత లౌకిక వృత్తమైనను సాధారణీకరణముచేత నవలలోగూడ రసోత్పత్తి గల్గింపవలెను. కథావస్త్వంత మారంభమునకు, వర్ణిత సన్నివేశములకు ననుకూలించియున్నయెడల పూర్వాపరసంబంధము చెడిపోదు. సుగమత్వమునకు, స్వాభావికతకు మనోముగ్ధకారిత్వమునకు లోపమురారాదు. శైథిల్యములేని శైలీ కౌశలముండవలెను. పాత్రపోషణ, పాత్ర కథావస్తువుల సంబంధము ననునవి ప్రధానములు. సంవాదములు వస్తూన్మీలన పోషకము లగుటయు, వర్ణనలు కథావస్తువుతో నభిన్నాధ్యవసాయము లగుటయుఁ జాల ముఖ్యము.

అవలంబించిన దేవిధానమైన నేమి? ఆహ్లాదమనునది కలుగవలెను. దేశకాల పరిస్థితులకు జీవితమునకు నవల రసవ్యాఖ్య యనిపించుకొనవలెను. జీవిత సత్యమును బ్రతిపాదించుట నవలాశిల్పమునకు ముఖ్యధర్మము. సన్నివేశములు కథాసాధకములేగాక, కథావస్తువునుండి యుద్భిజ్జములుగ నుండవలెను. వ్యక్తిత్వముగల పాత్రల ప్రవర్తనమునుండి కథావస్తువు పుట్టి నవలలో నల్లుకొని పోవలెను.

నూటికి నూఱుపాళ్లు క్రొత్తపాత్రల నెంతదిగివచ్చిన నవలాకారుఁడు కూడ సృష్టింపలేఁడు; ప్రాఁత పాత్రలనైనగాని రచయిత తన వ్యక్తిత్వ చిహ్నితము చేసినఁ జాలును. అట్లే నవలాకర్త కథావస్తువు విషయములోగూడ, "నిజమునకు క్రొత్తది" యనఁదగు దానిని దేనిని దేలేఁడు. క్రొత్తది యనఁబడు దానిలో నెల్ల నేమంత గొప్ప నిజమును బ్రతిపాదింపనులేఁడు.

కాఁబట్టి నవలారచయిత యెంత మహోదార శిల్పియైనను నతని రచన సమగ్ర సుందరము కాఁజాలదు. అది మానవ జీవితమువలె నెల్లప్పుడు నపరిపూర్ణమే! మహోత్కృష్టమైన నవలలు గూడ సర్వావయవ సుందరములు కానందుల కాశ్చర్య మేమియు లేదు. ఈ మాత్రముగనైన సుందరములైనందులకే మనమాశ్చర్య పడవలెను.



# బంగారు భూమి

కొండవీటి వెంకటకవి

కలిగిన దివ్య వాహినులఁగాంచినఁ గాంచన రత్న గర్భగా
వెలసిన మాతృదేశ పదవీ పరిపుష్టత నాత్మఁ గాంచినన్
బులకలు వాఱు మేను గతముందలపోసి విభిన్నరీతులన్
నలఁగిన సోదరాళిఁ గనినంగడు వేదన నివ్వటిల్లెడున్.

కులము మతమ్ము పేరఁ బురికొల్పిన దావహుతాశనచ్ఛటల్
నిలువున నీఱొనర్చెనవినీతియు, హింసయు, దాస్యవృత్తియుం
బలపడె లేనిపోనియనుమానము లెచ్చి సమైక్య భావముం
దొలఁగెను వీనిడుల్పఁ దొలుదొల్తఁ బ్రయత్నమొనర్ప మేలగున్.

పలువురు దేశనాయకులు ప్రాణములప్పనముంబొనర్చి యీ
బలఁగమునెల్లఁ గూర్చిరి; కృపాపరతంత్రుఁడు గాంధితాత యీ
కలిమికి మూలకందమయి గణ్యతఁగాంచెను జహ్వారుండునే
తలకును నేతయైపలువిధాల దరిద్రతడుల్పఁ బాల్పడెన్.

మట్టి ముద్దలనుండి మన్నీలఁ బుట్టించె;
        గట్టించె బలు వీర కంకణముల
నెండకన్నెఱుఁగని యిల్లాండ్ర నడిపించె
        విడిపించెఁ దెరలలో నడఁగు బ్రదుకు
సహనమ్ముతో నహింసా జ్యోతి వెలిఁగించెఁ
        దలఁగించె దాస్యాంధ తమసరాశి
కులమతాధిక్య సంకలనమ్ము సడలించె
        నడలించె నాంగ్లేయ యంత్రణమ్ము
    దాస దాసానుదాస తద్దాసదాస
    దాస దాసోహమను పురాతన వచస్సు
    నీసడించెను స్వాతంత్ర్య వాసనలకు
    దోఁసిలించెను మోహను దాసు గాంధి.

తమ పాలనమ్ము తామే
క్రమముగఁ జేయంగఁ గోరి కాదా పెద్దల్
శ్రమ పడిరి దాని ఫలమే
సమకూడెఁ బ్రజాళికా స్వసామర్థ్యమునన్.

ఇది జానపదుల యేల్బడి
ఇది గాంధీయుగము సుఖము లేరాశములై
పొదలునని యీ ప్రణాళిక
లొదవించిరి సార్థకమ్ము. లొనరింపుఁడీఁకన్

జనమును దేశమున్ దెలియఁ జాలిపరార్థముగోరి సేవలో
ఘనముగఁబట్టు భద్రులయి క్రాలెడివారలు సొంతలాభమున్
మననమొనర్పఁ జాలరనుమాట మహాత్ముఁడు విశ్వసించెనా
ఘనపథ మీప్రణాళికలుగాఁ దుదిరూపముదిద్ది తీర్చెడిన్.

పరిపాలనక్రియావరములందిన వారు
బడుగులంగాంచ నేర్పరులు గారు
ధనధాన్యములు ముక్కుమునుఁగఁగల్గిన వారు
నిఖు పేదలను గరుణింపఁబోరు
ధనము వెచ్చించి విద్యా వంతులౌవారు
నలువుర నొక్కరై కలియ లేరు
ఆభిజాత్యమ్మునందభిలాష గలవారు
జాత్యంతరుల మేలు సలుపవారు
మానవతనెంచి దేశసంపదనుబెంచి
విశ్వకల్యాణ మాత్మ భావించి మించు
సరసులౌవారు పైవారి నెరసు లణఁప
సుకము చేకూర్ప నీ ప్రణాళికలుగావె.

అహరహమ్మును నిండు ప్రాణాల బలిగోరి
మారియై పరఁగు నాహారబాధ
తనుధనమనములప్పనమొనర్చి పఠించి
జోగులైకను నిరుద్యోగ పీడ
పనిపాటు గనక జీవనము లేక నలంగి
వనట నందెడు కూలివాని గోల

అన్నమో రామచంద్రాయంచు నల్లాడు
మితిమీఱఁగాంచు సంతతిమహార్తి
దేవ మాతృక భూములందిండి లేక
కమ్మతము సేయు రైతు లోకమ్ముకస్తి
గడపఁగానిల్చి వీరకంకణముదాల్చి
లేమిడిని బాపు మనప్రణాళికల రూపు.

గిజిగీచినట్టు లుర్వరచుట్ట సంద్రమ్ము
సవరించు సంతతిన్ సగరుఁడందె
మురిపెమ్ముతో సురాసురల కీయఁగఁజాలు
తనయలఁ బెక్కండ్ర దక్షుఁడందె
చుక్కలగమి నెక్క సెక్కె మాడినయట్లు
బాలబాలికలకు చేలుఁడందె
జడజీవములను నెల్లెడ సంతతియగాఁగ
యతిశేఖరుండు కశ్యపుఁడునందె
సగరదక్షకుచేల కశ్యపులునేఁడు
వాడవాడల మనకుఁ గన్పట్టుచుండ్రు
సంతతి నిరోధమిఁకఁ జేయఁ జాలకున్న
నిలువబెత్తెఁడు చోటు గన్పింప దెందు.

అంతర్యుద్ధము లాధిబాధలు మహావ్యాధి చ్ఛటల్ గ్రమ్మగా
సంతంబౌభువి నిర్జనంబయిన విద్యావంతులౌవారలీ
సంతానంబును నుత్సహించిరిది మోక్షశ్రీకిమూలమ్ముగా
వింతల్పల్కిరినాఁడుఁ నేఁడదియ నోవింగూర్చె సంఘమ్మనన్.

ములుమోప నెడమీని భూమినల్గడలందుఁ
బైరుపచ్చలు వింతసౌరుచూప
జలబిందు వాకఁడేని జలధిఁ జేరఁగలేక
సేద్యంపు నేలలు చెమ్మగిల్ల
పలురకాలుగ సదా పంచామృతమ్ములు
కురియఁగాఁబసువు లాదరమునెరప

తులలేనిఖనిజ సందోహ దోహలముగా
శాస్త్రజ్ఞ సంఘ ముత్సాహ పఱుప
పంచవర్ష ప్రణాళికా పథము వెంట
భరత జనయిత్రి పరువులు వాఱి సుతులు
సకలసంపత్సమృద్ధులై సాఁగునట్టు
లఱిగొఱలులేక నవ్యనవ్యముగఁ జేయు.

వివరించె నెవఁడు మానవజాతి నిర్వాణ
మహాముచెరఁగ బౌద్ధ మహారహమ్ము
అలరించెనెవఁడు సర్వుల నహింసాసూత్ర
మున సత్యమును ధర్మమును లగించి
తొలగించె నెవఁడు జీవుల దేవతలకిడు
క్రొవ్విదమ్ముల దయ నివ్వటిలఁగ
సడలించెనెవఁడు దుస్సాధ్య జాతిద్వేష
ములసర్వమున్ మూలముట్టు గాఁగ
నతఁడు నాగార్జునుఁడు మహోయాన గురుఁడు
వాని సమభిఖ్య శాశ్వతత్వము వహింప
సాగరము నిర్మితింజేయఁ జాలుదెల్ల
లక్ష్యసిద్ధికినిది విదర్శనముగాదె.

(ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో)



# కార్మిక సంక్షేమం

బి. కృష్ణమూర్తి నాయుడు

కార్మికుల భౌతిక, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతికాభ్యున్నతికి దోహదమయ్యే వాటినన్నిటినీ, కార్మిక సంక్షేమ కార్యకలాపాలని నిర్వచించవచ్చు. కార్మిక సంక్షేమంపైననే, పారిశ్రామిక ప్రగతి, శ్రేయోరాజ్య స్థాపన, ఆధారపడి ఉంటుంది. పరిశ్రమల యజమానులకు, కార్మికులకు, మధ్య సుహృద్భావాలు, పారిశ్రామిక శాంతి నెలకొని పారిశ్రామీకరణ జాతీయ ఆదాయం, జీవనప్రమాణం పెరిగి దేశ ఆర్థిక సాంఘిక వ్యవస్థ పునః నిర్మాణం కావాలంటే కార్మికుడు క్షేమంగా ఉండాలి. దీనిని గుర్తించే ప్రభుత్వం, కార్మికునికి అండగా నిలిచి, అతని హక్కుల పరిరక్షణకు పూనుకొంది. అతని సంక్షేమానికి తోడ్పడే శాసనాలను రూపొందించింది.

కాని ఈ శాసనాలు హెచ్చు భాగం కార్మికునికి పరిశ్రమలలోనే సదుపాయాలను ఇవ్వగలిగాయి. కార్మికుడు, పరిశ్రమ వాతావరణానికే, పరిమితం కాలేదు గదా! అతనికి బయట వాతావరణం కూడా ఉన్నది. కుటుంబం, భార్యా బిడ్డలు, అతనిపై ఆధారపడినవారు ఉన్నారు. వారందరికి కూడా విద్యా వినోద వికాసాలు, ఆరోగ్య రక్షణ, అక్షరాస్యత, కలిగితేనే కాని కార్మికుడు క్షేమంగా ఉండజాలడు. ఈ సౌకర్యాల నన్నిటినీ కూడా కల్పించవలసిందిగా యజమానులను శాసన రూపేణా ఒత్తిడి చేయటానికి వీలు లేదు. కారణం పరిశ్రమ ఆర్థిక తాహతు. మరీ బలవంతం చేస్తే మొదటికే మోసం రావచ్చు. సమాజంలోని అన్ని వర్గాలకు ప్రభుత్వం అండగా ఉండాలి గనుక, యజమానులనే ఒత్తిడిచేయక బలహీన వర్గమైన కార్మికుల సంక్షేమాన్ని పరిరక్షించేందుకు పూనుకొనింది. మన దేశంలో కార్మిక సంఘాలకు కూడా సంక్షేమ కార్యకలాపాలను నిర్వహించే ఆర్థిక తాహతు లేకపోవడంతో ప్రభుత్వ బాధ్యత మరీ యినుమడించింది.

పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రభుత్వం నిర్దిష్టమైన కార్మిక విధానాన్ని రూపొందించింది. సంక్షేమ కార్యకలాపాలకు సంబంధించి సమగ్రమైన పథకాన్ని అనుసరించింది. దీని ఫలితమే కార్మిక సంక్షేమ కేంద్రాల స్థాపన, ఈ కేంద్రాలలో కార్మికులకు, వారి కుటుంబ సభ్యులకు విద్యా, వినోదం, వికాసం, సాంస్కృతికం, వైద్యం మొదలగుసౌకర్యాలను కల్పిస్తాయి, నైతిక ఉద్దీపనకు దోహదంచేస్తాయి. కార్మిక వర్గంలో సహనం, సఖ్యత సౌభ్రాతృత్వం ఏర్పడతాయి. ఇది కార్మిక ఉద్యమాన్ని పటిష్టం చేయటానికి తోడ్పడుతుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1958 వ సంవత్సరంనుంచి, ద్వితీయ ప్రణాళికాంతానికి రాష్ట్రంలో 10 కేంద్రాలను స్థాపించింది. అవి, జంటనగరాలలోని ఆజామాబాద్, ముషీరాబాద్, సనత్‌నగర్, సీతాఫల్‌మండిలోను, తదితర జిల్లాలలోని, సిరుపూర్, నిజామాబాద్, వరంగల్లు, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నంలలోను ఉన్నాయి.

మూడవ ప్రణాళికా కాలంలో మరో 12 కేంద్రాలను, అందులో ఏడింటిని ఆంధ్రప్రాంతంలోను, ఐదింటిని తెలంగాణా ప్రాంతంలోను స్థాపించటానికి ఉద్దేశింపబడింది. ఈ సంవత్సరంలో బోధన్ షక్కర్ నగర్‌లోను, ఆదోనిలోను, కర్నూలులోను ఈ కేంలను నెలకొల్పటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

ఇక ఈ కార్మిక సంక్షేమ కేంద్రాలలో నిర్వహించబడే కార్యక్రమాలు ఏవో అవి కార్మిక సంక్షేమానికి ఎలా తోడ్పడుతాయో చూద్దాం. వివరణ సులభం కావటానికి ఈ కేంద్రాలలో జరిగే కలాపాలను వివిధశాఖలక్రింద పరిశీలిద్దాం.

## వయోజన విద్య

కార్మికులు స్వతంత్ర భారతావనిలో తమ విధులను గుర్తెరిగి, కార్మిక ఉద్యమాన్ని పటిష్ఠం చేయాలంటే మొదట వారికి సామాన్యవిద్య అవసరం.

నాగార్జున సాగర్

# ఎడమ కాలువకు సొరంగ మార్గం

రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ 9-9-59న నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఎడమ కాలువ సొరంగమార్గాన్ని ప్రారంభించటంతో తెలంగాణా ప్రాంతపు పొడి ప్రదేశాల నీటి పారుదలకు కృష్ణానది నీటిని మళ్లించటానికి చేసే కృషిలో మరొక ముఖ్య ఘట్టం ఆరంభమయింది. ఈ సొరంగానికి 80 లక్షల ఘనపుటడుగుల రాతిని త్రవ్వి, 16 లక్షల ఘనపుటడుగుల కాంక్రీటు పూత పూయాలి. ఇటువంటి సొరంగ మార్గం ఇదివరకెన్నడూ త్రవ్వబడ లేదు. దీని పనికి ఇంచుమించు 750 టన్నుల ఉక్కు 15,500 టన్నుల సిమ్మెంటు కావాలి.

ప్రణాళిక అంతా పూర్తి అయేవరకు వేచివుండకుండా ముందుగానే ఫలితాన్ని పొందటానికై నాగార్జున సాగర్ ప్రాజెక్టు రెండు అంచెలలో నిర్మించబడుతున్నది. మొదటి అంచె అంచనా ఖర్చు రూ. 91 కోట్లు. మొదటి అంచెలో నాగార్జునసాగర్ జలాశయం స.స.మ. + 525 వరకు నీటిని నిలపచేయడానికి వీలుగా నిర్మించబడుతుంది. (పూర్తి అయిన పిమ్మట స.స.మ. + 590 వరకు నిలవ చేస్తుంది.) కుడివైపున 135 మైళ్ల పొడుగు కాలవ, ఎడమవైపున 108 మైళ్ళ పొడుగు కాలవ త్రవ్వబడతాయి. ఎడమకాలవ మునేరు వరకు నిర్మించబడుతుంది. దీనికి రూ. 23.96



9-9-59 న రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ నాగార్జునసాగర్ ఎడమ కాలువ సొరంగ మార్గాన్ని ప్రారంభించారు.

ఆదాయాన్ని పెంపొందించటానికి ఈ శాఖ ఉద్దేశించబడింది. ఈ విభాగం సుశిక్షణ పొందిన సంఘ సేవకురాలి అధీనంలో ఉంటుంది. కార్మికుల స్త్రీలకు తరగతులను నిర్వహించి వారికి కుట్టుపని, అల్లిక మొదలగు చేతి పనులలో శిక్షణ నిస్తారు. అందుకు కావలసిన బట్టలు, నూలు మొదలగు సామగ్రిని కూడా ఉచితంగా సరఫరా చేస్తారు. మహిళామండలులను స్థాపించి వాటి ద్వారా సాంస్కృతిక కార్యకలాపాలను ఏర్పాటు చేస్తారు. అప్పుడప్పుడు వన భోజనం వంటి కార్యక్రమాన్ని కూడా ఏర్పాటు చేస్తారు. 1959_60 సంవత్సరంలో రాష్ట్రంలోని అన్ని కేంద్రాల లోనూ రోజుకు సుమారు 40 మంది వంతున మహిళలు ఈ తరగతులకు హాజరయ్యారు.

## తదితర కార్యక్రమాలు

వివిధ పరిశ్రమలలోని కార్మికులకు రెడ్‌క్రాస్ సహకారంతో ప్రథమ చికిత్సలో శిక్షణను ఇచ్చి యోగ్యతా పత్రాలను ఇవ్వటం జరిగింది. కుటుంబ నియంత్రణ కేంద్రాలను నెలకొల్పి కార్మికులకు ఆ ప్రక్రియకు సంబంధించిన విజ్ఞానాన్ని ఇవ్వటం కూడా జరిగింది.

ఈ కార్యకలాపాలన్నిటినీ సమన్వయం చేయటానికి ప్రతి కేంద్రానికి ఒక సంచాలకుడు ఉంటారు. అలాగే రాష్ట్రంలోని కేంద్రాల కార్యకలాపాలను సమన్వయం చేయటానికి ఒక సూపరింటెండెంట్ ఉన్నారు.

ఈ సిబ్బంది, కార్మిక సంక్షేమ కార్యకలాపాలను పటిష్ఠం చేయటానికి కృషి చేస్తున్నది. పరిశ్రమల యజమానులు, కార్మికులు కూడా సహకారాన్ని ఇస్తున్నారు. కేంద్రాలు ఆటపోటీలను జరిపినపుడు పరిశ్రమల యజమానులు కొందరు బహుమతులు విరాళాలు ఇవ్వటమే ఇందుకు నిదర్శనం.

కార్మిక సంక్షేమ కార్యకలాపాలు మరింత పటిష్ఠం చెందవలసి ఉన్నాయి. అందుకు కార్మికులు, కార్మిక సంఘాలు, యజమానులు ప్రజలు కూడా ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం ఇవ్వాలి. అప్పుడే మనం రూపొందించుకోదలచిన సంక్షేమ రాజ్యాన్ని సాధించుకోగలం.






# దాద్రీకి రోడ్డు



దాద్రీ ఉత్తర ప్రదేశ్‌లోని అలహాబాద్ జిల్లాలో ఒక చిన్న గ్రామం ఈ గ్రామానికి బయటి ప్రపంచముతో ఏ విధమైన సంబంధమూ లేదు ప్రగతికే చిహ్నమైన రాకపోకలకి ఏ విధమైన రోడ్డూ ఈ గ్రామానికి లేదు.



కొన్నాళ్ళ తరువాత ఒక గొప్ప మార్పు జరిగింది. వేలకొలది ఇతర గ్రామాల వలెనే దాద్రీ గ్రామం కూడా చిరసుప్తి నుంచి మేల్కొని ప్రగతి శీలమైన ప్రణాళికల పిలుపునందుకొన్నది. వ్యవసాయదారులు ఇదివరలో కంటె కష్టించి పనిచేయసాగారు; అభివృద్ధిచెందిన వ్యవసాయ పద్ధతుల ద్వారా ఇదివరలో కంటె చెరకు ఎక్కువగా పండించసాగారు. ఈ చెరకును ఫ్యాక్టరీకి చేరవేయడానికి రోడ్డు అవసరం ఎంతైనావుంది.

సాహసవంతులైన దాద్రి గ్రామవాసులందరూ చేరి ఒక నిశ్చయానికి వచ్చారు. తమ గ్రామానికి దగ్గరగావుండే పక్కారోడ్డుకి అతి సమీప మార్గమును ఒక గీతతో సూచించారు. ఆ గీత ఎవరెవరి స్థలాలమంచి వెళ్ళిందో వారంతా ఆ స్థలాలను రోడ్డు వేయడానికి ఉచితంగా ఇచ్చారు. వెంటనే రోడ్డు తయారైంది. అభివృద్ధి ఉద్యమము యెడల, ఉజ్జ్వల భవిష్యత్తు యెడల ఆ గ్రామవాసుల అచంచల విశ్వాసానికి ఇది ఒక తార్కాణం.

*రోడ్ల నిర్మాణం ద్వారా పల్లెసీమలు సిరిసంపదలకూ, ప్రగతి పథానికి అతి చేరువగా వస్తున్నాయి. వీటిద్వారా పల్లె సీమల రూపురేఖలే మారిపోతున్నాయి. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికల కాలములో పదును వేయబడని రోడ్లు 1,51,000 మైళ్ళనుండి 2,50,000 మైళ్ళకు, పదును వేయబడిన రోడ్లు 97,500 మైళ్ళనుండి 1,44,000 మైళ్ళకు పెరిగాయి. మూడవ ప్రణాళిక కాలములో పదును వేయబడిన రోడ్లు అదనముగా 25,000 మైళ్ళు నిర్మించడమే కాకుండా పదును వేయబడని రోడ్ల విస్తృతి కూడా జరుగుతుంది*

**మూడవ పంచవర్ష ప్రణాళిక**

**ప్రతి ఒక్కరికీ**

**ఆనందదాయకమైన జీవితం**

కథానిక

# వరద

'భాను'

మునిమాపు చీకట్లు ముసురు కొంటున్నాయి. కనుచూపు దూరాన పడవనుండి ఏటిగట్టు కానవస్తున్నది. ఏట్లో పడవ నెమ్మదిగా పయనిస్తున్నది. లంక నుంచి వచ్చే జనం మౌనంగా పడవలో కూర్చున్నారు. గడ్డి మోపులు, దోసకాయ మూటలు పడవనిండా వున్నాయి. ఉండి ఉండి ఎవరో కూనిరాగం ఆల పిస్తున్నారు. కొంత మంది చుట్టలు త్రాగుతున్నారు. ఏటి ప్రవాహం నెమ్మదిగా త్రాచు పాము లాగా సాగుతున్నది. ఆ సమయాన యేరు చూడడానికి పెద్ద మసక అద్దంలా వున్నది. అప్పుడొక మనిషి చుట్ట కొన కొరికి తుపుక్కున యేట్లో వూసి—

'అఁ... అయితే...సోమాయ్...ఈ యేడు ఏటి ముంపు బాగా వుంటదంటావా ? వచ్చే జాడేమీ కనబడ్డం లేదే ?...అయినా మన మేమి జేత్తాం ?...అన్నాడు నుసిరాలువుతూ.

'అది నిజమే ననుకోండి...ముంపు వచ్చేనో...రాదో యెట్టా జెప్తతాం...ఈ యేడు లంక జూ స్తిరిగా...తరుణంలో వానలు బడ్డాయా...మొజొన్న ఏపుగా పెరిగి దాసరేణి యేసింది గదా.. దోసలు యిరగబడి కాశాయి...గొడ్డూ గోదకు మేత పెరిగింది...ఈ తరుణంలో కిష్ట వచ్చిందో నట్టమేననుకోండి' అన్నాడు దీనంగా.

'అంతా బగవంతుని దయ' అన్నాడు యింకొకడు. తలొక మాట అనుకొన్నారు ఏటి వరదను గురించి. అందరి మనసుల్లో ఏటి వరదను గురించిన భయం చోటు చేసుకొన్నది. అంతలో యేటి గట్టుకు పడవ వచ్చింది. అందరూ బిల బిల మంటూ మూటలతో, మోపులతో దిగారు.

మసక చీకటి ముదిరింది. సీమ తుమ్మచెట్ల గుబురుల్లో మిణుగురులు తిరుగుతున్నాయి. దూరాన యెక్కడో ఎడ్ల మువ్వల చప్పుడుతో పాటు, ఎడ్లను అదలిస్తున్న కుర్రవాడి పాట వినబడుతున్నది.

ఏ వూరురా నీదేపల్లెరా
కనుగీటినను చూసి నవ్వావురా ॥
మా చేనిలో మొక్క జొన్న మంచెపై
ఒంటిగనున్నా చుక్కానురా ॥

రైతు పడుచుల ముగ్ధ మోహనశృంగార గీతం అది. గోరు వంకలు, కీచు రాళ్ళు, మిడతలు కలసి శబ్దం చేస్తున్నాయి. గడ్డి మోపెత్తుకొని ఒక మనిషి యేటి గట్టు వెంబడి నడుస్తున్నాడు. వెనక నుండి ఇంకొక మనిషి తొందరగా వచ్చి కలుసు కొన్నది.

'ఎవరూ ఎనకా' అన్నాడు మోపు మనిషి

'నేను...'

'నేనంటే ?'

'గురివయ్య కూతుర్ని'

'రేణుకా' అన్నాడు గడ్డి మోపు మనిషి వెను తిరిగి ఆత్రుతగా

'మావాఁ' అన్నది ఆమె దగ్గరకు వెళ్ళి.

'ఏడనుంచి ఈ పాటేల వస్తన్నా'

'కోమటింటి దగ్గరనుంచి ఎచ్చాలు తెస్తన్నా'

'ఊఁ...మా అయ్య పొద్దుననంగా వచ్చాడుగా... అవునుగానీ...మన ఊసు యెత్తడం లేదా'

'ఊహూఁ'

'అయితే...అడిగెయ్య మంటావా ? ఎందుకూ ముసుగులో గుద్దులాట' అని ఆగి ఎడమ చేత్తో తలమీద మోపు పెట్టు కొని కుడి చేత్తో రేణుక చుబుకం ఎత్తాడు. రేణుక కళ్ళు మెరి శాయి. సిగ్గుపడిపోయింది.

ఊరు కనబడుతున్నది. కుక్కల అరపులు ఉండి వుండి వినబడుతున్నాయి. ప్రక్కన ఏరు లోలోపల నవ్వుకొంటూ ప్రవహిస్తున్నట్లుగా వుంది. పైన చుక్కలు ముసి ముసినవ్వులు

ఒలక బోస్తున్నాయి. ఏటి గాలి వీస్తుంటే ఒళ్ళంతా గగుర్పొడుస్తున్నది. ఆ గాలివాటు తప్పించుకుంటూ దాపులోనేవున్న కోష్ఠంలోకి యిద్దరూ వెళ్లారు కులాసా కబుర్లు చెప్పుకుంటూ. భూపతి మోపు కింద పడవేసిన తర్వాత ఇదివరకు జరుగుతున్నట్లే వాళ్లిద్దరి మధ్యా అవ్యాజానురాగస్వరూపానుభూతితో కొన్ని నిశ్శబ్ద మధురక్షణాలు గడిచాయి. రేణుక మెల్లగా మాట్లాడడం ప్రారంభించింది.

"ఎన్రోజులు మావాఁ...ఇట్లా . నాకెందుకో భయంగా వుంది. ఊర్లో శానామందికి మన సంగతి తెలుసుగదా. నాంచారమ్మకూతురు చిట్టి, రామమ్మ కూతురు సావిత్రి నన్ను ఎగతాళి పట్టిస్తున్నారనుకో...ఎంతకాలం మావాఁ...దొంగ సాటు యెవ్వారం...తొందరగా తాళి కట్టేయి మావాఁ...' అంది భూపతి కన్నుల్లోకి చూస్తూ.

' రేణుకా...కిష్టమ్మ మీద ఒట్టేసి చెబుతున్నా...నువ్వు బయపడొద్దు. నేను ఈయాళ మీ అయ్యను అడిగి ఒప్పిస్తాగా నేనిన్ను మోసం జేస్తానంటె పిచ్చిదానా...చూడు భూపతి మాట ...మరి...సరేనా '

పెదాల మీద నవ్వి తల దించుకొంది రేణుక.

' ఆఁ...అద్గదే...సరే...లే పోదాం...మీ అయ్య ఎదురు చూస్తాడు ' అని చెప్పి అలాగా మోపెత్తుకున్నాడు. ఇళ్ళ దగ్గరకు వచ్చిన తర్వాత ' ఈ రేత్రి మా అయ్యను అడగడానికి తప్పక రావాల ' అని మరీ మరీ చెప్పి వెళ్ళింది రేణుక.

రాత్రి యెనిమిది గంటలయి వుంటుంది. ప్రక్కన యేట్లో పడవల వాళ్ళ సందడి వినబడుతున్నది. జెముడుకాకి కాబోలు వుండి వుండి కూస్తున్నది. భూపతి స్నానం చేసి, అన్నంతిని యింట్లో ముసలమ్మతో సంగతి చెప్పి గురవయ్య యింటికి బయలుదేరాడు. గిలకబావిదాటి, బడిదాటి గురవయ్య యింటి వసారా ముందు ఆగాడు. అప్పుడే యింట్లో నుంచి వచ్చి మంచం మీద కూర్చున్న గురవయ్య ' యెవరూ...నుంచున్నది ' అనగానే ' నేను భూపతిని మామా ' అన్నాడు.

' అదే నుంచున్నావేం...రా...రా' అనగానే వసారాలోనికి వచ్చి ఎదురుగా మంచం మీద కూర్చున్నాడు. చేతులు నులుముకుంటూ. గిన్నెలు కడిగి బయట పారబోసి రేణుక సిగ్గుతో ఇంట్లోకి వెళ్ళింది.

లంకపుగాకు చుట్ట ముట్టించి గుప్పున పొగ వదులుతూ ' అన్నంతిన్నావా ?...ఏమిటేమిటి పాకాలు ' (కూరలు) అని అడిగి సమాధానం కోరకుండానే...' ఆఁ ..ఏంపని బడి వచ్చావ్' అన్నాడు తాపీగా ముసలాడు.

' ఏముంది...నీతో రెండు మాటలు అందామని వచ్చా అని యిటు అటు చూచాడు. తలుపు సందులో నుండి తొంగి చూస్తున్నట్లనిపించింది.

' ఏం...మాటలోయ్...అడుగూ...మనలో మనకేంటి... ఏమన్నా డబ్బా దస్కం...' అని ఆగాడు గురవయ్య.

' అబ్బే...అదేంగాదు...మీ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని వుంది...ఆ సంగతి తేల్చుకుందామని... ' అనగానే

' మా అమ్మాయినా...రేణుకనా...నీకా ! ఎన్ని గుండెల్తో అడగటానికి వచ్చావు. నీకున్నది ముష్టి మూడు గుంటలనేల. వియ్యానికి తగిన వోవా వుండొద్దూ. ఎవడన్నా చెప్పాడా..లేకుంటె నీఅంతట నువ్వేవచ్చావా? చూడు అబ్బాయి ..భూపతీ! బతికున్నప్పుడు ఎప్పుడో మీ యమ్మ, రేణుక అమ్మ యేదో ఊసుపోకకు అనుకొని వుంటారు. ఇప్పుడంటావా, లోకం మారి పోయిందిగా. మీ అమ్మాయిని యివ్వు అని నువ్వు అడగటం మంచిది గాదు నేను ' వూ ' అనటం అంతకన్నా...మంచిదికాదు. దానికితోడు అది తల్లి లేని పిల్ల ' అని ఆరిపోయిన చుట్టను చూచుకొన్నాడు.

భూపతికి లాగి నడియేట్లో గుండంలో తోసి నట్లయింది. నిజమా? కలా? అనిపించింది. లోపల రేణుకకు గుండెలో గుండె లేదు. భూపతికి కోపం, రోషం కలియబడివచ్చాయి

' ఇంతకీ నేను పెళ్ళాన్ని బతికించ లేనోణ్ణి అనేకదా నీ వుద్దేశ్యం, కోపంగా అన్నాడు...కాని గురవయ్య తాపీగా సమాధానం చెప్పడం ప్రారంభించాడు.

' చూడు భూపతీ! నువ్వు మహాబలిమి కలవాడవే కావచ్చు. నేకాదన్ను, గజయీతగాడివేగావచ్చు. అదీ కాదన్ను. నేననేది ఏమంటే బలిమె బువ్వ పెట్టదు కామట్టి మా కొంచెం భూమి గలోడికి మాత్రమే మా అమ్మాయిని యిద్దామనుకొంటున్నా. నీకెంత సత్తువున్నలాభంలేదు. చేరెడు నేల...కావాలి ..చేరెడు నేల



హైద్రాబాదు సమీపంలో మౌలాలీవద్ద ఆరుబయలు జైలులో ఖైదీలు భోజనం చేస్తున్న దృశ్యం.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ యస్. యం. శ్రీ నగేష్ 1962 అక్టోబరు 29వ తేదీన
నాగార్జునసాగర్‌ను సందర్శించారు.

గురవయ్య దోన తోటలు దాటి, చిలగడ దుంపల మళ్లు దాటి, రేగు కంపలు దాటి, జొన్న చేలు దాటి, యేటికయ్య ప్రక్కన వున్నతన మొక్క జొన్న తోట దగ్గరకు వెళ్ళాడు. కయ్య బాగా నిండిపోయి వున్నది. వెళ్ళి తాబేటికాయతో నీళ్ళు తెచ్చు కొన్నాడు కొంచెం తేరడానికి. గురవయ్యకు తోట చూసుకోగానే కడుపు నిండి పోయింది. చేనంతా దాసరేణి యేసింది. కలకలలాడుతూ కమనీయంగా కనిపించింది. ప్రాతఃకాలపు ఆ యేటిగాలికి దాసరేణి కదులుతూ వుంటే మత్తిల్లిన మనసు జోగుతున్నట్లుగావున్నది. కాని ఒకప్రక్క జొన్నపట్టె ప్రక్క పది పదిహేను మొక్కజొన్న కర్రలు వంగి పోయినట్లున్నాయి. చొప్పను కూడా యేదో జంతువు తొక్కినట్లు, తిన్నట్లనిపించింది. గురవయ్య క్రోధంతో కదిలిపోయాడు. కాలి గుర్తులు చూసి దున్నపోతుగా నిర్ణయించుకొన్నాడు. కొంచెం సేపటికి యేమీ చేసేదిలేదని ఆ వెలుపలి ప్రదేశానికి రేగుకంప దడికట్టాలని నిర్ణయించు కొన్నాడు. రేగు కంప కోసం ఏటి దరికి వచ్చాడు. ఏటి గాలి జయ్‌మని వీచింది. రెల్లు దుబ్బులు దాదాపు మునిగి పోయాయి. ఏరు మహోధృతంగా పొంగు తున్నది. పడవ నెమ్మదిగా రేవు దగ్గరకు వచ్చింది. పడవలో నుంచి 'ఒహో గురవయ్యా!' అనే కేక విన్పించగానే ఆగిపోయాడు. పడవలో నుండి దిగిన మనిషి దగ్గరకు వచ్చి అన్నపు మూట యిచ్చి 'వరద వచ్చేటట్టువుంది. తొందరగా యింటికి బయల్దేరు. మీ అమ్మాయి కలవర పడతాంది' అని చెప్పి మిగతా వాళ్ళకు అన్నాలు యివ్వటానికి వెళ్ళాడు. కాని గురవయ్య ప్రమాదాన్ని గురించి ఆదుర్దా పడడం లేదు. చేనుకు రేగుకంపతో కంచె కట్టాలనే నిర్ణయంతో వున్నాడు. రేగు కంపను కోసి రెల్లు గడ్డి ఎంట్లతో కట్టి తన చేను దగ్గరకు తీసుకొని వెళ్ళి దడికట్టి అన్నం తిన్నాడు. చుట్ట కాల్చుకున్నాడు. ఎక్కడా మొక్క జొన్న తోటల్లో నుండి పక్షులను అదిలించే ఒడిసెలల సవ్వళ్ళుగాని, ఒహోయ్ ఒహోయ్ అనే అదిలింపులుగాని విన బడ్డంలేదు. నెమ్మదిగా మంచె ఎక్కాడు. ఏటి గాలి జయ్‌మని వీచింది. అప్పుడు కలిగింది మనసులో భయం. కాళ్ళు వణుకు తుండగా మంచెదిగి పడవ దగ్గరకు హుటా హుటిగా నడక ప్రారంభించాడు. కాళ్ళ క్రింద తడి...ఏటి వరద వచ్చేసింది...ఇంకే ముంది సర్వనాశనం ...ఇంకా తొందరగా నడిచాడు—చీలమండల వరకు నీళ్ళు—ప్రక్క మొక్క జొన్న తోటలో నక్కలు ఊళలు వేస్తూ పరుగెత్తుతున్నాయి—గుండెలో భయం కలుక్కుమంది—ఇంకా తొందరగా పరుగెత్తాడు—మోకాళ్ళవరకూ నీళ్ళు—క్షణ క్షణానికి హెచ్చవుతున్నది నీటి మట్టం...పగ పట్టిన త్రాచు లాగా ఎగసిపడుతున్నది కృష్ణానది. సస్యశ్యామల క్షేత్రాన్ని కౌగిలించు కోవాలని ఆత్రుతతో పైశాచిక నృత్యం చేస్తున్నది కృష్ణానది. మానవ క్రౌర్యతకు పరిధి యేర్పరిచేటట్లు పరిభ్రమిస్తున్నది కృష్ణానది.

పరుగెత్తాడు గురవయ్య. ముఖం స్వేదబిందువులమయం. గుండెల్లో ఆయాసం. కన్నుల్లో పడవకోసం ఆకాంక్ష. కానీ పడవ ఇటు వచ్చే జాడే లేదు. కళవళపడుతూ, సుళ్ళు తిరుగుతూ, వేగంగా ప్రవహించే ఆ నదిలో పడవ నడపడానికి పడవ బోయీలు భయపడినట్లున్నారు. గురవయ్య కేకలు వేశాడు. సత్తువకొద్దీ అరచాడు. రోదన చేశాడు. అరణ్య రోదన ప్రయోజనం లేకపోయింది. అయితే ఆశ బ్రతుకు మీద సవాల్ చేసింది. మమత బ్రతుకుమీద విఘ్నం పెట్టింది. ఏం చేయాలి? వడివడిగా వెనుతిరిగి తోట దగ్గరకు వెళ్ళాడు. మంచెమీద ఎక్కి చేను కన్నారా చూసు కొన్నాడు. పసి పాపల్లాగా కదులుతున్నాయా దాసరేణితో మొక్క జొన్న కర్రలు...అంతంతా శ్యామలవర్ణంతో మెరిసి పోతున్నది మృత్యులా ఆవరించిన ఆకాశం క్రింద. పిట్టల కోలాహలం...ఏటి ప్రవాహగర్జన...నక్కల ఊళలు...ఏవో రక రకాల జీవుల ఆక్రందనలు...గురవయ్య మనసులోని నిరాశ వెల్లువలో కుమార్తె రేణుక కదలాడింది.

* * *

ఇంటి వద్ద రేణుక గుండెల్లో గుబులు బయలు దేరింది. ఇంకా అయ్య రాలేదే అని. ఏటి గట్టుకు వెళ్ళి నిలబడింది. మనసులోని భయం లాగా యేరు పొంగు తున్నది. అందరూ సామాన్లు సర్దు కొంటున్నారు. భూపతి ఇంటికి బయలు దేరింది. రేణుక నడుస్తుండగా 'అమ్మాయి రేణుకా...నువ్వమ్మా...ఇంటి కెళ్ళి వస్తున్నా...మీ అయ్య...లంకలో దిగబడి పోయాడమ్మా... ముసలోణ్ణి రమ్మని చెప్పా మొండికెప్పె...వస్తాలే...పో అన్నాడు. చివరకు పడవలో చూస్తే లేడు!! సాంబయ్యకొడుకు సుబ్బారావును వెళ్ళి గురవయ్యను పిల్చుకురా అంటె ససేమిరా అన్నాడు. ఇంకే ముంది అంత మంది మీ అయ్య కోసం ఆగలా. పడవ తోసేశారు. మళ్లీ పడవ ఎయ్యరంట...పాపం మీ అయ్య' అని చెప్పాడు అన్నాలు తీసుకొని వెళ్ళిన మనిషి.

రేణుక బోరున ఏడ్చింది. అమ్మలక్కలు గుమిగూడారు. గురవయ్య లంకలో దిగబడ్డాడు...అనే వార్త ఆనోట ఆనోట ప్రాకిపోయింది. అందరూ 'అయ్యో' అనే వాళ్ళే. ఏడుస్తూ భూపతి యింటికి వెళ్ళింది. భూపతి ఏవో వస్తువులు సర్దుతున్నాడు.

రేణుకను చూసి తలదించుకొన్నాడు. రేణుక వెళ్ళి 'మావాఁ' అని భుజం మీద తలపెట్టి బోరున ఏడ్చింది.

'ఏం ! రేణుకా ఎందుకొచ్చా. మీ అయ్య ఊరు కొంటాడా. వెళ్ళు' అనగానే మరింతగా ఏడవడం మొదలు పెట్టింది. భూపతికి అర్థం కాలేదు.

' మావాఁ...మా అయ్య లంకలో దిగబడి పోయాడు. పడవ ఎయ్యరంట...నువ్వు దప్పితే మాకు దిక్కెవరు...మా యయ్య ఆనాడన్న మాటలు పట్టించుకోకు మావాఁ...నా ముఖం చూశన్నా మా యయ్యను కాపాడు మావాఁ... ' అని కన్నీరు మున్నీరుగా దుఃఖించింది.

' నిజంగానా ?...వోరు చెప్పారు నీకు ' అని భూపతి ఆదుర్దాగా ప్రశ్నించాడు.

అంతలో అప్పుడే వచ్చిన ప్రక్కింటి మనిషి ' నిజమేమిట్రోయ్ అంతా నిజమే. చివరికి సాంబయ్య కొడుకు కూడా కొంచెం పిల్చుకురా గురవయ్యను అంటే ససేమిరా అన్నాడంటా ! ఎవరి ఆదుర్దాలో ఆళ్ళున్నారు. ఎవరాగుతారు చెప్పు. పడవా ..ఎయ్యరంట. ఇక నువుదప్పితే ఈ వూరిలో గురవయ్య రచ్చించే వాళ్ళు లేరురా ..నువ్వా గురవయ్యా మొన్న ఏమనుకొన్నా...నువుగానక రచ్చిస్తే...అంతా సరవుతుందనుకో, అని సాభిప్రాయంగా అన్నాడు.

భూపతి మనసులో గడచిన, గడవబోయే కథ చిత్రితమై వుంది. ఎదురుగా కన్నీళ్ళతో ప్రియురాలు. దూరంగా అసహాయ దశలో గురవయ్య ...! పరిస్థితులు ఏమైనా సరే రక్షించాలి...దృఢ నిశ్చయం చేసుకొన్నాడు.

' రేణుకా...నువ్వు భయపడొద్దు. నే నున్నాగా. మీ యయ్యను కాపాడే పూచీనాది ' అని చెప్పి రేణుక కన్నీళ్ళు తుడిచి మచ్చు మీదున్న రెండు బాడితె తెప్పలు తీసి, పంచె ఎగగట్టి బిగించి ఒక పగ్గం సిద్ధం చేసుకొని ఏరు యీదటానికి సిద్ధం అయ్యాడు. రేణుక మరింతగా యేడవడం ప్రారంభించింది. జనం పోగయ్యారు. ఎవరికి తోసిన విధంగా వాళ్ళు మాట్లాడు తున్నారు. ఆ ప్రొద్దున్నే భూపతి యింట్లో ముసలమ్మ ఊరు వెళ్ళింది కాబట్టి భూపతిని అభ్యంతర పెట్టే వాళ్ళు లేక పోయారు.

' జాగ్రత్త మావాఁ...నువు సుబ్బరంగా సుకంగా వస్తే అమ్మోరుకు నాలుగు కోళ్ళు యిస్తాను. జాగ్రత్త మావాఁ... ' అని గుండె మీద తల పెట్టి ఏడ్చింది.

' నాకేం భయం లేదు. నువ్వు దిగులు పడొద్దు ' అని చెప్పి మనసులో గంగమ్మను ధ్యానించుకొని యేరువైపు వెళ్ళాడు. ఆ సన్నివేశం తిరణాల లాగా వున్నది. అంచులు అని ప్రవహిస్తున్న ఆ ఏటిలో తెప్ప కొయ్య మీద బోర్లగా పండుకొని నీటిని చీల్చు కొంటూ సాగిపోతున్నాడు భూపతి. శిలా ప్రతిమలాగా నిల్చొని చూస్తున్నది రేణుక. ఆమె మనసులో ఆశ, ధ్యాస ద్వివిధంగా వున్నది. మగవాళ్ళు 'వాడికేం గజయీతగాడు ప్రమాదం లేదులే' అంటుంటె అబలలు ముక్కు మీద వ్రేళ్ళు పెట్టు కొంటున్నారు.

ఏరు మహోధృతంగా ప్రవహిస్తున్నది. మహా వృక్షాలు కొట్టు కొని వస్తున్నాయి. రకరకాల జీవులు కొట్టుకొని వచ్చే చెట్టు చేమ మీద ప్రాణాలు నిలుపు కొంటున్నాయి. ఉల్లోలమైన సుడి గుండాలలో వడివడిగా సాగుతున్న ఏటిలో ఈదడమే కష్టంగా వున్నది. బారులుగా కొట్టుకొని వస్తున్న అరటిచెట్లు, పిడకల గూళ్ళు, ఎండుపుల్లల మోపులు చనిపోయిన జీవాలు...ఏరంతా చిక్కిరి బిక్కిరిగా వున్నది. ఆ నీటి అలల శబ్దం నిశ్శబ్దమృత్యు దేవత అందియల నిస్వనంలాగా వున్నది...ప్రకృతిలోని వికృతి చేతులు బార్ల చాపి కరాళనృత్యం చేస్తున్నట్లుంది. భూపతి యీదుతున్నాడు. దూరంగా కొట్టుకొని వస్తున్న శవం...శవం మీద ప్రాణాలు నిలుపుకొంటున్న నల్ల త్రాచు ..ప్రక్కనే రెల్లు మోపుల మీద హృదయ విదారకంగా అరుస్తున్న జంగురుపిల్లి...జలదేవత కారుణ్యం ద్రవీభవించడం వల్లనే యింత ప్రమాదంగా వున్నదా అన్నట్లుగా వున్నది. భూపతి ఈదుతున్నాడు. అలలు ముఖం మీద విరుచుక పడుతున్నాయి ప్రవాహ వేగం తోసి వేస్తున్నది. దూరంగా లంక...రెల్లు దుబ్బులు మునిగిపోయాయి, జొన్నచేలు, మొక్క జొన్న తోటలు...అన్నీ జల స్నానం చేశాయి. లంక మీద పాదం మోపాడు, కంఠం వరకు వచ్చింది లోతు. గురవయ్య పొలం వైపు యీదాడు. మంచె మీద మూర్ఛ పోయిన గురవయ్య. ఆలస్యం చేయలేదు భూపతి. పగ్గంతో రెండవ తెప్పకు కట్టి వేశాడు గురవయ్యను. గురవయ్య కళ్ళు తెరచాడు. ఏమీ మాట్లాడలేదు...కన్నీరు కార్చాడు. భూపతి పగ్గాన్ని నడుముకు కట్టు కొన్నాడు.

కృష్ణవేణీమతల్లికి మనస్సులో వందనాలు సమర్పించి బయలు దేరాడు. ముందు భూపతి. దాదాపు ప్రక్కగా గురవయ్య, ' జాగ్రత్త మామా...పగ్గం వదల బాక. తెప్పను బోర్ల

(మిగతా 32వ పేజీలో)

# ప్రబోధము

జి. జోసపు

పూనిన కమ్మ భావముల పుప్పొడి గద్దెల గొల్వు దీఱి వి
జ్ఞానము తొల్కరించి, వికసన్నవకీర్తి కిరీటశోభతో
మానుగనేలు మా భరతమాతకుముద్దుల పుత్రకుండవై
న్యూనతగూర్ప మొగ్గితివయో! మతిదప్పిన త్రాగుబోతువై.

పరమపరాక్రమ ప్రభల భారత వీరవతంసులెందరో
గురియుచు వీరగానముల గుమ్మెట బాడుచు బోగుచుండ, ద
త్తరమున మద్య సారముల త్రాగిబజారుల పిచ్చివాడవై
తిరుగుట న్యాయమా హితుడ! దేశము దీనత బాఱజూడకే.

పోరుపొసంగె శాత్రవుల పుఱ్ఱెలుపుఱ్ఱెలు వ్రేటులాడు ని
ష్కారణ క్రౌర్యముల్ పెనగి కత్తులుకత్తులు తాండవింపగా
దీరి స్వతంత్ర దీక్షలకు దీకొనె దేశము. మత్తువీడిపో
రా! రణవీధి బ్రాణముల రాల్చను త్యాగము పూలు పూయగన్

అతుల దరిద్ర దేవతకు హాయి జిగిర్చెడి మద్య సార దు
ర్గతివిడనాడి. స్వచ్ఛమగు కార్యకలాపము నాచరింపగా
మతివికసింపకున్న నవమానముగర్భముదాల్చి దుష్టులౌ
సుతులగడించినీకిడును శోధనదేశము నాక్రమింపగన్

శబ్దించుచున్నవి శాత్రవ దుర్గాల
        విజయభేరులు లోకభీకరముగ
ఎగురుచున్నవి గొప్ప పగతుల శిరముల
        మూడువన్నెల వింతపూసిడంబు
ఈదుచున్నవి నెత్తు్రేటితరంగాల
        కసరు కత్తులు సానగఱకు దీఱ
బులిపించుచున్నవి భూరియుద్ధంబుల
        గెలుపుకన్నెల కీర్తి విలసనములు
మత్తువిడనాడి యికనైన పెత్తనమున
నందె దాలిచి మురిసి ముందంజవైచి
అందుకొనుమయ్య సమయ భాగ్యంపు నిధుల
నీమహోన్నత శక్తి పుంజీభవించి.





# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## అనంతపురం

### గ్రామ సహాయకుల శిక్షణ

తనకాల బ్లాకులోని రెడ్డివారి పల్లిలో బాలికలకై ఒక గ్రామ సహాయకుల శిక్షణశిబిరాన్ని సెప్టెంబరు 28 వ తేదీనుంచి మూడు రోజులపాటు నిర్వహించారు.

### శ్రమదానం

ముదిగుబ్బ పంచాయతీ సమితిలోని పట్నంలో హరిజన దినోత్సవం జిల్లా కలెక్టరు అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా అధికారులు, అనధికారులు హరిజనవాడను శుభ్రంచేశారు. సామాజిక విందుకూడా జరిగింది.

### 50 మంది సభ్యులకు శిక్షణ

రోళ్ళ పంచాయతీ సమితిలోని రాగలింగానహళ్ళిలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి సెప్టెంబరు 20 వ తేదీనుంచి మూడు రోజులపాటు నిర్వహించబడింది. అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన విషయాలలో 50 మంది సభ్యులకు శిక్షణ గరిపారు.

సెప్టెంబరు 25 వ తేదీన మశూచి నిర్మూలన దినోత్సవం కూడా జరిగింది.

## కడప

### టి. బి. వార్డు ప్రారంభం

కడపలోగల జిల్లా కేంద్ర ఆస్పత్రిలో 20 పడకల క్షయ రోగుల వార్డుకు కలెక్టరు సెప్టెంబరు 28వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు. ఈ వార్డును 36 వేల రూపాయల ఖర్చుతో నిర్మించారు.

## కరీంనగర్

### జాతీయ పరిశుభ్రతాదినం

మెట్పల్లి పంచాయతీ సమితి ఆధ్వర్యాన అక్టోబరు 2 వ తేదీన మెట్పల్లిలో జాతీయ పరిశుభ్రతా దినం పాటించబడింది. ఈ సందర్భంగా జరిగిన వ్యాసరచన పోటీలో గెలుపొందిన వారికి బహుమతుల నిచ్చారు.

### పశుప్రదర్శన

సెప్టెంబరు 29వ తేదీన మెట్పల్లిలో పశువుల ప్రదర్శన జరిగింది. మెట్పల్లి, కోరట్ల సమితులకు చెందిన దాదాపు 25 గ్రామాల పశువులు ఈ ప్రదర్శనలో ప్రదర్శింపబడినాయి. ఈ ప్రదర్శనలో జోగినపల్లి వృషభానికి ఉత్తమ బహుమతి లభించింది.

కృష్ణా

శిక్షణశిబిరం

తిరువూరు పంచాయతీ సమితికి చెందిన ఆంజనేయ పురంలో మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరాన్ని సెప్టెంబరు 18 వ తేదీనుంచి ప్రారంభించారు. కేర్‌సంస్థ సహాయంతో సమితిలోని పెక్కుచోట్ల మధ్యాహ్నభోజన కేంద్రాలను ప్రారంభించారు.

ఉపాధ్యాయుల దినోత్సవం

నూజివీడు పంచాయతీ సమితి ప్రాంతంలోగల అన్ని పాఠశాలలలో సెప్టెంబరు 5వ తేదీన ఉపాధ్యాయుల దినోత్సవం సముచిత రీతిగా జరిగింది.

గుంటూరు

మధ్యాహ్నభోజన పథకం

గురజాల పంచాయతీ సమితిలోని 20 పాఠశాలలలో మధ్యాహ్నభోజన పథకాన్ని కేర్‌సంస్థ సహకారంతో ప్రారంభించారు. ఈ పథకం 1,230 మంది విద్యార్థులకు లాభిస్తుంది.

పశువుల ఆస్పత్రి

ఈమని పంచాయతీసమితికి చెందిన చిలుపూరు గ్రామంలో పశువుల ఆస్పత్రిని సెప్టెంబరు 14 వ తేదీన కలెక్టరు ప్రారంభించారు. ఈ భవన నిర్మాణానికి కావలసిన స్థలాన్ని గ్రామ పంచాయతీ మాజీ అధ్యక్షులు శ్రీ వై. సీతారామయ్య దానం చేశారు. విస్తృత బలవర్ధకాహార కార్యక్రమంక్రింద ఆ గ్రామంలో ఒక కోళ్ళ పెంపకం కేంద్రాన్ని కూడా ప్రారంభించారు. 45 మందికి గ్రుడ్లు పంచిపెట్టారు.

విమానంనుంచి మందుచల్లే కార్యక్రమం

వరి పొలాలపై హెలికాప్టర్ నుంచి మందుచల్లే కార్యక్రమాన్ని ఈమని పంచాయతీ సమితిలో సెప్టెంబరు 26వ తేదీన జిల్లా కలెక్టరు ప్రారంభించారు. ఈ విధంగా హెలికాప్టర్‌నుంచి మందు చల్లడం గుంటూరు జిల్లాలో ఇదే మొదట. ఈ సౌకర్యాన్ని వినియోగించుకోడానికి రైతులెంతో ఉత్సాహం ప్రదర్శించారు.

చిత్తూరు

జాతీయ పొదుపు ఉద్యమం

నగరి పంచాయతీ సమితికి చెందిన మునగమాకులకోట, అనంతప్పనాయుడు కండిగ గ్రామాలలో జాతీయపొదుపు ఉద్యమం విషయంలో ఒక ప్రత్యేక ఉద్యమాన్ని సెప్టెంబరులో ప్రారంభించారు. ఆ ఉద్యమంపట్ల గ్రామీణుల ఆసక్తి ఎంతో ప్రోత్సాహకరంగా వుంది.

తూర్పు గోదావరి

హాస్టల్ ప్రారంభం

కాకినాడలోని రంగరాయవైద్యకళాశాల పురుషుల హాస్టల్‌కు అక్టోబరు 1 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ హాస్టల్‌ను ఆరు లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించారు. అందుకవసరమైన ఆరెకరాల స్థలాన్ని శ్రీ కోటమర్తి వెంకన్న విరాళంగా ఇచ్చారు. ఆ మర్నాడు సత్యవతీదేవి స్త్రీల కళాశాలకు కూడ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

నల్గొండ

మశూచి నిర్మూలనదినం

నల్గొండలో సెప్టెంబరు 25వతేదీన జాతీయ మశూచి నిర్మూలన దినోత్సవం జరిగింది. ఆ సందర్భంగా జాతీయ మశూచి నిర్మూలన కార్యాలయాన్ని జిల్లా పరిషత్ అధ్యక్షులు ప్రారంభించారు.

నిజామాబాద్

ఆరోగ్యకేంద్రం ప్రారంభం

బన్స్వాడా పంచాయతీ సమితి పిట్లం గ్రామంలో ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రాన్ని జిల్లా పరిషత్ అధ్యక్షులు అక్టోబరు 2వ తేదీన ప్రారంభించారు. ఈ ప్రాథమిక కేంద్రానికి గ్రామస్థులు ఆరువేల రూపాయలను, రెండెకరాల భూమిని విరాళంగాఇచ్చారు.

నెల్లూరు

సర్వోదయ ఉత్సవం

కొండపి పంచాయతీ సమితిలోని కొండపిలో సెప్టెంబరు 11వ తేదీనుంచి అక్టోబరు 2వ తేదీ వరకు సర్వోదయ పర్వోత్సవం జరిగింది.

పశ్చిమ గోదావరి

పరిశుభ్రతాదినం

పెంటపాడు పంచాయతీసమితి అధ్వర్యాన జాతీయపరిశుభ్రతా దినోత్సవం జరిగింది ఈ సందర్భంగా జరిగిన శ్రమదానంలో అధికారులు, అనధికారులు పాల్గొన్నారు. పెంటపాడులో మూడు వేల రూపాయల వ్యయంతో కట్టిన సైడుకాలువలను గ్రామ పంచాయతీ అధ్యక్షులు ప్రారంభించారు.

## వరంగల్

మలుగు పంచాయతీ సమితి అధ్వర్యాన ఇంచెర్ల గ్రామంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని సెప్టెంబరు 23 వ తేదీ నుంచి మూడు రోజులపాటు నిర్వహించారు. వ్యవసాయం, పశు పోషణ, పరిశ్రమలు, సహకారం మొదలైన విషయాలలో 50 మంది సహాయకులకు శిక్షణ ఇచ్చారు.

### మధ్యాహ్నభోజనం

పర్కాల పంచాయతీ సమితి ప్రాంతంలో కేర్ సంస్థ సహాయం క్రింద 13 మధ్యాహ్నభోజన కేంద్రాలను ప్రారంభించారు. పాఠశాలలకు వెళ్ళే పిల్లలలో ఈ పథకం బహుళ ప్రచారంలో వుంది.

## విశాఖపట్నం

### సమితిప్రారంభం

అరకులోయ పంచాయతీ సమితిని సెప్టెంబరు 1 వ తేదీన విశాఖపట్నం జిల్లా పరిషత్ అధ్యక్షులు ప్రారంభించారు.

## శ్రీకాకుళం

### వర్తకుల దాతృత్వం

శ్రీకాకుళం జిల్లా సోంపేట ఎలిమెంటరీ పాఠశాలలో మధ్యాహ్నభోజన పథకాన్ని రెవిన్యూమంత్రి సెప్టెంబరు 18 వ తేదీన ప్రారంభించారు. పాత్ర సామగ్రి కొనడానికి స్థానిక వర్తకులు వందరూపాయల విరాళాన్నిచ్చారు. అంతేగాక పథకం అమలుకుకూడా అంతే మొత్తాన్ని వర్తకులు ఇచ్చారు.

---

(28 వ పేజీ తరువాయి)

నీయబాపడక.' అని ఈదడం ప్రారంభించాడు. ఇద్దరి బరువుల్ని ఆ వేగంలో లాగవలసి వచ్చింది. గుండె దిటవుచేసు కొన్నాడు. చేతులతో నీటిని పాయలు చేస్తూ ఈదుతున్నాడు. అడ్డం వస్తున్న రకరకాల అవరోధాలను దాటు కొంటూ, తప్పించు కొంటూ ఈదుతున్నాడు. ఆ అగమ్యమార్గంలో దాదాపు సగం దాటారు. చేతుల్లోశక్తి సన్నగిల్లింది. ప్రవాహం ఇష్టం వచ్చినట్లుతోసి వేస్తున్నది. గురవయ్య ముసలి గుండెలో భయం నిండి పోయింది. ఇక బ్రతికే ఆశ లేదు–అనే నిర్ణయానికి వచ్చాడు. రెండు మూడు నిరాశా పూరిత వాక్కులు నోటి వెంట వచ్చాయి అస్పష్టంగా. నోటంట మాట పడి పోయింది. ఆ హోరులో, ఆ అలల తాకిడిలో, ఆ భయానక దృశ్యంలో భూపతి వున్నశక్తిని కూడదీసుకొని ఈదుతున్నాడు. రేణుకతో కృష్ణ మీద వేసిన ఒట్టు విఫలమై పోతుందా ? పోదు కృష్ణవేణమ్మ తల్లి తనకు హాని కలిగించదు– అనే ప్రగాఢ విశ్వాసంతో శక్తి పుంజు కొని ఈదుతున్నాడు. ప్రవాహం మూలగాతోస్తున్నది. ఊరు దూరమై పోతున్నది. ఎక్కడో ఒక చోట చేరక పోతామా అనే అంతిమ నిశ్చయంతో ఈదుతున్నాడు. సర్వాంగాలు చచ్చు పడ్డాయి. ఊపిరి సరిగా పలపడం లేదు....అయినా గ్రుడ్డిగా నరనరాల్లోని శక్తి పుంజు కొని ప్రవాహంతోపాటు పయనిస్తున్నాడు. ఎంత కాలం అల్ప జీవి మానవుడు ప్రకృతితో ఛాలెంజీ చేయగలడు !! శక్తి వున్నంత కాలమే. అదీ పరిమితమే...గట్టు కొన్ని గజాల దూరంలో మసగ్గా కానవస్తున్నది. ఏదో కోలాహలం...చెవుల గ్రహణశక్తి సన్నగిల్లింది...కళ్ళ మీది రెప్పలు సమ్మోహనం చెంది అలసి పోయాయి...నరనరాల్లో విపరీతమైనగ్లాని...ఇక లాభం లేదా ? తరుణ జీవితానికి సమాప్తా ..అనేస్థితి ..గుండెల్లో పిరికితనం మృత్యుదేవత మంగళాచరణా ?... రేణుక... భూపతికి ... కన్నుల్లో మెదిలింది...భూపతి చివరి సారిగా మూలిగాడు. గట్టు చేతికి అందినట్లనిపించింది...అంతే మూర్ఛ పోయాడు.

* * *

ముని మాపు చీకట్లు ముసురు కొంటున్నాయి. భూపతి మెల్లిగా కళ్ళుతెరచాడు. తల రేణుక ఒడిలోవున్నది. ఒంటి మీద దుప్పటి కప్పబడి వుంది. ప్రక్కనే గురవయ్య కూర్చొని వున్నాడు. చుట్టూ జనం...కోలాహలం. రేణుక కన్నుల్లోకి చూశాడు అవధుల్లేని ఉత్సాహం ; సంతృప్తి కాంతిగోచరించింది. గురవయ్య వైపు చూశాడు. క్షమాపణాదృక్కులు కృతజ్ఞతా దృక్కులు కలిసిపోయాయి. భూపతికి శారీరక బాధ సడలింది. గుండెలో ప్రశాంతి నిండింది.

అంతలో ఎవరో అన్నారు—ఏమి చోద్యమోకానీ వరద తగ్గు ముఖం పట్టిందిరా. అదృష్టమే ఈ యేడు.

దూరంగా కలధ్వానంతో ఏటిలోని వరద నవ్విందా అన్నట్లు మనసులో అనిపించింది భూపతికి.



బలిమెల (ఎగు: సీలేరు) కంట్రోలు బోర్డు సమావేశం 30-9-62 తేదీన భువనేశ్వర్‌లో జరిగింది.

అమెరికన్ ట్రావెల్ ఏజంట్ల ప్రతినిధులు 1962 అక్టోబరు 7వ తేదీన గోలకొండ కోటను సందర్శించినపుడు తీసిన ఫోటో.



1962 అక్టోబరు 10వ తేదీన నాగార్జునసాగర్ ప్రాజెక్టును తిలకిస్తున్న ఇండియాలోని
అమెరికా రాయబారి ప్రొఫెసర్ గాల్‌బ్రెత్.



విశాఖపట్నానికి త్రాగు నీటిని సరఫరా చేసేందుకై రూ. 4 కోట్లు ఖర్చుకాగల తాటిపూడి జలాశయ పథకానికి
రాష్ట్ర మునిసిపల్ పరిపాలనా శాఖామంత్రి శ్రీ అలపాటి వెంకట్రామయ్యగారు
1962 అక్టోబరు 2వ తేదీన శంకు స్థాపన చేశారు.



హైద్రాబాదు సమీపంలో మౌలాలీవద్ద ఆరుబయలు జైలులో ఖైదీలు భోజనం చేస్తున్న దృశ్యం.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ యస్. యం. శ్రీ నగేష్ 1962 అక్టోబరు 29వ తేదీన
నాగార్జునసాగర్‌ను సందర్శించారు.



1962 అక్టోబరు 7వ తేదీన కృష్ణా జిల్లా చల్లపల్లిలో విమానం మీద నుంచి పొలాలలో
మందు చల్లుతున్న దృశ్యం.

కాకినాడలో రంగరాయ మెడికల్ కాలేజీ పురుషుల హాస్టల్‌కు ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి
1–10–1962 న ప్రారంభోత్సవం జరిపారు.

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 6 గురు ఉపాధ్యాయులకు ఈ సంవత్సరం జాతీయ బహుమతులు లభించాయి.



శ్రీ: రాజావిజయమ్మ, ప్రధానోపాధ్యాయిని, రివర్‌డేల్ హైయ్యర్ ఎలిమెంటరీస్కూలు, రాజమండ్రి.



శ్రీ మొహమ్మద్ ఇసాఖ్, ప్రధానోపాధ్యాయుడు, ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, స్టేషన్ దబీర్‌పూరా, హైద్రాబాదు.



శ్రీ యస్. యల్. నరసింహారావు, 1వ గ్రేడు స్కూలు అసిస్టెంటు పి. ఆర్. గవర్నమెంటు కాలేజి హైయ్యర్ సెకండరీస్కూల్, కాకినాడ.



శ్రీ కొలిపెల వీరన్న చౌదరి, ప్రధానోపాధ్యాయుడు, ఎలిమెంటరీ మోడల్ స్కూలు, ఉండూరు, రాయచంద్రపురం పంచాయతీ సమితి, తూర్పుగోదావరి జిల్లా.



శ్రీ ఆర్. భీమసేనరావు, ప్రధానోపాధ్యాయుడు, పంచాయతీ సమితి జూనియర్ బేసిక్ స్కూలు, హాలాహరిర్ పోస్టు, ఆలూరు తాలూకా, కర్నూలు జిల్లా.



శ్రీ వి. యస్. వెంకటనారాయణ, ప్రధానోపాధ్యాయుడు, మునిసిపల్ హైస్కూలు, తిరుపతి.



గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా పూండ్ల గ్రామంలో ప్రాథమిక పాఠశాల కొరకై రూ. 25,000/- ల విలువగల భవనాన్ని విరాళమిచ్చిన శ్రీమతి నన్నపనేని బుచ్చమ్మ



నల్గొండ జిల్లా, భువనగిరి తాలూకాలో ఉత్తమ గ్రామ పంచాయతీగా పేరుపొందిన యాదగిరిగుట్ట గ్రామంలో తమ గ్రామానికి మంచినీటి సరఫరాకై రూ. 920/- లు విరాళమిచ్చిన వడ్డె కులానికి చెందిన బీద దంపతులు శ్రీ యెర్ర యెల్లయ్య, శ్రీమతి వెంకమ్మ.

నా టి క :

# చీకటిలో వెలుగు

ముద్దంశెట్టి హనుమంతరావు

(గత సంచిక తరువాయి)

(అదే సమయానికి కాఫీ కప్పుతో ప్రవేశిస్తాడు రామయ్య. వేదవతి ఆవేదన చూస్తాడు. అతనికేమీ అర్థం కాదు. మూర్తి వెళ్లిపోయినందుకే ఆమె యింకా బాధపడుతుందని అనుకొంటాడు.)

రామ : ఎందుకమ్మా యింక బాధపడతారు : బాబుగారు వచ్చేశారుగా :

వేద : (మౌనంగా కుమిలిపోతుంటుంది)

రామ : (మూర్తికి కాఫీ కప్పు అందిస్తూ) ముందు కాఫీ తీసుకోండి బాబూ :

మూర్తి: (బాధగా) రామయ్యా: అందులో కొంత విషం కలిపి యివ్వు.

రామ : అదేంటి బాబూ : (విస్తుపోయి మూర్తి వేపు చూస్తుంటాడు.)

మూర్తి: అంతే రామయ్యా ! అదే నాకు సరైన శిక్ష.

రామ : (చిన్నగా నవ్వుతూ) జరిగిందేదో జరిగింది లెండి బాబూ: ఇప్పుడు వచ్చేశారుగా — యింక అవన్నీ అనుకోవడమెందుకు ?

మూర్తి: అసలు విషయం నీకు తెలీదు రామయ్యా : నేను వేదవతికి నిజంగానే ద్రోహం చేశాను. అవుతే, నా మనస్ఫూర్తిగా ద్రోహం చెయ్యలేదు. నాచేత బలవంతంగా ద్రోహం చేయించారు మావాళ్ళు ... (నిట్టూర్చి) నాకు మళ్ళీ పెళ్లి చేశారు రామయ్యా :

రామ : (హతాశుడై) ఏంటి బాబూ, మీరంటున్నది ?

మూర్తి: ఔను రామయ్యా : నిజమే చెప్తున్నాను. అందుకే, నాకు విషం యిమ్మన్నాను. (రుద్ధ స్వరంతో) నా జీవితంలో యెప్పుడూ యెవరికీ అన్యాయం చెయ్యలేదు రామయ్యా. కాని, అనుకోకుండా వేదవతికి మాత్రం ద్రోహం చేశాను. స్వతహాగా ద్రోహం చెయ్యకపోవచ్చు. అయినా, దానికి బాధ్యుణ్ణి నేనే : ఆమె జీవితమే నాశనం చేశాను. దానికి శిక్షంటూ యేదన్నా వుంటే, అది చిత్రవధ కంటే ఘోరమైనది అయ్యుండాలి.

రామ : (బాధగా) ఎంత పని చేశారు బాబూ ? మిమ్మల్నే తన సర్వస్వంగా భావిస్తూ, మీరెప్పుడు తిరిగి వస్తారా అని రాత్రింబవళ్లు కళ్లు కాయలు కాచేలా యెదురు చూసేది అమ్మగారు.

మూర్తి: (మెల్లగా) ఆమె మనస్సు నాకు మాత్రం తెలీదా రామయ్యా : కాని యేం చెయ్యను ? పరిస్థితులు నన్ను నిస్సహాయుణ్ణి చేసినై. నేనూ, వేదవతీ, యింతవరకూ చట్టబద్ధంగా వివాహం చేసుకోలేదన్న విషయం సేకరించి పకడ్బందీగా యేర్పాట్లు చేసి, మా వాళ్లు నాకు వివాహం చేశారు. ఎంత మొఱపెట్టుకున్నా వినిపించుకోలేదు. నా బ్రతుకు చివరికి యీ విధంగా అడకత్తెర మధ్య యిరుక్కొంటుందని, కలలో కూడా వూహించలేదు. (నిట్టూరుస్తాడు.)

రామ : (బాధగా) ఇప్పుడు అమ్మగారి బ్రతుకు యేంకావాలంటారు ? ఆమె బతుకంతా యిట్లా ఆవేదనతో గడపవల్సిందేనా బాబూ : మీరింత స్వార్థపరులని అనుకోలేదు బాబూ!

మూర్తి: (బొంగురు గొంతుతో) నువ్వలా అంటున్నావని నాకేం కోపం లేదు రామయ్యా: ఒక విధంగా చూస్తే, నేను స్వార్థపరుణ్ణే: లేకపోతే, యీ పరికి ఆత్మహత్య చేసుకోకుండా

యెందుకు బ్రతికి వుంటాను ? అసలు, ఆత్మహత్య చేసు కుందుకు ధైర్యం చాలింది కాదు... (ఏదో జ్ఞప్తికి వచ్చి) ఆఁ అన్నట్టు, ఆ రామారావుగారి యిల్లు తెలుసునా ?

రామ : ఏ రామారావు బాబూ ?

మూర్తి: కాన్వేపటి క్రితం యిక్కడికి వచ్చాడే-అతను.

(వేదవతి అనుమానాస్పదంగా మూర్తి వేపు చూస్తుంది.)

రామ : తెలుసు బాబూ! అయినా, యిప్పుడు అతనెందుకు ?

మూర్తి: అతన్ని ఓసారి రమ్మను ?

రామ : సరే బాబూ యీ కాఫీ తీసుకోండి.

మూర్తి: టేబిలు మీద పెట్టేయ్ రామయ్యా.

(రామయ్య కాఫీ కప్పును టేబిలుమీద పెట్టి నిష్క్రమిస్తాడు.)

మూర్తి: (వేదవతికి దగ్గరగాపోయి) నన్ను క్షమించు వేదవతీ: ఏంచెయ్యను? ఇలా జరుగుతుందని నేనూ అనుకోలేదు. విధి మనల్ని వేరుచేసిందనే నమ్మాలి. నీ అదృష్టమే బావుంటే, నీ జీవితంలో మళ్ళీ వెలుగువస్తుందన్న ఆశ వుంది.

వేద: (బాధగా) ఆ ఆశ మరిలేదు మూర్తీ.

మూర్తి: ఏమోమరి-నా మనస్సు అలా ప్రబోధిస్తూవుంది. (క్షణం ఆగి) నీ దగ్గర దాపరికం యెందుకు? నేను యిక్కడికి వచ్చి చాలా సేపయ్యింది. రామారావు గారు నేను వచ్చే సరికే యింట్లో వున్నారు... నేను అందుకే, లోపలికి రాలేకపోయాను, బైట చీకట్లో తలుపు చాటున వుండి పోయాను. అతను వెళ్ళిపోయాక నీయెదుటికి వద్దామను కున్నాను. కాని, నాతప్పు నాలో పిరికితనాన్ని పెంచింది,

వేద: అవుతే, అంతా విన్నావన్నమాట!

మూర్తి: (నిట్టూర్చి) ఔను వేదవతీ: అంతా విన్నాను. ఆ విన డమే నాకు కొంత మనశ్శాంతిని ప్రసాదించింది. రామా రావు గారి సహృదయతనీ, కనకరాజు కుత్సితపు బుద్ధినీ, అర్థంచేసుకున్నాను. నేను నిన్ను చివరిసారిగా కోరేది ఒక్కటే: రామారావు గార్ని వివాహం చేసుకో.

వేద: (ఏడుస్తూ) ఈ సలహా యివ్వడానికే వచ్చావా మూర్తీ! నేను అనుభవిస్తున్న దుఃఖం చాలదనా యీ శూలపు పోటు?

మూర్తి: అలా అనకు వేదవతీ: నీ కాళ్ళపైబడి, క్షమాపణ చెప్పు కోవాలనే మొదట యిక్కడ అడుగుపెట్టాను. కాని, రామారావు గారి మాటలు విన్నాక, నా వ్యధిత హృద యం కాస్తంత వూరడిల్లింది. నువ్వు అతని భార్యవవుతే తప్పకుండా సుఖపడగలవన్న నమ్మకం నాలో యేర్ప డింది.

వేద: (ఆవేదనతో నిట్టూర్చి) సుఖం! విధాత నాకు సుఖం రాసి పెట్టలేదు మూర్తీ: నీతో వచ్చాక, జీవితం సుఖంగా సాగి పోతుందన్న నమ్మిక వుండేది. కాని, యిప్పుడేం జరిగింది! అంతే! మనుషుల మాటలకూ, చేతలకూ సమన్వయం వుంటుందా, అన్న సంశయం నాలో స్థావరం ఏర్ప రుచుకుంది. నీలానే రామారావుగారు కూడా మోసం చెయ్య రన్న నమ్మకం యెక్కడుంది?

మూర్తి: నువ్వలా అంటుంటే, యింక నేనేం చెప్పగలను వేదవతీ?

వేద: చిరకాల పరిచయమూ, అన్యోన్యత, మమకారం, పెంచు కున్న మన జీవితాలే యిలా విచ్ఛిన్నమైతే, కొత్తగా పరి చయమైన అతనితో నా బ్రతుకు కలకాలం సాగుతుందని యెలా నమ్మడం మూర్తీ?

మూర్తి: నమ్మకమన్నది ప్రతి మనిషిలోనూ వుండాలి వేదవతీ: మానవులందరూ ఒకేలా వుండరు. ఇప్పటికీ చెప్తున్నాను. నేను నిన్ను కావాలని మోసగించలేదు. విధియే మనల్ని క్రూరంగా విడదీసింది. అలాగని, మళ్ళీ నీకు అదేవిధ మైన ద్రోహం జరుగుతుందని, యెందుకు భ్రమపడతావు? రామారావు చాలా మంచివాడిలా అగుపిస్తున్నాడు. ప్రేయసి వియోగంతో అతనూ విరక్తి చెందివున్నాడు. నిన్ను వివా హం చేసుకోడానికి తహతహలాడుతున్నాడు. నీ పట్ల యెంత ప్రగాఢమైన మమకారం లేకపోతే, యింత విరక్తి లోనూ నిన్ను అభ్యర్థిస్తాడు? అదికాస్త ఆలోచించు వేదవతీ: నామాట విను... నువ్వు తప్పక సుఖపడతావు.

వేద: (నిర్జీవంగా) నా మనస్సు నీ ఒక్కడికే అంకితం చేశాను మూర్తీ: ఆ స్థానం మార్చడం సాధ్యంకాదు.

మూర్తి: నువ్విలా మొండిపట్టు పట్టుక్కూర్చోవడం యేమీ బాగు లేదు. ఈ ఒక్క విషయంలో నాకోరిక మన్నించమని నిన్ను ప్రార్థిస్తున్నాను. నీ సుఖంకోసం, నా మనసు వూరటకోసం, 'వూఁ' అను...అను వేదవతీ (ప్రాధేయ పూర్వకంగా అంటాడు.)

వేద: (కుములిపోతూ) ప్రపంచంలో నావంటి అభాగిని యెవ్వరూ వుండరు మూర్తీ: (క్షణంఆగి) నీచే పరిత్యజింప బడిన

దాననని తెలుసుకున్నాక, రామారావు గారు నన్ను స్వీకరిస్తారనే అనుకుంటున్నావా?

మూర్తి: నువ్వు మరీ పిరికిదానవై పోతున్నావు...అతని పాదాలపై పడైనా అతణ్ణి ఒప్పిస్తాను. నువ్వు 'ఊఁ' అంటే చాలు. ఈనాడు నేను చెప్తున్నాను ..గుర్తుంచుకో వేదవతీ: ఎన్నటికైనా నువ్వే ఆనందంగా వుంటావు. సుఖపడతావు. నిన్ను ద్రోహం చేసిన నేను సుఖపడలేను. (నిట్టూర్చి) జీవితంలో యేదో వెలితి అగుపిస్తూనే వుంటుంది.

[బైటనుంచి రామయ్య, అతనివెంట రామారావూ వస్తారు.]

రామ: (మూర్తితో) ఇదిగోండి బాబూ...వచ్చారు.

మూర్తి: .రండి రామారావుగారూ: కూచోండి.

రామా: (నుంచునే) పరవాలేదు లెండి. . నన్ను రమ్మన్నారట?

[వేదవతి మొహం ప్రక్కకు తిప్పుకొని వెక్కివెక్కి యేడుస్తూ వుంటుంది.]

మూర్తి: ఔనండీ: ముందు కూచోండి.

రామా: (స్టూలుమీద కూచుని) మీరు వచ్చేశారని తెలుసుకుని చాలా ఆనందించానండీ: వేదవతిగారు యింక యేడుస్తున్నారెందుకు? ఆనందంతో పొంగిపోవాలి గాని.

మూర్తి: (బాధగా) కారణం వుందండీ: వేదవతికి నేను చాలా ద్రోహం చేశాను. అవుతే స్వతహాగా అలా చెయ్యలేదు. మావాళ్ళు నన్ను బలవంతంగా తీసుకుపోయి, నాకు యిష్టంలేని వివాహం చేశారు. ఏంచెయ్యను? ఆ పరిస్థితిలో నేను అసహాయుణ్ణి అయ్యాను. మా యిరువురమూ యింతవరకూ చట్టరీత్యా వివాహం చేసుకోకపోవడమే యీ అనర్థానికి హేతువయ్యింది. ఇప్పుడు చింతించి, ప్రయోజనమేముంది లెండి? (నిట్టూర్చి) అగ్నిసాక్షిగా. పలువురు పురప్రముఖుల సమక్షంలో జరిగిన ఆ వివాహాన్ని కాదనలేను. నా 'భార్య' అని యే ఆధారమూలేని ఈ అభాగిని వేదవతిని. భార్యగా స్వీకరించలేను. ఇలా వుంది నాస్థితి.

రామా: (క్షణం స్తంభించిపోయి) మంచి యిరుకున పడ్డారండీ; పాపం వేదవతి గారి నిండు జీవితం భగ్నమైనట్టేనా?

మూర్తి: అలా జరక్కుండా వుండడానికే, మిమ్మల్ని రప్పించానండీ.

రామా: (గతుక్కుమంటూ లేచి) నేనెందుకు?

మూర్తి: వేదవతి జీవితం మోడువారి నశించిపోకుండా వుండాలంటే, ఒక అమాయక స్త్రీని ద్రోహంచేసిన అపవాదు నాకు ఆపాదించబడకుండా వుండాలంటే, మీరిప్పుడు సహాయం చెయ్యాలి.

రామా: నేనా?

మూర్తి: ఔను. వేదవతిని మీరు వివాహం చేసుకోండి...ఇది నా అభ్యర్థన.

రామ: (అయోమయంగా) బాబూ:

మూర్తి: రామయ్యా: నేనేం తెలివితక్కువగా ప్రవర్తించడంలేదు. అన్నీ ఆలోచించే, యీ నిర్ణయానికి వచ్చాను. వేదవతిని ఓ గృహిణిగా చెయ్యడమే నా అభీష్టం. అప్పుడే నా హృదయానికి ప్రశాంతి లభిస్తుంది.

రామా: (సందిగ్ధావస్థలో) కాని...(ఆగిపోతాడు.)

మూర్తి: సందేహిస్తున్నారా?

రామా: సాహసించి మీరీ ప్రయత్నం చేస్తున్నారేమో:

మూర్తి: సాహసమే అనుకోండి. కాని యేంచెయ్యను? నా సుఖంతో పాటు ఆమె సుఖమూ చూడవల్సిన బాధ్యత నాపై వుంది.

రామ: అమ్మగార్ని అడిగారా బాబూ?

మూర్తి: (నిట్టూర్చి) అంత మూర్ఖుణ్ణికాదు రామయ్యా: వేదవతిని ప్రాధేయపడి ఒప్పించడానికి ప్రయత్నించాను. రామారావుగారి నీడలో ఆమె సుఖపడుతుందన్న నమ్మకం నాకుంది.

[రామయ్య పాలిపోయిన మొహంతో వేదవతి వేపు చూస్తాడు. ఆమె మాత్రం కుమిలి కుమిలి యేడుస్తుందేగాని, జవాబు చెప్పలేదు. ఆమె మౌనాన్ని అంగీకార సూచనగా భావిస్తాడు]

మూర్తి: నా కోరిక మన్నించండి రామారావుగారూ: మీరు కొద్ది నిముషాల క్రితమే ఆమెను అర్థించారు వివాహం చేసుకోమని. నేను అంతా బైట నుంచిని విన్నాను. విన్న తర్వాతనే యీ నిర్ణయానికి వచ్చాను.

రామా: (కాస్సేపు మౌనం తర్వాత) కాని...

మూర్తి: (ఆత్రంగా) మీ సందేహం యేమిటో చెప్పండి రామారావుగారూ: నేను ఆమెనుపరిత్యజించాననా సందిగ్ధలో పడ్డారు? నిజమైన ప్రేమ యిన్ని రూపాలు దాలుస్తుందా?

అప్పుడే, మీలో సంకుచితత్వం స్థావరం యేర్పర్చుకుం దన్నమాట: నేను యే పరిస్థితుల్లో ఆమెకు దూరమయ్యానో, ఆలోచించి. యీ భావాన్ని హృదయంనుండి తొలగించండి. సహృదయులుగా, సంస్కారిగా, విశాలహృదయులుగా, నా విషయమే పూర్తిగా విస్మరించి, మునుపటిలానే వేదవతిని ప్రేమించండి. మనసులోని మమకారాన్ని బలవంతంగా అణచకండి. (బాధగా) కోరి అర్థిస్తున్నానని కించపర్చకండి రామారావుగారూ: మీరు యీమెను స్వీకరించండి. మీ కోరికే నెరవేరిందన్న తృప్తి పొందండి. మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను. ఇవి చేతులు కావు. (రామారావు రెండుచేతులూ పట్టుకుంటాడు...) నా మాట నిలబెట్టండి ..

రామా: (సౌమ్యంగా మూర్తి చేతులు తీసి) మీరు నా మాటలు పూర్తిగా వినకండా, అపార్థం చేసుకుంటున్నారు మూర్తి గారూ: వేదవతి గార్ని, నా సహచరిణిగా చేసుకుని తరించాలన్న భావం యిప్పటిలో నాలో అంతరించలేదు. మీరన్నట్టు, నిజమైన ప్రేమకి చలనంలేదు. కాని యెటొచ్చి ... (ఆగిపోతాడు)

మూర్తి: మీ మనసులో మాటేమిటో దాచకండా చెప్పండి.

రామా: ఆమె అంగీకరించాలిగా:

మూర్తి: (తన్మయత్వంతో తృప్తిగా నిట్టూర్చి) హమ్మయ్య: నాకిప్పుడు యెంతో ఆనందంగా వుందండీ రామారావుగారూ: నా హృదయ భారాన్ని తగ్గించారు. నన్నీ అపవాదు నుండి తప్పిస్తున్నారు. నేనెంతో మీకు ఋణపడివున్నాను. వేదవతి అంగీకరించినట్టే...ఆ విషయంలో మీరేమి సందేహించకండి.

రామా: (ఉత్సాహంతో) నేనూ మీకు ఋణపడి వున్నానండీ! మీరు ప్రేమించిన స్త్రీని విధికిదాసులై దూరంచేసుకొని, నా అభీష్టం నెరవేరుస్తున్నారు. అందుకు మీకూ నేను కృతజ్ఞత తెలుపవల్సివుంది.

మూర్తి: (బాధగా మొహందించుకొని) అందుకు నేను అర్హుణ్ణికాదండీ: (బొంగురు గొంతుతో) వేదవతీ: యిలారా: ఇంక ఏడవడమెందుకు? నువ్వు నిజంగా అదృష్టవంతురాలివి. నా మాటవిని కన్నీరు తుడుచుకో. ఈ శుభసమయంలో కన్నీటికి తావుండ కూడదు...(రుద్ధస్వరంతో) రా యిలా...ఏదీ చేయి—(వేదవతి చేతిని తీసుకొని రామారావు చేతిలో పెడతాడు...అతని కళ్ళనుండి అశ్రుధారలు జాలువారుతూ వుంటుంది.) వెయ్యేళ్ళు సుఖంగా వర్ధిల్లండి. చట్టరీత్యా వివాహం మాత్రం చేసుకోండి రామారావుగారూ! వేదవతి చాలా అమాయకురాలు. ఆమె భారం మీమీదే వేస్తున్నాను. నాకు శలవిప్పించండి. వస్తాను వేదవతీ: యీ జన్మలో యెప్పటికైనా నన్ను క్షమించితే ధన్యుణ్ణి... (కన్నీరు తుడుచుకుంటూ నిష్క్రమిస్తాడు.)

వేద. (బావురుమంటూ) మూర్తీ ...

(మూర్తి ఓసారి వెనక్కి తిరిగి సజలనయనాలతో మళ్ళీ ముందుకు గబగబా సాగిపోతాడు. వేదవతి మొహాన్ని రెండు చేతుల్తో కప్పుకుని కుమిలి పోతుంటుంది. రామయ్య కళ్ళనుండి అశ్రువులు ధారాపాతంగా కారుతూవుంటే మూర్తి వెళ్లిపోయిన వేపే అయోమయంగా చూస్తూ వుండిపోతాడు. రామారావు చెమ్మగిల్లిన కళ్ళను ఒత్తుకుంటుంటాడు. . .)

— తెర —



# పంచాయతీరాజ్య పురోగమనం

## ప్రజల విరాళం

కర్నూలు జిల్లా నందికొట్కూరు పంచాయతీ సమితిలోని అల్లూరు గ్రామంలో సుమారు రూ. 8,600 ల వ్యయంతో నిర్మించిన నూతన పాఠశాల భవనాన్ని సెప్టెంబరు 29 వ తేదీన తెరిచారు. దీని నిర్మాణ వ్యయంలో 25 శాతం మొత్తం ప్రజల నుంచి విరాళంగా లభించింది.

## రసాయనిక ఎరువుల పంపిణీ

గుంటూరు జిల్లా ఈపూరు పంచాయతీ సమితిలో సెప్టెంబరు నెలలో సహకార సంఘాలద్వారా సుమారు 146 మణుగుల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు. ఏడు వయోజన విద్యా కేంద్రాలను కూడా ప్రారంభించారు. వీటిలో రెండు స్త్రీలవి. ఇవి దోమలగూడెం, అంగలూరులలో నెలకొల్పబడినవి.

## పారిశుద్ధ్య ఉద్యమం

గుంటూరు జిల్లా ఈపూరు బ్లాకులో సెప్టెంబరు 25 వ తేదీన మశూచి నిర్మూలన దినోత్సవం జరిపారు. ఈ నెలలో బ్లాకు ప్రాంతంలో పారిశుద్ధ్య ఉద్యమాలను నాలుగింటిని నిర్వహించారు. సంతమాగులూరు బ్లాకులోని కొప్పెరప్పాడులో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని మూడురోజులపాటు నిర్వహించారు.

## వరద బాధితులకు సహాయం

గుంటూరు జిల్లా ఈమని పంచాయతీ సమితిలోని హాఫ్ పేట గ్రామంలో వరద బాధితులకు ముఖ్యంగా హరిజనులకు సహాయం చేసే ఉద్దేశంతో ఈమని పంచాయతీ సమితి అధ్యక్షుడు, బ్లాకు ఉద్యోగులు కొలకలూరు, ఖాజీపేట] ప్రాంతాలలో సుమారు పదిన్నర బస్తాల బియ్యం సేకరించారు.

## "స్వయం కృషి కార్యక్రమం"

"స్వయం కృషి" కార్యక్రమం క్రింద చిత్తూరు జిల్లా, మదనపల్లి పంచాయతీ సమితిలోని చిన్నతిప్ప సముద్రం యువజన సంస్థ సభ్యులు, పురోగాములైన రైతులు కలిసి మూడు ఫర్లాంగుల కచ్చారోడ్డు నిర్మించారు. ఈ పని విలువ సుమారు రూ. 400 లు. కోటవారిపల్లె పంచాయతీలో ఒక పార్కును ప్రారంభించారు. పై బ్లాకులోని చిన్నతిప్ప సముద్రం, నందిరెడ్డి పల్లె, నిమ్మనపల్లె, రెడ్డివారిపల్లె గ్రామాలలో జాతీయ పొదుపు ఉద్యమాన్ని ప్రవేశపెట్టారు. వీటిలో మొదటి గ్రామంలో, జాతీయ పొదుపు పథకపు ఇంప్రెస్ట్ విధానాన్ని 200 ల కంటే ఎక్కువ కుటుంబాలకు వర్తింపజేశారు.

## కొత్త ఎలిమెంటరీ పాఠశాలలు

అనంతపురం జిల్లా రోళ్ల పంచాయతీ సమితిలోని హూరిక హల్లి, బొమ్మరసన్‌హల్లి గ్రామాలలో కొత్తగా ఎలిమెంటరీ పాఠశాలలను తెరవడానికి 1962 సెప్టెంబరులో కొడిహల్లి పంచాయతీ అధ్యక్షుడినుంచి ప్రజల విరాళం క్రింద రూ. 350 లు సేకరించారు. బ్లాకు ప్రధాన కార్యస్థానంలో సెప్టెంబరు 25 వ తేదీన మశూచి నిర్మూలన దినోత్సవాన్ని సముచిత రీతిని జరిపారు.

## వ్యవసాయదార్లకు ఋణాలు

మెదక్ జిల్లా సిద్దిపేట పంచాయతీ సమితిలో 1962 సెప్టెంబరులో తీవ్రతరంగా ఎరువులు వేసే పథకం క్రింద రసాయనిక ఎరువులను, రూ. 5000 ల మేరకు వ్యవసాయ ఋణాలను వ్యవసాయదార్లకు పంపిణీ చేశారు. తోర్ణాల గ్రామం మొత్తంలో జపాను పద్ధతిలో వరిసేద్యం చేశారు "స్వయం కృషి" కార్యక్రమం క్రింద, నిర్ణీత గ్రామాలలో గ్రామీణ ఉత్పత్తి కార్యక్రమాలను కూడా రూపొందించారు.

## ప్రత్యక్ష ప్రదర్శనలు

మెదక్ జిల్లా సిద్దిపేట పంచాయతీ సమితిలోని అల్లిపూర్ గ్రామంలో సెప్టెంబరు 28 వ తేదీనుంచి మూడు రోజుల పాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం జరిగింది. దీనిలో 58 మంది గ్రామ సహాయకులకు వ్యవసాయం, పశుపోషణ, సహకారం మొదలైన విషయాలలో శిక్షణ ఇచ్చారు. కంపోస్టు తయారు చేయడం, పొగరాని పొయ్యిలు, జపాను పద్ధతి వరిసేద్యం తదితర విషయాలను గ్రామస్థులకు ప్రత్యక్ష ప్రదర్శనలద్వారా వివరించారు.

## పరిశుభ్రతకు బహుమతి

నెల్లూరు జిల్లా కొండపి పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశంలో, పరిశుభ్రత విషయంలోనూ, బడిపిల్లల క్రమశిక్షణ విషయంలోనూ, ఉత్తమమైనదిగా నిర్ణయించబడిన సమితి ఎలిమెంటరీ పాఠశాలకు రూ. 50/- లు విలువచేసే వెండి కప్పును బహూకరించడానికి నిర్ణయించబడినది. సెప్టెంబరు 29 వ తేదీన ఈ నిర్ణయం జరిగింది.

## జపాను పద్ధతి వరిసేద్యం

నెల్లూరు జిల్లా చినక్రాకర పంచాయతీ సమితిలో 150 ఎకరాలలో జపాను పద్ధతిలో వరి సేద్యం చేశారు. 20 ఎకరాలలో వరి నారు మళ్లకు తెవుళ్లు రాకుండా చర్యలు తీసుకున్నారు. సోమవరప్పాడు సహకార సంఘానికి స్వల్పకాలిక ఋణంగా రూ. 2,500 లు మొత్తం ఇచ్చారు. సెప్టెంబరులో చినక్రాకర, గుడ్లదోనలలో గ్రామసహాయకుల శిక్షణ శిబిరాలను నిర్వహించారు.

## మొక్కల సంరక్షణ

అనంతపురం జిల్లా గోరంట్ల పంచాయతీ సమితిలో 1962 సెప్టెంబరులో 500 ఎకరాలలో తీవ్రతర ప్రచారంద్వారా జపాను పద్ధతిలో వరి సేద్యం చేశారు. వేరుశనగ, మిరప పంటల విషయంలో మొక్కల సంరక్షణ చర్యలు తీసుకున్నారు. రైతులు సకాలంలో ఎరువులు వాడటానికి వీలుగా వారికి ఎరువులను పంపిణీ చేసే పనిని వేగవంతం చేశారు.

## పాఠశాల భవనం ప్రారంభం

అనంతపురం జిల్లా రాయదుర్గం పంచాయతీ సమితిలోని గుమ్మఘట్ట, వీరాపురం గ్రామాలలో నిర్మించిన రెండు ఎలిమెంటరీ పాఠశాలాభవనాలకు 1962 సెప్టెంబరులో జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు. గుమ్మఘట్ట గ్రామంలో సెప్టెంబరు 25వ తేదీనుంచి మూడు రోజుల పాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించారు. రాయదుర్గంలో సెప్టెంబరు 5 వ తేదీన ఉపాధ్యాయుల దినోత్సవం జరిగింది.

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1962 జులైలో విశాఖపట్నం జిల్లాలోని చింతలపాలెం, (యస్. కోటతాలూకా) ముడపాక (విశాఖపట్నం తాలూకా) గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేశారు. 1962 సెప్టెంబరులో అనకాపల్లి తాలూకాలోని అమృతపురం గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు. 1962 సెప్టెంబరులో పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకాలోని మానేగుంటపాడు, అల్లూరిపాడు, రెడ్డిపాలెం (అల్లూరుపాడు శివారుగ్రామం) గ్రామాలకు కూడా విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

# ప్రగతిపథాన ప్రజాస్వామ్యం

ఎం. చెన్నారెడ్డి

ఈ మధ్య వార్తా పత్రికలో ఒక ఆంగ్ల మేధావి వ్రాసిన వాక్యం చదివాను. వెంటనే ఆలోచన కల్గింది. పత్రిక వాళ్లు కూడా ఆ వాక్యాన్ని గూర్చి ఆలోచించమన్నారనుకోండి. ఆయన భావం ఇది– "మనకు ఇష్టమైనది లేనపుడు వున్నదానికే ఇష్టపడాల'ని. ఈ అభిప్రాయం అన్ని సందర్భాల్లోను వర్తిస్తుందా అన్నదే నా సందేహం. కొన్ని సూత్రాలలో యీ విషయం సత్ఫలితాలనే ఇచ్చినా, మరికొన్నింటిలో అభివృద్ధిని కుంటుపరచి, హానికరం కూడా కావచ్చు. మనదేశం విషయమే తీసికొందాం. 15 సంవత్సరాలకు పూర్వం మనం స్వతంత్రులం కాము, ఇష్టమున్నా లేకపోయినా శతాబ్దాలుగా పరదేశ పాలనలో వున్నాం. ప్రజాస్వామ్య పరిమళం ప్రపంచంలో ప్రాకిన కొద్దీ ఆఘ్రాణించాలనే ఆకాంక్ష అస్వతంత్ర దేశాలలో కూడా కల్గింది. మన దేశంలో కూడా దాస్య శృంఖలాల నుండి బయటపడాలన్న భావానికి బలం చేకూరింది. అలాంటప్పుడు పై సూత్రానికే ప్రాధాన్యమిస్తే యీనాడు మనం స్వాతంత్ర్యాన్ని అనుభవించే వాళ్ళం కాదు. ఒక జాతిని గాని, దేశాన్ని గాని తమస్సు నుండి జ్యోతి వైపుకు లాగేటపుడు యుగ పురుషులు ఆవిర్భవిస్తారు. ఆకోవకు చెందినవాడే మన జాతిపిత బాపూజీ. శాంతియుతంగా స్వాతంత్ర్యాన్ని సాధించడమే గాక సహజీవనం, సహకార జీవనాల ప్రాముఖ్యాన్ని గుర్తింపజేశాడు. ఈనాటి మన నవభారత నిర్మాణమంతా ఆయన వేసిన పునాదుల పైనే!

స్వాతంత్ర్యం వచ్చాకనైనా ఆంగ్ల మేధావి ఉవాచ మన దేశంలో అంతగా వర్తించదేమో. పరాయి పాలనపోయి మన భవిష్యత్తును మనమే తీర్చి దిద్దుకోగల అవకాశం లభించే నాటికి దేశం ఆర్థికంగాను, సాంస్కృతికంగాను ఎంతో వెనుకపడి వుంది. ఇక ప్రజల జీవన ప్రమాణాన్ని గూర్చి చెప్పనవసరం లేదు. మానవునికి కావలసిన ప్రాథమిక అవసరాలు కూడా అందుబాటులో లేవు. దేశంలో సరైన విద్యా, వైద్య సౌకర్యాలు గాని, రాకపోకల మార్గాలు గాని అవసరాలకు తగినంతగా లేవు. ఐతే ఏ ప్రాణికైనా తాను సుఖంగా జీవించాలన్న ఆశ వుండకపోదు. పరిమిత అవకాశాల వల్ల, పరిసరాల ప్రభావం వల్ల మానవుని వాంఛితాలన్నీ నెరవేరకపోవచ్చు. అంత మాత్రం చేత, ఉన్న దానితోనే తృప్తిపడాలన్న భావం జాతి ప్రగతికే అవరోధం కాగలదు. మన జాతీయాభివృద్ధి కార్యక్రమాలలో యీ సత్యం గుర్తింపబడింది. సంపదకు, సమృద్ధికి మనం సమన్వయాన్ని పంచవర్ష ప్రణాళికల రూపంలో కల్పించాం. దేశంలోని వనరులనన్నింటినీ ప్రణాళికాబద్ధంగా, ప్రాధాన్యతలను బట్టి వినియోగపరుస్తూ ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచాలన్నదే మన లక్ష్యం. ఈ దృష్టితో 1951 లో మన తొలి ప్రణాళికను ప్రారంభించాం. కార్యక్రమాలు అమలు జరుగుతున్న కొద్దీ అనుభవాన్ని గడించాం. మరో సత్యాన్ని కూడా గుర్తించాం. కేవలం ప్రభుత్వపరంగా కొన్ని పథకాలను అమలుపరచి లాభాలను ప్రజలకు పంచడం వల్ల ప్రయోజనం లేదు. ప్రతి కార్యక్రమంలోను ప్రజలు అన్ని విధాల భాగస్వాములు కావాలి. మనది పరిమిత ప్రజాస్వామ్యం కాదు. వటవృక్షంలా ప్రజాస్వామ్యపు వ్రేళ్లు దేశం నలుమూలలా వ్యాపించాలన్నది మన కోర్కె. ఇందుకు ప్రజలలో నిద్రాణమై వున్న శక్తి, సామర్థ్యాలను మేల్కొల్పాలి. ఉన్నత జీవన ప్రమాణాలను సాధించాలన్న ఆకాంక్షను వారిలో రేకెత్తించాలి. దేశంలో ప్రతి పౌరుడూ ఏదో ఒక విధంగా అభివృద్ధిలో భాగస్వామినన్న భావం కల్గినపుడు మనం వివిధ రంగాలలో పెట్టుకొన్న లక్ష్యాలను వేగంగా చేరగలం.

1952 లో ప్రారంభమైన మన జాతీయ వికాస సమాజాభివృద్ధి కార్యక్రమాలు ఈ ఆశయంతోనే ప్రారంభమయ్యాయి. ఒక దేశం, లేదా రాష్ట్ర శక్తి సామర్థ్యాలు నిజానికి అచట నివసించే

వ్యక్తుల శక్తి, సామర్థ్యాల మీదన ఆధారపడి ఉంటాయి. అందు వల్లనే అన్నాడు మహాకవి గురజాడ "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుజులోయ్" అని. వ్యక్తి వైఖరిలో మార్పును సాధించి, నిర్మాణాత్మక కార్యక్రమాలలో అతడు ఉత్సాహంగా పాల్గొనేటట్లు చేయగల్గితే సమాజ వికాస మన్నది సాధ్యం కాక పోదు. ఈ దృష్ట్యా మన సమాజాభివృద్ధి కార్యక్రమాలు ఎంతో ప్రోత్సాహాన్ని కల్పించి ప్రజలలో చైతన్యం కలుగజేశాయి.

దేహంలో అన్ని అంగాలు సక్రమంగా పనిచేసినపుడే మానవుడు ఆరోగ్యంగా ఉంటాడు. దేశానికి ఇదే వర్తిస్తుంది. రాష్ట్రాల సముదాయమే దేశం. ఏ రాష్ట్రానికా రాష్ట్రం స్వయంపోషకమై తన సంస్కృతిని వెదజల్లినపుడు దేశం అన్ని విధాల ముందుకు పోతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం తన ధర్మాన్ని ఎల్లప్పుడు నెరవేరుస్తూనే ఉంది. తన అవసరాలను, ఆశయాలను దేశపు సమగ్ర దృష్టితోనే అమలు జరుపుతోంది. మన రాష్ట్రంలోని ప్రజలు సహజంగా ఉత్సాహం, చైతన్యం గలవారు. ఏ రంగంలోనైనా ఆధునిక విధానాలను ఆచరించడానికి వెనుకాడరు. విప్లవాత్మకమైన మార్పులను చేపట్టడంలో కూడ మనదే పైచేయి. స్వాతంత్ర్యోద్యమంలోనే గాదు, సమాజాభివృద్ధిలో కూడ మనదే ముందడుగు. అధికార వికేంద్రీకరణ విధానాన్ని ఇతర రాష్ట్రాల కన్న ముందు ఆచరణలో పెట్టగల్గాం. ప్రథమ, ద్వితీయ ప్రణాళికలలో అనేక అభివృద్ధి కార్యక్రమాలను అమలపరచి సత్ఫలితాలను సాధించాం. ముఖ్యంగా వ్యవసాయం, పశుపోషణ, సమాజాభివృద్ధి కార్యక్రమాలలో మన విజయాలు అఖిల భారత ప్రశంసనే పొందాయి.

మన రాష్ట్రం నైసర్గికంగా నదుల రాష్ట్రం. సారవంతమైన భూములు, చమటోడ్చి పనిచేయగల రైతాంగానికి కొదువలేదు. ఇక ఇంతవరకు మనం వినియోగించని సహజ సంపద రాష్ట్రంలో విస్తారంగా ఉంది. నదులు, కొండలు, అడవులు, పంట భూములతో 106,052 చ. మై. విస్తీర్ణంగల యీ రాష్ట్రంలో భౌతిక సంపదను మనమెంతైనా అభివృద్ధి చేయవలసి వుంది. పెరుగుతున్న మనజనాభా దృష్ట్యా ఇది ఎంతైనా అవసరం. 1961 జనాభా అంచనాననుబట్టి రాష్ట్ర జన సంఖ్య 35.98 మిలియన్లని తేలింది. అంటే భారత దేశపు జనాభాలో 8.2 శాతమన్న మాట. కెనడా, ఆస్ట్రేలియా, ఫిలిప్పైన్స్, యుగోస్లేవియా, ఇరాన్, అరబ్ మొదలైన దేశాలలోని జన సంఖ్య కంటె మన రాష్ట్రపు జన సంఖ్యే అధికం. వైశాల్యం, జనాభాలోను కూడా ఆంధ్రప్రదేశ్, సిలోన్, ఆస్ట్రియా, బెల్జియం, జెకొస్లేవేకియా, స్విడ్జర్లాండ్ మొదలైన దేశాలకంటె పెద్దది.

1959-60 నాటికి రాష్ట్రంలో 26.91 మిలియన్ల ఎకరాల భూమి పంట క్రిందకి తేబడినట్లు తేలింది. మరో 14.61 మిలియన్లు ఎకరాలు అడవుల క్రింద ఉంది. అంటే రాష్ట్ర వైశాల్యంలో 39.8 శాతం పంట భూముల క్రింద, 21.7 శాతం అడవుల క్రింద ఉందన్న మాట. రాష్ట్రంలోని పశుసంపద 1956 లో 29.51 మిలియన్లనుండి 1961 నాటికి 3[illegible].64 మిలియన్లకు పెరిగింది. 10.6 శాతం యీ 5 సంవత్సరాలలోనూ పెరిగింది. 1955-56 నుండి 1959-60 కాలంలో సగటు వుత్పత్తినిబట్టి రాష్ట్రంలోని వివిధ ధాన్యాల ఉత్పత్తి దేశపు ఉత్పత్తిలో 9.9 శాతం ఉంది.

ప్రణాళికా కాలంలో విద్యుదుత్పాదన శక్తి రెట్టింపుకు పైగా పెరిగింది. 1955-56 కంటె 1960లో ఉత్పత్తయిన విద్యుచ్ఛక్తి 4.66 శాతం ఉంది. పొరుగు రాష్ట్రాలతో పోల్చి చూచినా కిలోవాటు స్థాపిత యంత్రశక్తికి సంవత్సరంలో ఉత్పత్తయ్యే యూనిట్ల సంఖ్య మన రాష్ట్రంలోనే అధికంగా ఉంది. 1960-61లో యీ ఉత్పత్తిశక్తి మద్రాసు రాష్ట్రంలో 4,025 యూనిట్లు. కేరళలో 3,680 యూనిట్లు కాగా ఆంధ్రప్రదేశ్‌లో 4,200 యూనిట్లు ఉంది. ఈ సంఖ్య 1961-62 లో 4,350 యూనిట్లకు పెరిగింది. 1960-61 లో విద్యుత్ వినిమయ శాతం మద్రాసులో 45, కేరళలో 40, ఆంధ్ర ప్రదేశ్‌లో 40 ఉంది. మన రాష్ట్రంలో 1961-62లో వినిమయ శాతం 50 కు పెరిగింది. ఇక యుద్ధానంతర పథకాలలోని కిలోవాటు స్థాపిత యంత్రశక్తి ఖర్చు చూసినా ఇతర రాష్ట్రాలలోకంటె మన రాష్ట్రంలో హెచ్చుగాలేదు. మాచ్‌ఖండ్ పవర్ హౌసులో కిలోవాటుకు రూ. 1625, తుంగభద్ర పవరు హౌసులో కిలోవాటుకు సగటున రు. 1080, రామగుండంలో కిలోవాటుకు రు. 700 లకు తక్కువగాను స్థాపిత యంత్రశక్తికి ఖర్చవుతోంది. మద్రాసులోని కుందా కొత్తపథకానికి రు 1,508, మైసూరులోని శార్వరి మొదటి దశకు రు. 1,290 ఇందుకు ఖర్చు అవుతోంది. కేరళలోని పెన్నియార్ హైడ్రోపథకానికి రు.1,610, మహారాష్ట్రలోని కోయనా విద్యుత్ పథకానికి రు. 1,600 ఖర్చవుతోంది. చివరకు ఒక మైలుకు విద్యుచ్ఛక్తి లైనులకయ్యే ఖర్చు చూసినా మద్రాసుకు, మనరాష్ట్రానికి తేడా పెద్దగా లేదు. ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం గమనించాలి.



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌరరక్షణ కమిటీ ప్రథమ సమావేశానికి హైద్రాబాద్‌లో 1962 నవంబరు 8వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

...ీయ రక్షణబాండ్లు:- ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ యస్. యం. శ్రీనగేష్ 1962 నవంబరు 10వ తేదీన హైద్రాబాదు లోని స్టేట్‌బ్యాంకు కౌంటర్‌వద్ద రక్షణ బాండ్లను మొట్టమొదటగా కొన్నారు.

ప్రతిఒక్కరూ యథాశక్తి విరాళాలు యిస్తున్నారు. రాష్ట్రంనుండి దేశంలో నలుమూలలనుంచి రక్షణనిధికి సంతతధారగా విరాళాలు వస్తున్నాయి.



6 సంవత్సరాల బాలిక అంజలీ గోపాల్ పాటక్ తన బంగారు ఉంగరాన్ని ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు సమర్పిస్తున్నది.



సమాచార, పౌరసంబంధాల శాఖలో పనిచేస్తున్న శ్రీ ఖాదర్ ఖాన్ (డ్రైవరు), జాతీయ రక్షణ నిధికి ప్రతినెలా రు. 10, లను విరాళంగా యిచ్చారు.



సమాచార, పౌరసంబంధాల శాఖలో పనిచేస్తున్న శ్రీ జి. యం. ఖాన్, (బంట్రోతు) జాతీయ రక్షణ నిధికి ప్రతినెలా రు. 5 లను విరాళంగా యిచ్చారు.



హైద్రాబాదులో సైనికుల రిక్రూటుమెంటు దృశ్యం.

చైనా దురాక్రమణను ఖండిస్తూ నగరంలో ఆర్టిస్టుల ఊరేగింపు.



చైనా దురాక్రమణను ఖండిస్తూ 1962 నవంబరు 2వ తేదీన హైద్రాబాదులో జరిగిన విద్యార్థుల ఊరేగింపు దృశ్యం.

విద్యార్థుల ఊరేగింపు మరోదృశ్యం.



అనంతపురంలోని ఆయిల్ టెక్నలాజికల్ రీసర్చి సంస్థ.



అపూర్వ వాత్సల్యం:— దూడకు పాలిస్తున్న మేక—తిరుపతిలోని పశువైద్య కళాశాల విద్యార్థి శ్రీ కె. కె. మోహన్ తీసిన
అపూర్వమైన ఫోటో:—నేటికీ కూడా దూడ క్రమం తప్పకుండా మేకదగ్గరికి వెళ్ళి పాలు తాగుతోంది.
తన స్వంతపిల్లలకు పాలిచ్చినట్లుగానే మేక నిలబడుతుంది.



కల్లూరులోని పాఠశాలలో మధ్యాహ్నభోజన పథకాన్ని అమలు జరుపుతున్నారు.

జిల్లా బోర్డు అధ్యక్షులకూ, యుద్ధపు రగడలో విమగ్నులై పోయిన ప్రభుత్వోద్యోగులకూ తగాదాలు ఎక్కువై పోయాయి. ఆ పేచీలలో జిల్లా బోర్డు అధ్యక్షులలో ఒకరైన పళ్లంరాజుగారు అధికార్లకంటే పైచేయిగా నిలవడమే అందరికీ ఆబ్బురాన్ని కలిగించింది. 1940 డిసెంబరులో గాంధీజీ ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహంలో తొలి జట్టులో ప్రముఖుడుగా వెళ్లిన వ్యక్తి శ్రీ పళ్లంరాజుగారు. అప్పుడు వీరు జిల్లా బోర్డు ప్రెసిడెంటుగానూ, జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటుగానూ, ఆలిండియా కాంగ్రెసు కమిటీ మెంబరుగానూ, రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగానూ వున్నారు. ఈ అరెస్టు తర్వాత 1941వ సంవత్సరం అంతా పళ్లంరాజుగారు తిరుచునాపల్లి జైలులోనే గడిపారు. అదేసంవత్సరం చివర విడుదలై తిరిగి జిల్లాబోర్డు అధ్యక్షులయ్యారు. కాని వెంటనే అగస్టు 1942 విప్లవంలో బొంబాయి మీటింగు నుంచి తిరిగి వస్తూవుంటే 11 వ తేదీన గోదావరి స్టేషనులో అరెస్టు చెయ్యబడ్డారు. ఈసారి వెల్లూరు, జైలులో నిర్బంధించబడ్డారు. రెండున్నర సంవత్సరాలపాటు జరిగిన యీ నిర్బంధం కొంత కాలం వెల్లూరు జైలులోనూ మరి కొంతకాలం మధ్య ప్రదేశ్ అమరావతి జైలులోనూ, తిరిగి మళ్లీ వెల్లూరు జైలులోనూ గడిచింది. ఈ మార్పుల వెనకవున్న గాధ ఒక అగాధమైనది. ఈ గాధలోనే ఆంధ్రదేశ భవిష్యత్ రాజకీయ యోజనలు, వివిధ వ్యూహాలు రకరకాల కలయికలు, తెగతెంపులు అంతర్భూతమై వున్నాయి.

1944 జనవరిలో పళ్లంరాజుగారు విడుదలయ్యారు. పళ్లంరాజుగారి జైలుజీవితంలోనే వీరి తండ్రి వీరాస్వామిగారు కీర్తిశేషులయ్యారు. జైలులో వున్నప్పుడు పళ్లంరాజుగారి జీవితం సహచరులకు ఆశ్చర్యం కొలుపుతూ విచిత్రంగా ఉండేది. జ్యోతిషంలో మంచి పాండిత్యం ఉంది. మామూలుగా జాతక చక్రాలు చూసి ఫలితాలు చెప్పేటప్పుడే కాక జ్యోతిశ్శాస్త్రజ్ఞులైన పెద్ద పెద్ద పండితులతో చేసే చర్చలలో వీరి పాండితీగరిమ వెల్లడయ్యేది. ఈ జ్యోతిశ్శాస్త్ర చర్చలు ఇటీవల కీర్తిశేషులవడానికి ముందు వీరు ఆసుపత్రిలో చేరేవరకు కూడా వీలు చిక్కినప్పుడల్లా జరుపుతూనే వున్నారు. పళ్లంరాజుగారికి చదరంగంలో మంచి ప్రావీణ్యం ఉంది. జైలులో యీ ప్రావీణ్యం కాలక్షేపానికి బాగా ఉపయోగపడింది. జైలులో ఎంత విశ్రాంతిగా వుండేవారో విడుదలైన మరుక్షణం నుంచి తలమునకలుగా పనిచెయ్యడం తప్పేది కాదు. తప్పించుకోవాలనే ఆలోచనా కలిగేది కాదు. 1944 వ సంవత్సరం బైటవున్న కాంగ్రెసు వాదులకూ, తక్కువ కాలం శిక్షలతో బైట పడిన వారికి ఏమి చెయ్యాలో కార్యక్రమం తోచేది కాదు. 1945 లో యుద్ధం ముగిసిన తరువాత కాంగ్రెసు మళ్లీ యధాస్థితికి వచ్చి బాగా వేరూది నిలదొక్కుకుంది. తరువాతి కాలంలో పళ్లంరాజుగారు కాంగ్రెసు పరివ్యాప్తికై చేసిన కృషి అమేయం.

స్వాతంత్ర్యానంతరం 1952 లో జరిగిన ఎన్నికల్లో తాను ఓడిపోవడం, అవాంతరంగా 1955 లో జరిగిన ఎన్నికల్లో విజయం సంపాదించడం అంత ప్రత్యేకత కలవిగా పళ్లంరాజుగారు పట్టించుకోలేదు. 1959లో పళ్లంరాజుగారి మిత్రులందరూ కలసి బ్రహ్మాండంగా షష్టిపూర్తి ఉత్సవం జరిపారు. డాక్టర్ రాధాకృష్ణన్ ప్రభృతులుగాగల అనేక మంది కేంద్రనాయకులు, శ్రీ నీలం సంజీవరెడ్డి, కళా వెంకట్రావు మొదలుగాగల రాష్ట్ర నాయకులు శుభాశంసలతోపాటు, ప్రశంసలనుకూడా కురిపించారు. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ తరువాత 1960 జనవరిలో శ్రీ దామోదరం సంజీవయ్య నాయకత్వం క్రింద ఏర్పడిన మంత్రివర్గంలో కొంత కాలం పాటు అటవీశాఖా మాత్యులుగా పనిచేశారు. అనంతరం జనరల్ ఎలక్షన్లు జరిగే వరకూ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగావుండి ఎన్నికలలో కాంగ్రెసు విజయానికై ఆరోగ్యం అంతంత మాత్రంగానే వున్నా తీవ్రంగా కృషిచేశారు. ఎన్నికల అనంతరం శ్రీ నీలం సంజీవరెడ్డిగారి నాయకత్వాన 1962 మార్చిలో ఏర్పడిన ప్రస్తుత మంత్రి వర్గంలో తిరిగి అటవీశాఖా మాత్యులుగా నియమితులయ్యారు. శ్రీ పళ్లంరాజుగారు మంత్రిగా వున్న ఆరున్నర మాసాల కాలంలో ఆరోగ్యం అంతంత మాత్రమే అయినా తమ పరిపాలనా దక్షతనూ, బుద్ధి నైశిత్యాన్ని చక్కగా చూపించారు. మామూలుగా వున్న అనారోగ్యానికి తోడు, హఠాత్తుగా గుండె జబ్బు, పక్షవాతం రావడం వల్ల సెప్టెంబరు 24 వ తేదీన హైద్రాబాదు ఉస్మానియా ఆస్పత్రిలో చేర్చబడ్డారు. దేశసేవకై యువక ప్రాయం నుంచి

జీవిత సర్వస్వాన్ని అంకితం చేసిన శ్రీ పళ్లంరాజుగారు 27 వ తేది రాత్రి గం. 2-20 నిమిషాలకు (తెల్లవారితే 28వ తేదీ అనగా) మహాలయ అమావాస్య పుణ్య ఘడియల్లో కీర్తి శేషులయ్యారు.

ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ ఎస్. ఎం. శ్రీ నగేష్ పళ్లంరాజుగారి మరణవార్త విని సంతాపం తెలుపుతూ " ఆయన అస్తమయం వల్ల రాష్ట్ర ప్రజలు ఒక ప్రముఖ నాయకుణ్ని. రాష్ట్ర ప్రభుత్వం ఒక సమర్థుడైన పరిపాలకుణ్ని కోల్పోయింద"ని ప్రకటించారంటే – ముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు, " స్వరాజ్య సమరం సందర్భంలో క్లిష్ట పరిస్థితులను ఆయన ఎదుర్కొన్న తీరు మనకు ఎల్లప్పుడూ జ్ఞప్తిలోఉంటుంది. ఆయన సేవ, త్యాగం దేశంలో ఎంతోమంది యువకుల్ని ఉత్తేజ పరిచినవి. నేనొక గౌరవనీయుడైన సహచరుణ్ని కోల్పోయాను " అంటూ తమ సానుతాపాన్ని వెల్లడించారంటే అది పళ్లంరాజుగారి వ్యక్తిత్వ విశేషమే కాని వేరు కాదు. త్యాగ సేవా మయమై స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తూర్పు గోదావరి జిల్లా పరంగా ప్రత్యేక స్థానం సంపాదించిన శ్రీ పళ్లంరాజుగారి మూర్తి ఆంధ్రుల మనః ఫలకం మీద ఎల్లప్పుడూ ప్రతిబింబిస్తూనే వుంటుంది.

(ఈ వ్యాసంలో కొంత భాగం శ్రీ పళ్లంరాజుగారి షష్ఠి పూర్తి సన్మాన మహోత్సవ సంచికలోని వ్యాసాలు ఆధారంగా రూపొందించ బడింది.)



# సాంకేతిక విద్యాభివృద్ధి

మూడవ పంచవర్ష ప్రణాళికక్రింద 1961-62వ సంవత్సరంలో ప్రారంభించిన పథకాలు అభివృద్ధి చెందుతున్నాయి. ఇవిగాక 1962-63 వ విద్యా సంవత్సరం నుంచి దిగువ పేర్కొన్న కొత్త అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించారు.

కాకినాడలోని ఇంజనీరింగ్ కళాశాలలో విద్యార్థుల ప్రవేశ సంఖ్యను 150 నుంచి 180కి పెంచారు. సివిల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ శాఖలలో ఒక్కొక్క దానిలో 15 చొప్పున అదనంగా 30 స్థానాలను హెచ్చించారు. కాకినాడలోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలో బాలికల కొరకు మూడు స్థానాలను ప్రత్యేకించడానికి ప్రభుత్వం అంగీకరించింది. దీనివల్ల మున్ముందు బాలికల పాలీటెక్నిక్‌లలో మహిళలనే బోధనా సిబ్బందిగా నియమించ డానికి వీలు కలుగుతుంది.

హైదరాబాదు, కాకినాడలలోని బాలికల పాలిటెక్నిక్‌లలో కొత్త కోర్సులను ప్రవేశ పెట్టారు. కాకినాడ ప్రభుత్వ పాలిటెక్నిక్‌లో వాస్తు శాస్త్రంలో సర్టిఫికెటు కోర్సును కొత్తగా ప్రారంభించారు. దీనిలో ఏటా 30 మంది బాలికలు ప్రవేశం పొంద డానికి వీలు కల్పించారు. మెట్రిక్యులేషను తరువాత మూడు సంవత్సరాల వరకు ఈ కోర్సు శిక్షణ గరుపుతారు. ఇదే విధంగా ప్రైవేటు రంగంలో హైదరాబాదులోని బాలికల పాలిటెక్నిక్‌లో ఫార్మసీ, ఇనిస్టిట్యూషనల్ మేనేజిమెంట్లలో కొత్తగా రెండు కోర్సులను ప్రారంభించారు. ప్రతి కోర్సులోనూ ఏటా 30 మంది చొప్పున విద్యార్థినులకు ప్రవేశావకాశం కల్పించారు.

మూడవ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం క్రింద ప్రైవేటు, పబ్లికు రంగాలలో పనిచేస్తున్న సాంకేతిక సంస్థలన్నింటికీ ప్రభుత్వం అదనంగా స్కాలర్ షిప్పులు మంజూరు చేసింది.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 ఆగస్టు నెలలో నెలకొల్పబడిన కమ్యూనిటీ రేడియో సెట్ల వివరణ

| తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|
| | **కరీంనగరం జిల్లా** | |
| సిరిసిల్ల | సుద్దాల | 8-8-62 |
| కాచాపురం | కరీంనగరం | 8-8-62 |
| సుల్తానాబాదు | మర్మూరు | 19-8-62 |
| ,, | రాచపల్లి | 24-8-62 |
| | **నిజామాబాదు జిల్లా** | |
| నిజామాబాదు | అమృతపూర్ | 3-8-62 |
| ,, | సిర్నాపల్లి | 4-8-62 |
| బోదన్ | పోతనగల్లు కలాన్ | 1-8-62 |
| — | మనికబందర్ | 27-8-62 |
| | **ఆదిలాబాదు జిల్లా** | |
| మధోల్ | కనకాపూర్ | 8-8-62 |
| | **వరంగల్లు జిల్లా** | |
| వరంగల్లు | ఉనికిచర్ల | 4-8-62 |
| ,, | మల్లకదుర్గ | 5-8-62 |
| ,, | తమసందపల్లి | 7-8-62 |
| ,, | కొత్తపల్లి | 8-8-62 |
| ,, | కృష్ణాజీగూడెం | 9-8-62 |
| నరసంపేట | తపనపల్లి | 19-8-62 |
| ములుగు | ఘనపురం | 23-8-62 |
| ,, | కాసిందేవిపేట | 24-8-62 |

| తాలూకా పేరు | గ్రామము లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|
| | **నెల్లూరు జిల్లా** | |
| కోవూరు | పడుగుపాడు II | 22-8-62 |
| ,, | పడుగుపాడు III (హరిజన కాలనీ) | 22-8-62 |
| నెల్లూరు | బ్రహ్మానందవారు III (హరిజన కాలనీ) | 22-8-62 |
| | **చిత్తూరు జిల్లా** | |
| చిత్తూరు | పాలేరు | 4-8-62 |
| పలమనేరు | వాసనాడు | 5-8-62 |
| ,, | బాల | 5-8-62 |
| ,, | మదనపల్లి | 6-8-62 |
| ,, | 89 పెద్దూరు | 6-8-62 |
| ,, | మానేంద్రం | 6-8-62 |
| ,, | రగడదిన్నెపల్లి | 7-8-62 |
| ,, | కె. కృష్ణాపురం | 7-8-62 |
| ,, | గొనుమాకులపల్లె | 7 8-62 |
| ,, | గొల్లచీమనపల్లె | 8-8-62 |
| కాళహస్తి | పెద్దకనపర్తి | 7 8-62 |
| ,, | చింతపాడు | 9-8-62 |
| ,, | మద్దిలేడు | 9-8-62 |
| ,, | ఓబులయ్యపల్లి | 10-8-62 |
| , | చౌడపరం | 10-8-62 |
| ,, | చింతపాలెం | 10-8-62 |
| ,, | వాగవేడు | 11-8-62 |
| ,, | యెనుపేడు | 11-8-62 |

| తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ | తాలూకా పేరు | గ్రామము లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|---|---|---|
| కాళహస్తి | సీతారాంపేట | 11–8–62 | ఆదోని | కిమ్మబాలనూరు | 11–8–62 |
| పుత్తూరు | పైడిరేడు | 29–8–62 | ,, | గుడికంబలి II | 11–8–62 |
| | కడపజిల్లా | | ,, | టి. యస్. కొడ్లూర్ | 12–8–62 |
| కడప | కొక్కరాయపల్లి | 16–8–62 | ,, | మక్తోన | 12–8–62 |
| ,, | పెబ్బాపురం | 21–8–62 | నంద్యాల | బలపనూరు | 17–8–62 |
| | అనంతపురం జిలా | | ,, | పెద్దవేములపురం | 19–8–62 |
| గుత్తి | ఖాదర్ పేట | 7–8–62 | ధోని | జలదుర్గం | 19–8–62 |
| ,, | అయ్యవారిపల్లి | 7–8–62 | ,, | మునిముడుగు | 19–8–62 |
| ,, | వంకరాజుకల్వ | 8–8–62 | ,, | బూర్గుల | 20–8–62 |
| ,, | నీలూరు | 8–8–62 | ఆళ్లగడ్డ | బ్రాహ్మణపల్లి | 21–8–62 |
| ,, | లక్ష్మణపల్లి | 8–8–62 | ,, | చిన్నవెంగలి | 21–8–62 |
| ,, | గుంతకల్ కొత్తాల | 9–8–62 | ,, | యల్లూరు | 22–8–62 |
| తాడిపర్తి | వేములపాడు | 9–8–62 | ధోని | నేరేడుచర్ల | 22–8–62 |
| ,, | సజ్జలదిన్నె | 10–8–62 | ,, | చిన్నమలకాపురం | 24–8–62 |
| ,, | వెన్నపూసపల్లి | 10–8–62 | ,, | చిట్యాల | 26–8–62 |
| ,, | సూరెపల్లి | 11–8–62 | ,, | లక్కసాగరం | 27–8–62 |
| ,, | బుక్కాపురం | 11–8–62 | నంద్యాల | గాజులపల్లి | 18–8–62 |
| ధర్మవరం | పోలేపల్లి | 16–8–62 | ధోని | శ్రోత్రియంయెర్రగుడి | 28–8–62 |
| ,, | పోతులనాగేపల్లి | 17–8–62 | | మహబూబునగరం జిల్లా | |
| పెనుకొండ | మైలసముద్రం | 17–8–62 | కల్వకుర్తి | పెద్దాపురం | 8–8–62 |
| ,, | యినుములపల్లి | 18–8–62 | మహబూబునగరం | బాదేపల్లి మునిసిపాలిటీ | 14–8–62 |
| ,, | పోతులకుంట | 18–8–62 | నాగరకర్నూలు | చందుపట్ల | 21–8–62 |
| అనంతపురం | బొందలేడు | 21–8–62 | ,, | సిరిస్వాడ | 22–8–62 |
| మడకసిర | అమిదాలగొంది | 22–8–62 | ,, | మారేపల్లి | 22–8–62 |
| పెనుకొండ | బ్రహ్మసముద్రం | 23–8–62 | కల్వకుర్తి | కడ్తల్ | 7–8–62 |
| | కర్నూలు జిలా | | ,, | వెలిదొండ | 26–8–62 |
| నందికొట్కూరు | లక్ష్మాపురం | 9–8–62 | నాగరకర్నూలు | వడ్డెమన్ | 23–8–62 |
| ఆలూరు | దనపురం | 9–8–62 | కొల్లాపురం | పెంట్లపల్లి | 30–8–62 |
| నందికొట్కూరు | బెగినవేముల | 10–8–62 | | నల్లగొండ జిలా | |
| ,, | భీరపురం | 11–8–62 | | రంగాయగూడెం | 10–8–62 |
| ఆదోని | చిన్నతుంబాలం | 11–8–62 | | భక్తలాపురం శివారు | |

| తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|
| — | అడివేముల | 11-8-62 |
| — | యెర్కారం | 12-8-62 |
| — | బాలెంల | 12-8-62 |
| — | నల్లగొండ, పట్టణ మునిసిపాలిటి | 14-8-62 |
| — | కోదాడు | 17-8-62 |
| — | బాలాజినగరం | 17-8-62 |
| — | గణపవరం | 18-8-62 |
| — | ఇక్కుర్తి | 30-8-62 |
| — | రాజాపేట | 30-8-62 |
| — | రాయగిరి | 31-8-62 |
| | **శ్రీకాకుళం జిలా** | |
| పాలకొండ | లింగాలవలస | 24-8-62 |
| చీపురుపల్లి | బంటుపల్లి | 15-8-62 |
| ,, | రావాడ | 16-8-62 |
| ,, | కొండముఖగం | 15-8-62 |
| ,, | పిసిమి | 15-8-62 |
| ,, | కోటపాలెం | 15-8-62 |
| పాలకొండ | గోకర్ణపల్లి | 7-8-62 |
| చీపురుపల్లి | దాళ్లవలస | 13-8-62 |
| శ్రీకాకుళం | గోర్తి | 15-8-62 |
| చీపురుపల్లి | దల్లిపేట | 10-8-62 |
| శ్రీకాకుళం | బమరవల్లి | 15-8-62 |
| టెక్కలి | చినతుముగం | 14-8-62 |
| చీపురుపల్లి | యాడికి | 25-8-62 |
| ,, | కొండపాలెం | 26-8-62 |
| టెక్కలి | సీతాపురం | 15-8-62 |
| సోంపేట | పాసానం | 29-8-62 |
| ,, | బైరిపురం | 29-8-62 |
| పరవకోట | వెదుళ్లవలస | 31-8-62 |
| | (డ్రైబ్యాటరీ సెట్టు మార్చి) | |

| తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|
| | **విశాఖపట్నం జిలా** | |
| యస్. కోట | గుడివాడ | 3-8-62 |
| ,, | చింతాడ | 3-8-62 |
| ,, | వేణు | 4-8-62 |
| యలమంచలి | బోడుగళ్లం | 8-8-62 |
| ,, | పాల్టేరు | 10-8-62 |
| చోడవరం | కింతలి | 8-8-62 |
| ,, | గొడిరాయి | 8-8-62 |
| విశాఖపట్నం | బక్కన్నపాలెం | 22-8-62 |
| నర్సీపట్నం | లక్ష్మీపురం | 23-8-62 |
| అనకాపల్లి | అనకాపల్లి | 26-8-62 |
| ,, | అద్దం | 22-8-62 |
| ,, | బట్టపుడి | 27-8-62 |
| నర్సీపట్నం | తడపల | 25-8-62 |
| విజయనగరం | గిట్టుపల్లి | 31-8-62 |
| ,, | కొండకిందం | 31-8-62 |
| విశాఖపట్నం | మల్కాపురం | 29-8-62 |
| విజయనగరం | గజపతినగరం | 28 8-62 |
| | **తూర్పు గోదావరి జిలా** | |
| తుని | కాకరపల్లి | 4-8-62 |
| ,, | చమయారం | 3-8-62 |
| పెద్దాపురం | ఎ. మల్లవరం | 16-8-62 |
| ,, | ఇర్రిపాక | 9-8-62 |
| పిఠాపురం | ఎ. మల్లవరం | 14-8-62 |
| పెద్దాపురం | రాజవరం | 15-8-62 |
| ,, | యన్. నరేంద్రపట్నం | 17-8-62 |
| కాకినాడ | పనసపాడు | 12-8-62 |
| పిఠాపురం | గొల్లప్రోలు | 14-8-62 |
| పెద్దాపురం | చినబ్రహ్మదేవం | 31-8-62 |
| పిఠాపురం | మంగితుర్తి | 22-8-62 |
| కాకినాడ | వేట్లపాలెం | 31-8-62 |
| రామచంద్రాపురం | బ్లోకవోలు II | 25-8-62 |

| తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|---|---|---|
| | పశ్చిమ గోదావరి జిల్లా | | గన్నవరం | కొత్తగూడెం | 24-8-62 |
| తాడేపల్లిగూడెం | గమపవాలెం II | 11-8-62 | గుడివాడ | కొరినపాడు | 25-8-62 |
| .. | జాహపాలెం | 20-8-62 | | గుంటూరు జిల్లా | |
| కొవ్వూరు | చాగల్లు II | 11-8-62 | గుంటూరు | పెదవడ్లపూడి II | 9-8-62 |
| .. | లింగనపల్లి | 17-8-62 | సత్తెనేపల్లి | హసన్‌బాదు | 17-8-62 |
| | (నిడదవోలు శివారు) | | రేపల్లి | కామరాజుగడ్డ | 19-8-62 |
| .. | పెండ్యాల | 2-8-62 | | దక్షిణ II | |
| ఏలూరు | ఆంబరపేట | 10-8-62 | సత్తెనేపల్లి | అచ్చంపేట | 21-8-62 |
| .. | కోటూరు | 22-8-62 | .. | పెదగార్లపాడు | 16-8-62 |
| .. | గోపన్నపాలెం | 31-8-62 | .. | దొడ్లారు | 24-8-62 |
| .. | కమదవోలు | 29-8-62 | .. | కాస్త్రలి | 23-8-62 |
| .. | సత్యవోలు | 31-8-62 | తెనాలి | అమృతలూరు IV | 25-8-62 |
| | కృష్ణా జిల్లా | | .. | జంపని | 11-8-62 |
| దివి | నాగాయతిప్ప | 22-8-62 | వినుకొండ | ఎనుగుపాలెం | 10-8-62 |
| .. | పెదకళ్లేపల్లి | 23-8-62 | | నెల్లూరు జిల్లా | |
| నూజివీడు | ఎల్లాపురం | 18-8-62 | కావలి | కావలి | 1-8-62 |



## సవరణ

గతనెల "ఆంధ్రప్రదేశ్" 48 వ పుటలో రెండవ కాలంలోని "1864 నవంబర్ 30వ తేదీన జన్మించారు" అన్నదాన్ని "1862 సెప్టెంబర్ 21వ తేదీన జన్మించారు" అని సవరించి చదువుకొనవలెను.

# పారిశ్రామిక వి ాలు

[రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడు తున్నాయి. పారిశ్రామిక వేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనడం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షిక క్రింద యివ్వబడుతున్నవి ]

## కేంద్ర రంగం

సింథెటిక్ డ్రగ్స్ ప్రాజెక్టు నిర్మాణం పని చురుకుగా కొనసాగుతున్నది. కేంద్రవాణిజ్య పరిశ్రమల మంత్రి శ్రీ కె.సి. రెడ్డి, ఈ ప్రాజెక్టుకు సంబంధించిన కార్యాలయ భవనాలకు యిటీవల పునాదిరాయి వేశారు.

భారీ విద్యుత్పరికరాల ప్రాజెక్టు నిర్మాణం పని కూడా చురుకుగా కొనసాగుతున్నది.

దిగువ తెల్పిన పరిశ్రమలు ఆశించిన విధంగా స్థిరాభివృద్ధి చెందిన దృష్ట్యా 1951వ సం॥ పరిశ్రమల (అభివృద్ధి, క్రమబద్ధం) చట్టాన్ని అనుసరించి యీ పరిశ్రమలను నెలకొల్పడానికి సాధ్యమైనంత వరకు క్రొత్తవారికి లైసెన్సులు మంజూరు చేయాలని భారత ప్రభుత్వం యిటీవల నిశ్చయించింది. అయితే ఎగుమతులను ప్రోత్సహించడానికీ, యితర ప్రత్యేక కారణాల దృష్ట్యా యీ పరిశ్రమలలో యూనిట్లను నెలకొల్పడానికి అనువైన వారికి లైసెన్సులు మంజూరు చేయడంలో యీ నిర్ణయం వల్ల అవరోధం కలగదు.

1. వస్త్ర పరిశ్రమ, 2. జనపనార పరిశ్రమ, 3. విస్కోస్ రాయాన్ నూలు, స్టాపిల్ నూలు, 4. చక్కెర, 5. సిమెంటు 6. కాగితము, 7. కాస్టిక్‌సోడా, సోడాయాష్, 8. ఇండస్ట్రియల్ గ్యాసులు, 9. అగ్గిపెట్టెలు, 10. సూపర్‌ఫాస్పేటు.

## ప్రైవేటు రంగం

ఇల్లెందులో దుక్క యినుము ప్లాంటును నెలకొల్పడానికి మెసర్స్ కళింగ పరిశ్రమలకు భారత ప్రభుత్వం లైసెన్సును జారీ చేసింది. ఇందులో సంవత్సరానికి లక్ష టన్నుల దుక్క ఇనుము తయారవుతుంది. యీ ప్రాజెక్టులో రూ. 7 నుండి 9 కోట్ల పెట్టుబడి అవసరమౌతుంది.

సంవత్సరానికి 5000 టన్నుల ఉత్పత్తి శక్తిగల మూడు రీరోలింగ్ మిల్లులను రాష్ట్రంలో నెలకొల్పడానికి భారత ప్రభుత్వం ఇనుము, ఉక్కు కంట్రోలర్ పర్మిట్లను జారీ చేశారు. రాష్ట్రంలోని మూడు ప్రాంతాలయిన అనంతపురం, గుంతకల్లు, హైదరాబాదులలో యీ యూనిట్లను నెలకొల్పుతారు.

హైటెన్షన్, లోటెన్షన్ ఇన్సులేటర్ల ఉత్పత్తిని చేపట్టడానికి ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థ అందజేసిన దరఖాస్తును భారతప్రభుత్వం సూత్రప్రాయంగా ఆమోదించింది. అయితే లైసెన్సును ప్రైవేటు సంస్థలకు మార్చరాదనే షరతుకు లోబడి ఇది ఉంటుంది.

రాజమండ్రిలోని సత్యనారాయణ నూలు మిల్లులో 7,000 కదుళ్లను అదనంగా నెలకొల్పడానికి లైసెన్సును జారీ చేయడం జరిగింది. దీనివల్ల యీ మిల్లు ఆర్థికంగా బలపడుతుంది.

## సింగరేణి బొగ్గు గనులు

1961 ఆగస్టులో 2,35,374.2 టన్నులు, 1962 జూలైలో 2,71,333.3 టన్నుల ఉత్పత్తి ఉండగా 1962 ఆగస్టు నెలలో 2,71,946.9 టన్నుల ఉత్పత్తి జరిగింది.

1961 ఆగస్టు ఆఖరువరకు 17,52,087.8 టన్నుల ఉత్పత్తి ఉండగా 1962 ఆగస్టు ఆఖరువరకు 19,71,347.8 టన్నుల ఉత్పత్తి జరిగింది.

# రాయలనాటి రాజభోగములు

గిడుగు వెంకట సీతాపతి

"నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక
తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల
మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక
పాఠ కోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు
మటన్న శక్యమే ?"

— ఈ పద్యము అల్లసాని పెద్దన చెప్పినదట! ఓహో ఏమి యతని భోగలాలస! ఎప్పుడో ఎవరితోనో ప్రసంగిస్తూ చెప్పినది కాదీ పద్యము— తన ప్రభువు కృష్ణదేవరాయలు ఒక కృతి రచింప వలసినదని తనను వేడినప్పుడు అతడు చెప్పిన పద్యమని ప్రతీతి. రాయల ఆస్థానమందు ప్రధాన కవియై రాజమర్యాదలు పొందుచు నుండినవాడు కనుకనే పెద్దన అట్లు పలుకగలిగినాడు. ఇతని యెడల కృష్ణదేవరాయలకెంత యనురాగము, గౌరవము ఉండెనో!

—"ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె"
మనుచరిత్రం బందు కొను వేళఁ బురమేగఁ
బల్లకి తనకేలఁ బట్టియెత్తె !
బిరుదైన కవిగండపెండేరమున కావె
తగుదని తానె పాదమునఁ దొడిగెఁ !
గోకట గ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమల యందునిచ్చె !
నాంధ్ర కవితా పితామహ యల్లసాని పెద్దన
కవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేఁగ లేక
బ్రదికియుంటి జీవచ్ఛవంబు నగుచు"—

అని కృష్ణరాయల మృతికి దుఃఖిస్తూ చెప్పిన పద్యములో తనకు సిరిసంపద లెన్నియున్నను, తన రాజభోగములు రాయలతోనే అంతరించినట్లు తెలియగలదు. భోగములనుభవించుటకు మనస్సు సరిగా నుండవలెను. కావుననే,

"మన ఏవ మనుష్యాణాం కారణం సుఖదుఃఖయోః" అన్నారు. అందుచేత సుఖజీవులయినవారే భోగముల కర్హత గలవారు.

వారి భోగములు రాయల నాడెట్లుండెనో తెలియజేయుటయే నా ప్రసంగమునకు ముఖ్య విషయము. ఆ రాజభోగములను తెలిసికొనుటకు తగిన ఆధారములు కృష్ణరాయలు రచించిన ఆముక్తమాల్యద నుండిన్నీ, పెద్దన రచించిన స్వారోచిషమను చరిత్ర నుండిన్నీ, నందితిమ్మన రచించిన పారిజాతాపహరణము నుండిన్నీ గ్రహింపవచ్చును. భోగములకు ఆలంబములయినవి ముందుగా పేర్కొని, ఏయే భోగములు ఎవరెవరు ఎంత వరకు అనుభవించు చుండిరో తెలియజేస్తున్నాను. అన్న పానాదులు, గృహము, శయ్య, స్త్రీ, వస్త్రములు, ఆభరణములు, పువ్వులు, సుగంధ ద్రవ్యములు—క్రీడలు—యివి భోగముల కాలంబములు, కవులు ప్రాచీన కాలమునాటి కథలనే వర్ణించినా, తమ అనుభవములోనున్న విషయములనే ఆనాటి విషయములుగా గ్రహించి వర్ణించుట పరిపాటి. కనుక ఆముక్తమాల్యద, మను చరిత్ర, పారిజాతాపహరణములందలి భోగముల వర్ణనలు రాయలనాటి భోగముల వర్ణనలుగానే మనము గ్రహించ వచ్చును— మనుచరిత్రలో ప్రవరుని గృహిణి గూర్చి చెప్పిన పద్యము— "వండనలయదు వేవురు వచ్చిరేని యన్నపూర్ణకు నుద్దియై యతని గృహిణి! అతిథులేతేర నడికిరే యైనఁ బెట్టవలయు భోజ్యంబులింట నవ్వారిగాఁగ"— అతిథి సత్కారమునుగూర్చి "ఆముక్తమాల్యద"లో చెప్పిన పద్యములందు అన్న పానాది భోగములను వర్ణించునవి కలవు.

"ఆ నిష్ఠానిధి గేహసీమ నడు రే
యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్ర శయాను పుణ్యకథలుం
దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము నాస్తి శాక బహుతా
నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా
భోక్తవ్యమ న్మాటలున్"—

ఇందులో కూరలు పెక్కుగా లేవు. భోజన పదార్థములు చల్లారి పోయినవి. పిండివంటలు లేవు. అన్నమైనను ఒప్పిదముగా లేదు. అనుటలో భోజనము అవ్వారిగా పెట్టిన్నీ, ఇంకను ఉత్కృష్టముగా పెట్టలేక పోయితినే అని ఆ వైష్ణవోత్తముడు పడిన బాధ తెలియగలదు—వాస్తవముగా అతని ఇంట భోజన భోగము లెట్టివో తెలియజేయగల పద్యములున్నవి—

"తెలి నులివెచ్చ యోగిరముఁ దియ్యని
చారులుఁ దిమ్మనంబులున్
బలుచని యంబళుల్ చెఱకు
పాలెడునీళ్లు రసావళుల్ ఫలం
బులును సుగంధి శీత జలముల్
పడపిండెడు నీరు చల్లయున్
వెలయఁగ బెట్టు భోజనము వేసవిఁ
జందన చర్చ మున్నుగన్"—

ఇది వేసవి కాలమందలి భోజనము. ఇక శీతకాల మందలి భోజన మెట్లుండెనో వినండి ;—

పునుఁగుందావి నవోదనంబు
మిరియంపుం పొళ్లతోఁ జట్టి చు
య్యను నాదారని కూరగుంపు
ముకుమందై యేర్చు నావం జిగు
ర్కొను పచ్చళ్లను బాయసాన్నములు
నూరుంగాయలున్ జేసు బు—
క్కను నేయుం జిఱుపాలు వెల్లువగ
నాహారంబిడున్ సీతునన్''—

ఈ ఆహార పదార్థములు శీతబాధా నివారకములు—ఈ ఆముక్తమాల్యదలోనే మరియొక పట్టున మధురానగర మందలి రాజ పురోహితుని యింటియందలి భోజన పదార్థములు వర్ణింప బడినవి—

—"పరిపక్వ సురభి రంభా ఫలంబుల
తోడ దళమెక్కు పనసపండొలల తోడ
ఘృతపిండ నిభకర్కరీ ఖండములతోడఁ
బలు దెలుంగుల మాపిపండ్ల తోడ
గోస్తనీ మృదు గుళుచ్ఛ స్తోమములతోడ,
గప్పులేఱిన వడప్రప్పు తోడ
సుమధుర స్థూల దాడిమ బీజముల తోడ,
దనుపారు రసదాడి గనెలతోడ
పానకం బతిధుల కిడ్డఁదాను గ్రోలి,
యర్చనాదత్త చందన చర్చఁ దేలి
విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరు
కొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టుగాయ"—

ఇవి శాకాహారులయిన వారి భోజన పదార్థములు. ఇక చేపలు తినే భోగులు భోజనము కూడా ఆముక్తమాల్యదలో వర్ణింపబడినది—ఆవర్ణనగల పద్యము

"తారుద్యాతిగ చూతనూత్న ఫలముల్ తైలాభి ఘారస్వనత్" అనేది క్లిష్టమయినది కనుక దాని తాత్పర్యము చెప్పుచున్నాను—

వేసవికాలములో మధ్యాహ్నమున దోరమామిడి కాయల ముక్కలతో చుయ్యుమను నూనెపోత తాళింపుచేసి, నీటితడి యిగురుగానే తీసిన చేపబద్దల యిగురుతిని సాయంకాలమున ఆ భోజనము జీర్ణముకాగా ఆ చేపబద్దల కనరుద్రేన్పులురాగా చలువ పొందుటకు ఇసుకలో పెట్టియుంచిన టెంకాయలు పైకితీసి అందుగల చల్లని నీళ్లను త్రాగుదురట—అంతేకాదు, భోగాసక్తులైనవారు టెంకాయ సారాయికూడా చలువచేయు పదార్థముగా త్రాగుచుండే వారని మరియొక పద్యములో ఉన్నది. అనాగరికుల భోజనము కూడా ఆముక్తమాల్యదలో వర్ణింపబడినది.

"గురుగుంజెం చలిఁ దుమ్మి లేఁదగిలి సాకుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారుగో
గిరముల్ మెక్కి"

అనగా స్వతంత్ర భూజీవనముగల రెడ్డిదొరలు చిన్నారుగల యన్నము గురుగాకు, చెంచలాకు, తుమ్మియాకు, లేత తంటి పాకు అనే ఆకుకూరలు చింతచిగురుచేర్చి వండినవి. సమృద్ధిగా నూనె పోసికొని కలుపుకొని తృప్తిగా భుజించేవారట!— భోజనానంతరము తాంబూలము, అనగా కేవలము ఆకు, వక్క, సున్నము మాత్రమే కాదు; ఏలకులు, లవంగములు, జాజి, జాపత్రి, కర్పూ

రము, కస్తూరి, మొదలగు పరిమళ ద్రవ్యములు ఎన్నో కలిపిన తాంబూలము, రాజభోగమునకు అర్హతగల సున్నము, రాతి సున్నము గులకసున్నముకాదు. 'ముక్తా చూర్ణేన సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతా' మన్నారు. ముత్తెములుకాల్చి తడిపి చేసిన సున్నము.

''దొంతర విడెముతో–నావద్దకురాకురా''– అనే క్షేత్రయ పదములో దొంతర విడెమనగా క్రీడకు పూర్వము పుష్టి, చురుకూ కలిగించుటకు కస్తూరి విడెము, ఆ పిమ్మట రతాంతమున చలువ చేయుటకు కప్పూరవిడెము సేవించుట రాజభోగములలో పేర్కొన వలసినది– వరూధినీ నివాస స్థలము సమీపించునపుడు ప్రవరునికి ఎదురుకోలుగా వచ్చిన తావి పెద్దన వర్ణిస్తూ చెప్పిన పద్యము విన్నారా?

"మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర
వీటి గంధ
స్థగితేతర పరిమళమై మగువ పొలుపు తెలుపునొక్క–
మారుత మొలిసెన్"

కనుకనే ''రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము" కూడా వుంటే కాని కావ్యరచన శక్యము కాదని పెద్దన పలికినాడు.

అన్నపానాదుల తర్వాత గృహము శయ్య స్త్రీలవలన కలిగిన భోగములు ఎట్లుండెనో చూతాము– నేటి రాజభవనములు, సుల్తానులూ, నవాబులూ, నివసించు మందిరములు, ఆనాటి భవనముల నిర్మాణము ననుసరించి కట్టినవిగానే తోచును. ముంగిట ద్వారమున కిరుప్రక్కలను విశాలమైన అరుగులు, కచ్చేరీ సావిడిలో ఒక ప్రక్క ఎత్తైన తిన్నె, దానిమీద తివాచీ, దానిమీద దిండ్లు, బాలీసులు అమర్చిన ఆసనములు–ఆ తిన్నె కెదురుగా రెండవ ప్రక్కను ఎత్తైన చదరపు పీటలు మొదలయిన ఆసనములు, మందిరమునకు ముందు రెండుమూడడుగుల లోతుగల యొక చదరపు నడబావి, అందు నిండుగా నీరు, తామరలు, కలువలు, బాతులు; మందిరమునకు నాలుగువైపులను పూలచెట్లు, పెరటిలో చిన్నకొలను అందు రాసక్రీడకు కావలసిన పరికరములు, దాని చుట్టునూ ఫలవృక్షములు భవనమున మేడలు, మిద్దెలు, చంద్రశాలలు, బొమ్మలు చెక్కియమర్చిన స్తంభములు చిత్తరువులు గల గోడలు, నీటిని పైకి వెదజల్లు జలయంత్రములు, డిగ్గియలోనో, కొలనిలోనో, పూలతోటలోనో ఉండేవి– ఇవికాక మందిరమందు చిలుకలు, గోరెంకలు, పావురాలు, నెమిళ్లు, లేళ్లు, మొదలయిన జంతువులను పెంచుట భాగ్యవంతులకు పరిపాటి. చిలుకలకు మాటలు నేర్పుట నెమిళ్లచేత ఆడించుట, వారికి అందు ముఖ్యముగా స్త్రీలకు, పిల్లలకు వినోదకరమైనది– మందిర మంతటిలోనూ శయ్యాగారము ముఖ్యమైనది. అందలి మంచములు, హంసతూలికా తల్పముగల పాన్పు శృంగారము గోడలకు తగిలించిన పటములు, మొదలయిన వన్నీ శృంగార సోద్దీపకములు. మందిర నిర్మాణమునందు కోప గృహమను పేరనొకగది. ప్రత్యేకముగా నుండునేమో అని ఊహించుటకు రామాయణమందలికైక, పారిజాతాపహరణమందలి సత్యభామ భర్తపైనలిగి కోపగృహములో తలుపులు మూసి పెట్టుకుని, తలకు గుడ్డకట్టుకుని పరుండినట్లు వర్ణించుట దృష్టాంతముగా నున్నది.

స్త్రీలవలన కలుగు భోగములను ప్రత్యేకించి చెప్పనక్కర లేదు. కాని, యీ కాలమున అంతగా కనబడనిది. కనబడినా అంతగా చెప్పుకొనుటకు తగనిది. ఆ కాలమున గొప్పగా చెప్పుకునే విషయము కలదు. బహు పత్నీత్వము, వేశ్యాప్రీతి కృష్ణరాయలు శ్రీకాకుళములో హరివాసరోపవాసముండి, నిద్రింపగా, ఆ పుణ్యరాత్రచతుర్ధ యామంబున స్వప్నమందు, తెలుగు వల్లభ రాయస్వామియైయుండిన శ్రీ మహావిష్ణువు అతనికి సాక్షాత్కరించి చెప్పినది. ఆ మరుసటిదినము నిండోలగంబుండి సభ్యులకు తెలియజేయగా వారు రాయలకు కలుగనున్న స్వప్నఫలమును వివరించి తెలియజేస్తూ, అందొకఫలముగా

"ఇతోధిక బహుప్రేయసీ ప్రాప్తి" యు అగునని పలికినారు. బహుపత్నులవలన కొన్నిబాధలు కలుగును గాని, బహుప్రేయసులవలన ఈసులు కలుగవు. కలిగినను బాధలేదు. నేటి ప్రభువులువిని సహింపజాలని సంబోధనలు రాయలనాటి ప్రభువులు రాజభోగములకు అలవాటు పడినవారు కనుక. సంతోషముతో స్వీకరింపగలిగిరి.

''విలోకి వధూజన నూన శరాసన!"
ప్రసృతి విలోచనా కుసుమబాణ!
కామినీ జన మనోహరా!– ఈ విధముగా నుండిన సంబోధనలు అందులో అసత్యము, అసభ్యము, అతిశయోక్తి లేవుగనుక, విని సంతోషించేవారు.

ఆనాడు సంపెగనూనె, మొదలగు సుగంధ తైలములతో తలంటుటకు, దేహమునకు సుగంధ ద్రవ్యములతో నలుగుబెట్టుటకు, గొజ్జంగి నీటి వెల్లువలతో అభ్యంజనము కావించుటకు,

ఒడలు తోముటకు, తడియొత్తుటకు, పావుకోళ్లు తొడిగించుటకు, భోజనానంతరము కస్తూరి కర్పూరాది సుగంధ వ్యంజనములతో తాంబూలమందించుటకు, శయ్యపై పండుకొనునపుడు వీవెనలతో విసరుటకు స్త్రీలేకాని, ఆ ప్రభువులకు పురుష సేవకులు పనికిరారు. "మనుచరిత్ర"లో మనోరమ పెండ్లి అయినప్పుడు ఆమెతండ్రి ఆమెకు అరణముగానిచ్చిన, అందచందములు, ఆభరణములు మొదలైన విషయములు వర్ణించబడినవి.

మేలిమయిన కులుకుల రసిక జనంబుల మనంబుల

మరలు కొలుపంజాలి సురుచిరాభరణ భూషితంబగు పరిచారికా సహస్రము అరణముగా వచ్చినది- ఇచ్చినది కూతురికే అయినా, 'భోగము అల్లునికి చెందుటలో వింత ఏమికలదు? .. వస్త్రాభరణాది వస్తువుల వలనే స్త్రీ పురుషునకు కేవలము భోగ్య వస్తువనునీతి ఆకాలమున సమ్మతమైయుండెను—అందు కనుగుణముగా ఆనాడు వేశ్యల పొత్తుకూడా సభ్యముగా నుండెను—అది ప్రభువులకే కాక సామాన్యులకు కూడా ఘనతగావుండేది. ఉత్సవములందు, వేశ్యలు లేనిదే వేడుకేలేదు. విష్ణుచిత్తుడు మధురలో పండితగోష్ఠియందు, విజయముపొందిన తరువాత అతడు తన విల్లిపుత్తూరికి మరలిపోవునప్పుడు పాండ్యరాజు అతనిని ఏనుగుపై నెక్కించి ఊరేగించి, సాగనంపెను, ఆ ఊరేగింపు వర్ణనలో

"గజేంద్ర హయఘంటా, వారకాంతాంఘ్రి, నూపురముల్ మ్రోయగా" అని ఉన్నది. వారకాంతలను, గజేంద్రహయములతో చేర్చి చెప్పుటలో ఒక విశేషమున్నది. వారు సహజముగా మంద గజగామినులే, అయినా గజ్జెల గుర్రములవలె నడిచివారని సూచన. విష్ణుచిత్తుడు తన పుత్తూరు చేరినప్పుడు, అక్కడివారు వేశ్యమేళములతో ఎదురుగ నేగి స్వాగతము పలికినారు. అతనిని ఊరిలోనికి తీసికొనిపోవు సంబరమందు, సామంతరాజకుమారులు ఆవేశ్యలతో సరసాలాడుట గుర్రముల నెక్కిన సాలె రౌతులు, దిగుటకుచోటు లేనందున బాధపడుచుండినప్పుడు ఆ వేశ్యలు వారి అవస్థచూసి, చేతులుతట్టి, కోహోయని హేళనముగా పరిహాస శబ్దములు చేయుట వర్ణింపబడినది. రాయలనాటి రసికులను లోబరుచుకొను వేశ్యల అందచందములను, జాణతనమును, తెలియజేయు పద్యములు "ఆముక్తమాల్యద"లో కలవు.

"నవలయ ధ్వని గాఁగ సారెసైచు నదల్పు యతినైన
గుండె జల్లనఁ గలంపఁ సుడిసిన మొగమెత్తి చూడకుండు
పరాకు కుసుమబాణునినైనఁ గువిటుఁజేయ"—
అనే పద్యమునందునూ

"వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ
వరిగింజనొకట బల్వరుసదోమ"—అనే పద్యములోనూ

వేశ్యల చతురత వర్ణింపబడినది. ఆ తరువాత పద్యములో వేశ్యల భోగములు వర్ణింపబడినవి. కడు సౌకుమార్యము గలవారు కనుక వారు "ముత్యాలహారములనే కాని, చిలుముపట్టని బంగారు నగలు ధరింపరు, దేహమునకు కస్తూరి రాచి కొందురే కాని, జిడ్డుగానుండునని పునుగు పూసికొనరు. ధూపమును గ్రహింతురేకాని, తెమ్మయని పువ్వులు పెట్టుకొనరు. పలుచని జిలుగుచీరలు కట్టుకొందురే కాని, ఒత్తుకొనునని ముతుక బట్టలు కట్టరు"- అనియున్నది. ఆ తర్వాతి పద్యము భ్రాంతిమదలంకారముతో సరసముగా రచితమయినది.

తెల్లవారగనే వేశ్యలు తమ మేడపై వలభియందు కూర్చుండి, జడవిప్పుకొని, అందుతురిమి యుంచుకొన్న మల్లెపూలను తమ గోళ్లతో ఎగజిమ్మ, తొలగజేయగా ఆ పూల పరిమళముకోసము మునసరియుండిన తుమ్మెదలు పైకిలేచి, రొద చేయగా—ఆరొద వీణానాదముగా వినుపించునట—పువ్వులు దంతపు మెట్లవలె నుండునట, తలవెంట్రుకల చిక్కు, ఎడలించుటకు ఆ వేశ్యల చేతివ్రేళ్లు కదులుటచేత వీణ మీటునట్లు తోచును—అందుచేత వీధినిబోవు కాముకులకు ఆ వేశ్యలు వీణ వాయించుచున్నట్లు భ్రాంతి కలుగునట!

విలి పుత్తూరి వర్ణనలో రాజభోగములకు అనుగుణములైన అంశములుగల పద్యములనేకముగా ఉన్నవి.

"ద్రవిడ కుటుంబినుల్ పసుపురాచిన రత్నపుఁ దాపక్రింద నం
బువు దెరవాలగా"— అనే పద్యములో, గృహారామమందలి కొలనిలో అలవగృహిణులు జలకమాడుటకు రత్నపు మెట్టుమీద పసుపుకొమ్ము అరగదీసికొనగా, ఆ పసుపునీరు ఆ మెట్టుకు క్రిందికి దిగజారిఅక్కడ నిద్రించుచున్న హంసల రెక్కలపై బడుటచేత, ఆ రెక్కలకు పసిమివర్ణము-కలుగును. పిమ్మట ఆ హంసలు ఊరిలో సంచరించునప్పుడు స్వర్గంలోని బంగారు రెక్కల హంసలు దిగివచ్చినవా అనే భ్రాంతి పౌరులకు కలుగునట—

రాయల రాజధానియగు విజయనగరమునందలి అంగళ్ల వైభవమును బటి అక్కడి వారి ఐశ్వర్యమును, రాజభోగములు, ఎట్లుండెనో ఊహించుకో వచ్చును. అంగళ్లలో రత్నరాసులుండెనట ! అవి కొనగల వారు పెక్కండ్రు ఉండిరని మనకు తెలియగలదు.

పూలతోటలూ, ఫల వృక్షములు, మెండుగా నుండెను. పుష్పలావికల వర్ణనలను బట్టి అక్కడి రాజభోగములను గుర్తింపవచ్చును. ఆ పుష్పలావికలు జాణలు, వారితో రసికులుసరసోక్తులాడుట వారినిమించి ఆ వనితలు చమత్కారముతో సల్లాపములు జరుపుట ఆనందదాయకము లై యుండును. జాజి, సన్నజాజి, విరజాజి, మల్లె, మొల్ల, మొగలి, చేమంతి సంపంగి, మొదలయిన పూవుల పరిమళముగలవి, తోటలలోనూ గృహాంగణములందును మెండుగా నుండును. వేసవికాలమందు హంసతూలికా తల్పముపై మల్లె పువ్వులు పరచుకొని పరుండుట రాజభోగములలో నొకటిగా పేర్కొనదగినది

ఆ నాడు అలంకరణమునందలి ప్రీతి స్త్రీలకే కాక, పురుషులకు కూడా మెండుగా నుండెననుటకు కావ్యములందలి వర్ణనలు ఆధారములు—స్త్రీలవలెనే పురుషులును, ఏడువారాల సొమ్ములు—అనగా ఒక్కొక్క వారమునకు ఒక్కొక్క విశిష్టమైన జతనగలు ధరింప వలెనన్నది రాయల రాజనీతియట ! ఆనాటి వేష రచనలో సుగంధ ద్రవ్యముల వాడుక రాజభోగములలో పేర్కొనదగినది, ఆముక్తమాల్యదలో

"రేవుల్ మావుమతంగ జంబును మణి శ్రీఖండ ముక్తాదియున్ "—

అనే పద్యమునుబట్టి, ఈ సుగంధ ద్రవ్యములు పరదేశము నుండి స్వదేశమునకు సమృద్ధిగా దిగుమతి యగుటకు కావలసిన సదుపాయములు కావించి, వాణిజ్యము పెంపొందించుట రాయల రాజనీతి. ఆ కాలమందు గృహస్థుల ఇండ్ల కిటికీలగుండా అగరువత్తి సుగంధ ధూపములు వెల్వడు చుండెనట—వీధులలో గృహముల ముందు కలయంపి,—అనగా దుమ్మడగుటకు కస్తూరి చందనము, మొదలయిన సుగంధ వస్తువులు కలిపిన నీరు చల్లుట నిత్య కృత్యము—మనుచరిత్రలో వరూధిని ప్రవరునికి చూపిన సుగంధ వస్తువులెట్టివో పెద్దన తెలియజేసినాడు, విన్నారా ?

సద్యో వినిర్భిన్న సారంగ నాభిగా హృతమై పిసాళించు
మృగమదంబు ;
కసటువో బీరెండ గరఁగి కట్టనంటి గమగమ వలచు
చొక్కపు జవాజి,
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన తొరఁగిన పచ్చ
కప్పుర వుసిరము ;
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు దొనలనిండినయట్టి
తుహిన జలము—వివిధకుసుమ కదంబంబు "......

ఆ కాలములో సుగంధ ద్రవ్యములు తయారు చేయుటలో తెలుగు వారు నేర్పరులనుటకు ఆధారము విష్ణుచిత్తుని స్వపుర ప్రవేశ సందర్భమునగల బుక్కావాంద్ర వర్ణనలో ఉన్నది.

" రసిక జన బాంధవంబున బందు వియోగంబుమరచి
గంధకలనా
కుసుమరస గ్రథ నాదుల బాంధ్యంబులే కలరు సంధ్ర
దేశీయులగు
గంధకారులు...గొరుతుత్తడుల పై, రాచవారి పై నాటువారిపై
నాడు వారిపైఁ జల్లగాఁ జల్ల"...అని వర్ణింపబడినది.

ప్రవృత్తి భోగములు ఆనాడు ఎక్కువగా నుండెనని చెప్పుట చేత ఆనాటి వారికి విషయ లోలత్వమే కాని, నివృత్తి మార్గ దృష్టిలేదని చెప్పకూడదు. అందుకు దృష్టాంతముగా "ఆముక్తమాల్యద" లో మత్స్యధ్వజమహారాజ వృత్తాంత మొకటి కలదు—ఒకనాటి రాత్రి ఈ మహారాజు వేశ్యామందిరమునకు పోవుచుండెను. అప్పుడతని వేషము, ఠీవి, భోగలాలస, ఎట్లు వర్ణింప బడినవో విన్నారా ?

పన్నీటితోఁ గదంబము సేసి పూసిన మృగనాభి పసరాచని
గరు దెలుప
పాటలానిలము లార్పఁగఁ దపారపుఁ జుంగులలరఁ దావికి
మూఁగు నళులఁ జోఁప
కర్ణదోలా మౌక్తిక చ్ఛాయలెగఁ బ్రాకు నురు హారరుచులఁ
ద్రస్తరికిఁదన్న
శశికాంతి చెంగావి దళమలంచిన కేల స్వర్ణత్సరువు వాఁడి
వాలు మెఱయ
మొలఁత యడపముఁ దేఁ జరన్మేరు వనఁగఁ దలపరులు
గొందతొలసి ముంగలఁ జనంగ

నర్థపర్యాంతకాంతః పురముక భోగినీ సంగతికి రాజు పోవు చుండి, వేశ్యయింటికి పోవుచున్నప్పుడు మార్గ మధ్యమున ఒక శ్లోకము వినబడినది. అది పురోహితుని యింట పొట్ట పగులునట్లుగా విందు కుడిచి నిద్రపట్టక అటు నిటు దొర్లుచు ఒక బ్రాహ్మణుడు పాడుకొను చుండిన పద్యములలో కడపటిది. "వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థ మర్థం దివసేయ తేత, వార్థక్య హేతో ర్వయసానవేన పరత్రహేతోరిహ జన్మనాచ !" అనగా మానవుడు వర్షాకాలమునకు కావలసిన వస్తు సామగ్రి తక్కిన యెనిమిది మాసాలలో జతపెట్టుకోవలెను ; రాత్రికి కావలసినది పగటను వార్థక్యములో కావలసినది యౌవనములోను కూర్చి పెట్టుకోవలెను. అట్లే పరలోక సౌఖ్యమునకు కావలసిన పనులు ఇహలోకములో నున్నప్పుడే చేసికో వలెను అని అర్థము. ఈ సుభాషితము చెవిని పడగానే ఆ మత్స్యధ్వజ మహారాజు తనభోగలాలసకు పశ్చాత్తప్తుడై వేశ్యయింటికి పోవక తన యింటికి మరలి పోయెను. ప్రవృత్తి భోగములు పూర్తిగా అనుభవించిన వారికే ఒకానొక సమయమున వాని యెడల రోతపుట్టి నివృత్తి మార్గమునకు దృష్టి మరలగలదని కొందరి నమ్మకము. అందుకే కథ, చింతామణి బిల్వమంగళుల కథ మొదలయిన కథలు దృష్టాంతములుగా చెప్పుకొందురు.

## అరటి పంటలో ఆంధ్రకు అగ్రస్థానం

భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ ఆధ్వర్యాన 1962 సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన ద్వితీయ అఖిల భారత అరటి పండ్ల ప్రదర్శనలో ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమ స్థానం వచ్చింది.

ఈ అరటి పంటలో పశ్చిమ బెంగాల్‌కు ద్వితీయ స్థానం, మద్రాసుకు తృతీయ స్థానం లభించింది. ఈ ప్రదర్శనలో పలురకాల అరటి పండ్లను ప్రదర్శించారు. పది రాష్ట్రాలలో పండించిన 150 రకాలను ప్రదర్శించారు.

ఈ సంస్థ ఉపాధ్యక్షులు, కేంద్ర ఆహార వ్యవసాయ మంత్రిత్వశాఖ ప్రత్యేక కార్యదర్శి అయిన శ్రీ ఎ. డి. పండిట్ విజేతలకు బహుమతులను పంచిపెట్టారు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన శ్రీ పి. భాస్కరరాజు ఈ ప్రదర్శనలో ఐదు ప్రథమ బహుమతులను, ఒక ద్వితీయ బహుమతిని, ఒక ప్రత్యేక బహుమతిని పొంది అరటి పంటలో మహత్తర విజయాన్ని సాధించినందుకు ఆయనను శ్రీ పండిట్ అభినందించారు.

## చెక్ విశ్వవిద్యాలయంలో తెలుగు

ప్రేగ్‌లోని ఛార్లెస్ విశ్వ విద్యాలయంలో కొత్తగా నేర్పుతున్న భాషలలో తెలుగు, మళయాళం కూడా వున్నాయని ఆ విశ్వవిద్యాలయంలోని ద్రావిడ భాషల శాఖాధిపతి డాక్టర్ జవెలెబిల్ కెరోనిల్ మద్రాసులో వెల్లడించారు. గత సెప్టెంబరులో మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలో తమిళంలో ఒక ఉపన్యాసం ఇవ్వడానికి ఆయన మద్రాసు వచ్చారు. ఛార్లెస్ విశ్వవిద్యాలయంలో ముగ్గురు బాలురు, ఒక బాలిక తమిళం అభ్యసిస్తున్నారని ఆయన పత్రికా ప్రతినిధులతో అన్నారు.

## కేంద్రమంత్రి ప్రశంస

తిరుపతిలో 15 లక్షల రూపాయల వ్యయంతో నిర్మింపబడిన శ్రీ వెంకటేశ్వర రామనారాయణ రూయా ఆస్పత్రికి కేంద్ర హోంమంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి గత సెప్టెంబరు 24 వ తేదీన ప్రారంభోత్సవం జరుపుతూ ఈ ఆలయ నగరంలో ప్రజల కుపయుక్తమైన విశ్వవిద్యాలయం, ఇంజనీరింగ్ కళాశాల ఇంకా ఇతర సంస్థల అభివృద్ధిని ప్రస్తావించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశంలో ఒక మహత్తర రాష్ట్రంగా అభివృద్ధి చెందుతున్నట్లుగా, తిరుపతి ఆంధ్రకు సంస్కృతీ కేంద్రంగా వర్ధిల్లగలదని అభిభాషించారు.

రాష్ట్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి సౌకర్యాల కవసరమైన శ్రీశైలం, నాగార్జున సాగర్ ప్రాజెక్టుల నిర్మాణంలో ఆంధ్రుల అభిప్రాయాలను ఆయన ప్రస్తావించారు. ఒకవైపు నాగార్జున సాగర్ నిర్మాణం సాగుతుండగా, శ్రీశైలం ప్రాజెక్టుపని అసలు ప్రారంభం కాలేదు. ఈ ప్రాజెక్టుల నిర్మాణానికి భారత ప్రభుత్వం సహాయంచేయాలని చెప్పనవసరం లేకుండానే ఆంధ్ర ముఖ్యమంత్రి కేంద్ర సహాయ సమస్యను చేపడితే తను వీలైనంత సహాయం చేయగలనని శ్రీ శాస్త్రి హామీ ఇచ్చారు.



ఈ యాత్రిక కేంద్రానికి ఆయన రావడం ఇదే ప్రథమం. తిరుమలతిరుపతి దేవస్థానాల యాజమాన్యం విధానం తనను ముగ్ధుణ్ని కావించిందని, దేశంలోగల ఇతర దేవాలయాలు కూడా దీనిని ఆదర్శంగా తీసుకుని ఆచరించాలని శ్రీ శాస్త్రి ప్రశంసించారు.

దేవాలయాల సంస్కరణల విషయంలో శ్రీ సి. పి. రామస్వామి అయ్యర్ కమిటీ నివేదిక పరిశీలించేటప్పుడు శ్రీ వెంకటేశ్వరాలయ యాజమాన్యాన్ని ఒక మాదిరిగా భారత ప్రభుత్వం దృష్టిలో వుంచుకొని, అందు కనుగుణంగా చేయగలనని శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఉద్ఘాటించారు. దేశంలోని అన్ని దేవాలయాలలో తిరుపతి దేవాలయ నిర్వహణ పద్ధతిని అమలు జరిపితే మనదేశానికెంతో మేలు చేకూర గలదని, ఉదాహరణకు తమ స్వరాష్ట్రంలో అలహాబాద్ వద్దగల త్రివేణిసంగమానికి వచ్చే యాత్రికులకు ఒక్క కుంభమేళా ఉత్సవం సందర్భంగా తప్ప ఎట్టి సౌకర్యాలు లేవని ఆయన తెలిపారు. తిరుపతి దేవాలయంమీద వచ్చే ఆదాయం భక్తులు, భక్తులుకాని వారి సౌకర్యార్థం వినియోగింపబడుతుంది.

ఆంధ్ర, మద్రాసు, మైసూరు రాష్ట్రాల మధ్యగల స్నేహ సంబంధాలను శ్రీ శాస్త్రి ప్రస్తావించి మైసూరు ముఖ్యమంత్రి ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించడం, మద్రాసు ముఖ్యమంత్రి ఈ ఉత్సవాల్లో పాల్గొనడం వారి స్నేహానికి నిదర్శనమని, అంతరరాష్ట్ర ఐక్యతను పెంపొందించడానికిది ఉపయోగించగలదని, ఈ స్నేహ సంబంధాలే దక్షిణ మండల సంఘంలో కూడా వున్నాయని అన్నారు.

### భూమిశిస్తు సమర్థన

ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశపెట్టిన భూమిశిస్తును ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే ఏమంత ఎక్కువకాదని శ్రీ శాస్త్రి సమర్థిస్తూ ఆంధ్ర రైతులు అదృష్టవంతులని అన్నారు.

ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి, నిధులను సమకూర్చడానికి ఆంధ్రకు అపారావకాశాలున్నాయంటూ తమ స్వరాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ అట్టి స్థితిలో లేదని శ్రీ శాస్త్రి అన్నారు. సాగు భూమికి ఆంధ్రలో శిస్తు ఎకరానికి మూడు రూపాయల నుంచి ఐదు రూపాయలేనని, ఆ శిస్తు ఉత్తరప్రదేశ్‌లో చాలా ఎక్కువని, కొన్ని ప్రాంతాలలో అదే సాగుభూమికి వేసే శిస్తు 20 నుంచి 25 రూపాయల వరకు వుందని ఆయన తెలిపారు.

కనుక భూమిశిస్తును కొద్దిగా పెంచడం అనుచితం కాదని దక్షిణ భారతానికి ధాన్యాగారం కానున్న ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి అది ఎంతో తోడ్పడగలదని అంటూ "ఈ రాష్ట్రం అభివృద్ధికి మేము చేయగలిగినంతా చేయడానికి ప్రయత్నిస్తా"మని శ్రీ శాస్త్రి అన్నారు.

### ప్రగతికి సోపానాలు

కేంద్ర ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ ఉస్మానియా విశ్వవిద్యాలయావరణలో గత సెప్టెంబరు 13 వ తేదీన రాష్ట్ర ప్రాచీన పత్రాల భవనానికి శంకుస్థాపన చేస్తూ ప్రగతి పథ సోపాన పరంపరలలో అగ్రస్థానం వహిస్తున్నదని ఆంధ్రప్రదేశ్‌కు జోహారు లర్పించారు.

భారతదేశంలో ప్రప్రథమంగా బాలికల పాలిటెక్నిక్‌ను నెలకొల్పడం, దేశంలో మంచి నాటకశాలలలో ఒకటైన రవీంద్ర భారతిని నిర్మించడాన్ని ఆయన ప్రస్తావించారు. ఇంతవరకు రాష్ట్ర ప్రభుత్వం అటువంటి కార్యాలను చాలా చేపట్టింది. ప్రస్తుతం అది రాష్ట్ర ప్రాచీన పత్రాలను భద్రపరిచే ఒక పెద్ద భవన నిర్మాణాన్ని చేపట్టింది. భవిష్యత్తులో కూడా ఇటువంటి అభివృద్ధి కార్యక్రమాలను ఆంధ్రప్రదేశ్ చేపట్టగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు.

దేశం మొత్తానికి హైదరాబాద్ భౌగోళిక సాంస్కృతిక కేంద్రమని ఇక్కడ దేశంలోని ముఖ్యమైన భాషలన్నీ మాట్లాడే వారున్నారని ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ అన్నారు. 'యావత్ప్రపంచానికి ప్రతిరూపమైన భారతదేశానికి హైదరాబాద్ ఒక ప్రతిరూపమని, అందువల్ల అది ప్రపంచం మొత్తానికే ప్రతిరూపమని ఆయన అన్నారు.

---

వ్యక్తుల సమవాయమే జాతి కనుక
వ్యక్తులు అభివృద్ధి చెందకపోతే
జాతికి అభివృద్ధి లేదు. దానినే తిప్పి
చెప్పినప్పుడు జాతిలో అంతర్భాగమే
వ్యక్తిగనుక జాతి అభివృద్ధి చెందకపోతే
వ్యక్తికికూడా అభివృద్ధి లేదు.

—మహాత్మాగాంధి.

# వ్యవసాయ రంగంలో ప్రగతి

**ఉత్పత్తి:**

## పశ్చిమ గోదావరి జిల్లాలో విశేషశక్తివంతమైన జిల్లా వ్యవసాయ కార్యక్రమం

పశ్చిమ గోదావరిజిల్లాలో విశేషశక్తివంతమైన వ్యవసాయ కార్యక్రమాన్ని ఫోర్డ్ సంస్థ, భారతప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక సహాయంతో 1960 అక్టోబరు 1వ తేదీనుంచీ చేపట్టారు. సారవంతమైన భూమి, తగిన నీటిపారుదల సౌకర్యాలుండి, ప్రకృతి వైపరీత్యాలు లేని ప్రాంతాలలో తగిన సమయాలలో పంటల అధికోత్పత్తికి సంబంధించిన ముఖ్య విషయాలను భారీ ఎత్తున ప్రదర్శించడం ఈ పథకం ఉద్దేశం. గత మూడు కార్తెలలో ఈ పథకంవల్ల ప్రోత్సాహకరమైన ఫలితాలు వచ్చాయి. ఈ కార్యక్రమం ఇప్పుడు నాలుగవ కార్తెలో వుంది. 1960–61 రాబీ పంట సమయంలో ఎకరానికి 5181 పౌన్ల ధాన్యం, 158 పౌన్ల ఎండుమిర్చి, పదివేల పౌన్ల అరటి పంట అధికంగా సాధింపబడినట్లు రికార్డులు సూచిస్తున్నాయి.

1961–62 ఖరీఫ్ సమయంలో జిల్లావిశేషశక్తివంతమైన వ్యవసాయ కార్యక్రమం అమలులోగల ప్రాంతంలో 7321 పౌన్ల ధాన్యం అదనంగా ఉత్పత్తి చేయబడింది. అంటే ఈ పథకం అమలులో లేని ప్రాంతంలోకన్నా ఈ పథకం అమలు జరిపినచోట 36 శాతం ఉత్పత్తి పెరిగింది. చెరుకుపంట విషయంలో ఈ పథకం అమలులోవున్న ప్రాంతంలో 10.67 మి. టన్నుల అధికోత్పత్తి సాధించబడింది. అంటే ఈ మొత్తం ఈ పథకం అమలులోలేని ప్రాంతంలోకన్నా పథకం అమలులో వున్నచోట 37 శాతం ఉత్పత్తి పెరిగింది.

## గ్లిరిసిడియా వారోత్సవం

ధాన్యం ఉత్పత్తిని పెంపొందించడానికి గ్లిరిసిడియాను ప్రచారంచేసే దృక్పథంతో ఆగస్టు నెలలో మొక్కలు నాటే వారోత్సవం సందర్భంగా గ్లిరిసిడియా వారోత్సవాన్ని కూడా రాష్ట్రంలో ప్రారంభించారు. ప్రస్తుత సంవత్సరం 100 లక్షల గ్లిరిసిడియా నాటాలని లక్ష్యం పెట్టుకొని 1962 ఆగస్టు చివరినాటికి 15 లక్షలను నాటారు.

## మొక్కల రక్షణ

మొక్కలను తెగుళ్ళు మొదలైన వాటినుంచి రక్షించడానికి రాష్ట్రంలో భారీ ఎత్తున విమానంనుంచి మందుచల్లే కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ కార్యక్రమానికి చేయూతనివ్వడానికై ప్రస్తుత సంవత్సరంలో ఖరీఫ్ పంట సమయంలో విమానంనుంచి మందు చల్లేకార్యక్రమానికయ్యే ఖర్చులో 50 శాతం సబ్సిడీని ప్రభుత్వం మంజూరుచేసి అందుకై 60 వేల రూపాయలను కేటాయించారు.

ఈ సదుపాయాన్ని చూసుకొని కృష్ణా, గుంటూరు జిల్లాలలోని రైతులు వరి పొలాలపై తొలుచుపురుగు తెగులును నివారించడానికి విమానంనుంచి మందు చల్లించే కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ కార్యక్రమం 40 వేల ఎకరాలకు లాభిస్తుంది.

## విస్తృత బలవర్ధకాహార కార్యక్రమం

భారత ప్రభుత్వం, ఆహార వ్యవసాయ సంస్థ (F. A. O.) ప్రపంచ ఆరోగ్యసంస్థ (W. H. O.) యునిసెఫ్‌ల సంయుక్త సహకారంతో ఏర్పడిన విస్తృత బలవర్ధకాహార కార్యక్రమం యొక్క ఆశయం కాయగూరలు, పండ్లు, చేపలు, గ్రుడ్లు మొదలైన బలవర్ధక వస్తువుల ఉత్పత్తిని అధికం చేయడం. ఈ కార్యక్రమం క్రింద బలవర్ధక పదార్థాల ఉత్పత్తిని పెంపొందించే

నిమిత్తం పాఠశాలలలో తోటలను నెలకొల్పాలని తోటల పెంప కంలో ఉపాధ్యాయులకు శిక్షణయివ్వాలని తలపెట్టారు. నిర్ణయించిన పెక్కు బ్లాకులలో 47 పాఠశాల తోటలను నెలకొల్పారు. 1962 ఆగస్టులో 11204 పౌన్ల కాయగూరలను ఉత్పత్తి చేశారు.

## ఖరీఫ్ రాబీ ఉద్యమాలు

ఇంతకుముందు పంటల సమయాలలో వచ్చిన ప్రోత్సాహ కరమైన ఫలితాల మూలంగా నిర్ణీత వ్యవసాయ కార్యక్రమాల సిఫార్సులకు సంబంధించిన ప్యాకేజి కార్యక్రమాన్ని 1962 ఖరీఫ్ పంటనుంచి ఒక్కొక్క గ్రామసేవకుని క్రింద గల విభాగం లోని ఒక్కొక్క గ్రామంలో ప్రవేశపెట్టారు. ఆ విధంగా ప్రతి బ్లాకులో 10 గ్రామాలుంటాయి.

## విశేష శక్తిగల ఎరువుల పథకం

అన్ని జిల్లాలలో నిర్వహించబడుతున్న విశేషశక్తిగల ఎరువుల పథకానికి 50 లక్షల రూపాయలను కేటాయించారు. ఈ పథకం క్రింద వరి, రాగి, జొన్న, ప్రత్తి మొదలైన పంటలకు ఎకరానికి 35 రూపాయలను, పండ్లు, కాయగూరలు, పొగాకు, ఎండుమిర్చి, పసుపు పంటలకు ఎకరానికి 70 రూపాయలను, చెరుకు పంటకు ఎకరానికి నూరు రూపాయలను ఋణాలుగా మంజూరు చేశారు.

## ప్రత్తి

రాష్ట్రంలో ప్రత్తి పంట ఉత్పత్తిని, నాణ్యాన్ని పెంచడానికి చర్యలు తీసుకొనబడుతున్నాయి.

(అ) ప్రత్తి ప్యాకేజి పథకం:

క్షేత్రాలలో సమీకృత ప్యాకేజి పథకం ప్రవేశపెట్టబడి అది నెమ్మదిగా వ్యాప్తి చెందుతున్నది. దానివల్ల కృష్ణా జిల్లాలో దాదాపు 10 వేల ఎకరాలు, గుంటూరు జిల్లాలో 5 వేల ఎకరాల వరిసాగు భూమిలో 216 ప్రత్తిని పండించే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది. ఇందుకవసరమైన నీటి పారుదల సౌకర్యాలను కలగ చేయడానికి పబ్లిక్ వర్క్సు శాఖ అంగీకరించింది.

(ఆ) సీ ఐలెండ్ ( Sea Island ) ప్రత్తి : ప్రస్తుతం మన దేశానికి ఏటా ఆరు లక్షల బేళ్ళ పొడుగుపింజ ప్రత్తి దిగుమతి అవుతున్నది. దీనికి 50 కోట్ల రూపాయల విదేశీ మారక ద్రవ్యం వ్యయమవుతూంది. సీ ఐలెండ్ ప్రత్తిని పండించే అవకాశాలను పరిశీలించడానికి రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో పెక్కు ప్రయోగాలు జరుగుతున్నాయి. ఇంతవరకు ఈ పంట పరిస్థితి బాగానే వున్నది.

(ఇ) "నందికం" కొత్తరకం ప్రత్తి: రాయలసీమ భూములకు అనువైన ప్రత్తిపంట విషయంలో నంద్యాలలోని వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో గత 50 ఏళ్ళనుంచీ పరిశోధనలు జరుగుతున్నాయి. 40వ నెంబరు నూలును నంద్యాల 14 రకాన్నుంచి వ్యవసాయ శాఖ విడుదల చేసింది. కాని ఆ ప్రత్తినుంచి 24 శాతం ఏకులను మాత్రమే తీయడం జరుగుతున్నది. అందువల్ల ఆ రకం ప్రత్తి రైతుల దృష్టిని ఆకర్షించలేదు.

ఇటీవలి పరిశోధనలు నంద్యాల 14 రకం స్థానంలో కొత్త రకం ప్రత్తిని ప్రవేశపెట్టాయి. నందికం అనబడే ఈ కొత్తరకం ప్రత్తిలో నంద్యాల 14 రకంలో ఉన్న నాణ్యం, గట్టిదనం ఉన్నాయి. దాని పొడుగు 15/16 అంగుళం. ఏకుల శాతం 32. ఈ నందికం రకం ప్రత్తిని ప్రస్తుతం వ్యవసాయదారులకు విడుదల చేశారు.

## భూసార సంరక్షణ

ప్రస్తుత సంవత్సరంలో 0.45 లక్షల ఎకరాల భూసారాన్ని సంరక్షించ తలపెట్టారు. ఇంతవరకు 0.15 లక్షల ఎకరాల భూసార రక్షణకు చర్యలు తీసుకున్నారు.

భూసార రక్షణ కార్యక్రమాల కవసరమైన శిక్షణ పొందిన ఉద్యోగుల కొరతను తీర్చడానికి వ్యవసాయ శాఖకు చెందిన ముగ్గురు అసిస్టెంట్లను బళ్ళారి, ఊటీ కేంద్రాలలో శిక్షణకు పంపారు.

## ప్రదర్శనలు

తిరుపతిలో జరిగిన అఖిల భారత యువజనోత్సవాల సందర్భంగా ఈ శాఖ 23-9-62 నుంచి తిరుపతిలో ఒక ప్రదర్శనను ఏర్పాటు చేసింది. ఆ తరువాత తిరుమల బ్రహ్మోత్సవంలో కూడా ప్రదర్శన ఏర్పాటు చేయబడింది.

# పబ్లిక్ వర్క్సుశాఖ కార్యకలాపాలు

## విద్యుచ్ఛక్తి

1962 ఆగష్టులో రాష్ట్రంలో కొత్తగా మూడు గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు. నిధుల కొరత దృష్ట్యా కొత్త పథకాలను మంజూరు చేయలేదు.

నిర్ణీత కార్యక్రమాలకు ఖర్చు చేయడానికి ఈ సంవత్సరం అదనంగా సుమారు రూ. 5 కోట్లు అవసరమవుతాయి. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు నుంచి రూ. 2 కోట్ల మేరకు స్వల్పకాలిక ఋణం పొందడానికి బోర్డు నిశ్చయించింది.

## రైల్వేలు

1962 అక్టోబరు మొదటి తేదీ నుంచి సికింద్రాబాదు— బొంబాయిల మధ్య నేరుగా ఎక్స్‌ప్రెస్ రైలు సర్వీసును ప్రవేశపెట్టారు.

## ప్రధానమైన వంతెన పనులు

### 1. రంగాపూర్ వద్ద కృష్ణానది పై రోడ్డు వంతెన

మహబూబ్‌నగరం జిల్లాలో రంగాపూర్ వద్ద ఏడవ జాతీయ రహదారి (బెనారస్ కేప్ కామరిన్ రోడ్డు) పై కృష్ణానదికి అడ్డంగా రూ.36.29 లక్షల వ్యయంతో ఒక రోడ్డు వంతెనను నిర్మిస్తున్నారు. 1959 ఏప్రిల్ లో ఈ పనిని ప్రారంభించారు. 1963 మే నాటికి ఇది పూర్తికావచ్చు. ఏడవ జాతీయ రహదారిపై జరుగుతున్న ఈ పనికి భారత ప్రభుత్వం డబ్బు ఖర్చు చేస్తున్నది. లోగడ బెంగుళూరు నుంచి హైద్రాబాదుకు వచ్చేవారు హోస్పేట, మునీరాబాదు, రాయచూరు, జడ్చర్లమార్గంగా 500 మైళ్ళు ప్రయాణం చేయవలసి వచ్చేది. తరువాత కర్నూలు వద్ద తుంగభద్రపై వంతెన నిర్మించడంవల్ల ఈ దూరం 376 మైళ్ళకు తగ్గింది. రంగాపూర్ వద్ద కృష్ణానదిపై వంతెన కట్టడం వల్ల హైద్రాబాదు— బెంగుళూరుల మధ్య దూరం 310 మైళ్లకు తగ్గుతుంది. కాగా అన్ని ఋతువుల్లోనూ ప్రయాణించడానికి అనుకూలంగా వుండే రోడ్డు మార్గంగా హైద్రాబాదు నుంచి కర్నూలు వెళ్లడానికి 128 మైళ్లు మాత్రమే ప్రయాణం చేయవలసి వుంటుంది.

### 2. భద్రాచలం వద్ద గోదావరి పై వంతెన

భద్రాచలంవద్ద గోదావరినదిపై రూ. 66.00లక్షల వ్యయంతో రోడ్డు వంతెనను నిర్మిస్తున్నారు. 1959 డిశంబరులో పని ప్రారంభించారు. 1964 జూన్ 30 వ తేది నాటికి బహుశా ఇది పూర్తి కావచ్చు. ఈ వంతెన తూర్పు గోదావరి, ఖమ్మం జిల్లా ప్రజల చిరకాల వాంఛితం. భద్రాచలంలోని పురాతనమైన శ్రీరామాలయానికి ప్రతి సంవత్సరం లక్షల మంది యాత్రికులు వెళ్తారు. అయితే భద్రాచలానికి నేరుగా రోడ్డు మార్గం లేక పోవడం వల్ల యాత్రికులు అక్కడికి పడవల్లోగానీ, కాలినడకనగానీ వెళ్ళవలసి రావడం వల్ల, ఇబ్బందులకు గురి అవుతున్నారు. 1957 వ సంవత్సరంలో భద్రాచలం సమీపంలో గొప్ప పడవ ప్రమాదం సంభవించింది. అనేక మంది ప్రాణాలు కోల్పోయారు. పై వంతెన నిర్మాణం వల్లా, తూర్పు గోదావరి జిల్లా ఏజెన్సీ ప్రాంతంలో రామచోడవరం నుంచి భద్రాచలం వరకు రోడ్డు వేయడం వల్లా ఆంధ్రప్రదేశ్ రాజధాని అయిన హైద్రాబాదు ప్రధాన రేవుపట్టణమైన విశాఖపట్నంల మధ్య నేరుగా రాకపోకలకు సౌకర్యం ఏర్పడుతుంది. హైద్రాబాదు నుంచి విశాఖపట్నం వరకు వుండే ఈ రాష్ట్ర రహదారి, అటవీసంపద ఖనిజ సంపదలతో అలరారే ఎగువ ప్రాంతాలతో సంబంధం ఏర్పర్చడం ద్వారానూ, హైద్రాబాదు విశాఖపట్నంల మధ్య ప్రయాణ దూరాన్ని తగ్గించడం ద్వారానూ మన రాష్ట్రంలోని ముఖ్యమైన రహదార్లలో ఒకటిగా రూపొందుతుంది.

### 3. తూర్పు గోదావరి జిల్లా ఆలమూరు వద్ద గౌతమిపై వంతెన

తూర్పు గోదావరి జిల్లా ఆలమూరు సమీపంలో గోదావరీనదిపాయ అయిన గౌతమిపై వంతెన నిర్మాణం జరుగుతున్నది. దీనికి రూ. 167 లక్షలు ఖర్చవుతుంది. 1956 మార్చిలో పని

ప్రారంభించారు. 1963 జూన్ నాటికి ఇది పూర్తి కావచ్చు. అయిదవ నెంబరు పాత జాతీయ రహదారి అయిన మద్రాసు–కలకత్తా రోడ్డు తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల గుండా వెళ్తుంది. రాజమండ్రి వద్ద గోదావరినది దీనికి అడ్డంగా ప్రవహిస్తుంది. కాని గోదావరినదిపై ఇప్పటికి కూడా రోడ్డు వంతెన లేదు

రాజమండ్రి వద్ద వంతెన నిర్మిస్తే నేరుగా రాక పోకలకు సౌకర్యం కలిగివుండెడిదే. కాని జాతీయ రహదారిని, అధిక జన సంఖ్యగల సారవంతమైన గోదావరి కేంద్ర డెల్టా ప్రాంతాల గుండా మళ్లించడానికీ, గోదావరినది రెండుపాయలైన గౌతమి, వాసిష్ఠలపై వరుసగా ఆలమూరు, సిద్ధాంతం వద్ద రెండు వంతెనలు నిర్మించడానికి ప్రతిపాదించారు. "ధాన్యాగారంగా" ప్రసిద్ధిగాంచిన కేంద్ర డెల్టాకు బాహ్య ప్రపంచంతో సంబంధం కలిగించడానికి ఈ విధంగా ప్రతిపాదించారు. పశ్చిమ గోదావరి జిల్లాలో జాతీయ రహదారి మళ్లింపు, గుండుగొలను వద్ద ఆరంభమవుతుంది. ఇది పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం, తణుకు, పెరవలి, సిద్ధాంతం, తూర్పుగోదావరి జిల్లా ఆలమూరు, మడికి, వేమగిరి, బొమ్మూరు, లాలచెరువుల గుండా వెళ్తుంది. ఈ మళ్లింపురోడ్డు ప్రస్తుత జాతీయ రహదారిని, రాజమండ్రి పట్టణానికి కొన్ని మైళ్ల పైన కలుస్తుంది. ఆలమూరు వద్ద గౌతమీ వంతెన పునాది, తత్సంబంధమైన (సబ్ స్ట్రక్చర్) పనులు పూర్తయ్యాయి. తరువాత జరగవలసిన ఇతర (సూపర్ స్ట్రక్చర్) పనులను చేపట్టారు 1963 జూన్ నాటికి ఇది పూర్తికావచ్చు. ఈ వంతెన జాతీయ రహదారిపై వున్నందువల్ల దీని వ్యయాన్ని కూడా భారత ప్రభుత్వమే భరిస్తున్నది.

4. సిద్ధాంతం వద్ద వాసిష్ఠపై వంతెన

ఈ వంతెన పని ఇప్పుడిప్పుడే ప్రారంభమైనది. 1964 అక్టోబరు నాటికి ఇది పూర్తి కావచ్చు. దీని నిర్మాణానికి రూ. 94.19 లక్షలు ఖర్చవుతుంది. ఈ వ్యయాన్ని కూడా భారత ప్రభుత్వమే భరిస్తుంది.

5. కాకినాడలో ఉప్పుటేరుపై వంతెన

కాకినాడ పట్టణం మధ్యలో ఉప్పుటేరుపై కట్టిపూడి–నరసాపురం ఫెర్రీరోడ్డు 21/7 వ మైలు వద్ద రూ. 13.20 లక్షల వ్యయంతో పబ్లిక్ వర్క్సు శాఖవారు ఒకవంతెనను నిర్మిస్తున్నారు.

ఈ వంతెన పాత, క్రొత్త కాకినాడ పట్టణాలను కలుపుతుంది. అంతేగాక ఇది మద్రాసు–కలకత్తా రోడ్డుపై వున్న కట్టిపూడి, తూర్పు కోస్తాలోని చిన్న రేవుపట్టణమైన నర్సాపురంల మధ్య నేరుగా రాకపోకలకు సౌకర్యం కలిగిస్తుంది 1958 లో పని ప్రారంభించారు. 63 మార్చి నాటికి బహుశా పూర్తవుతుంది. సి. ఆర్. ఎఫ్. పనుల క్రింద భారత ప్రభుత్వం దీనిని మంజూరు చేసింది. శకటాలు, కాలినడకన వెళ్లేవారు వెళ్లడానికి వీలుగా ఈ వంతెనకు 42–0 అడుగుల వెడల్పుతో నాలుగు లేన్లుంటాయి. ఇరువైపులా 8–0 అడుగుల కాల బాటలు కూడా వుంటాయి.

6. విశాఖపట్నం జిల్లాలో విజయనగరం–పాలకొండ రోడ్డుపై నెల్లిమర్లవద్ద చంపావతి నదిపై వంతెన నిర్మాణం

విజయనగరం–పాలకొండ రోడ్డుపై నెల్లిమర్లవద్ద చంపావతి నదికి అడ్డంగా రూ. 6.78 లక్షల వ్యయంతో ఒక వంతెన నిర్మించారు. దీనివల్ల నిర్విఘ్నంగా రాకపోకలు సాగుతాయి. 1962 మే 28 వ తేదీనుంచి దీనిపై రాకపోకలు ఆరంభమయ్యాయి.

## భారీ రోడ్డు పనులు

1. హైదరాబాదు-కర్నూలు రోడ్డు

ఆంధ్రప్రదేశ్‌లో ఏడవ జాతీయ రహదారి (బెనారస్–కేప్ కామరిన్ రోడ్డు) నిడివి 464 మైళ్లు. ఇది ఆదిలాబాదు, హైదరాబాదు, కర్నూలు, గుత్తి అనంతపురంల గుండా మైసూరు రాష్ట్ర సరిహద్దుల వరకు వెళ్తుంది.

ఈ రోడ్డుకు అడ్డంగా రంగాపూర్ వద్ద కృష్ణ, కర్నూలు వద్ద తుంగభద్ర, హంద్రి, పమిడివద్ద పెన్నార్ నదులు ప్రవహిస్తాయి. ఆంధ్రప్రదేశ్ అవతరణనాటికి ఈ నదులలో దేనిపై కూడా ఈ రోడ్డుకు వంతెనలు లేవు. తుంగభద్రా నదిపై రూ. 27.50 లక్షలవ్యయంతో ఒకవంతెన నిర్మించారు. 1960 జూలైలో దీనిపై రాకపోకలు ప్రారంభమయ్యాయి. తుంగభద్రకు కొంచెం పైన హంద్రీ నదిపై రూ. 4.95 లక్షలతో వంతెన నిర్మిస్తున్నారు. ముఖ్యమైన ఈ రోడ్డుపై అనేకచోట్ల వంతెనలు లేకుండా క్రాసింగులు వున్నాయి. సుమారు రూ. 15.0 లక్షల వ్యయంతో వీటికి పక్కా వంతెనలు నిర్మిస్తున్నారు. కృష్ణా, తుంగభద్రా నదులపై వంతెనల స్థావరాలు అనుకూలంగా వుండడానికి వీలుగా హైదరాబాదు-కర్నూలు రోడ్డు 95/4వ మైలు వద్దనుంచి కర్నూలు గుత్తిరోడ్డు 2/1 వ మైలువరకు సుమారు 28 మైళ్ల పొడవున ఒక డైవర్షన్ రోడ్డును దాదాపు 45.0 లక్షల వ్యయంతో నిర్మిస్తున్నారు. దీనివల్ల రోడ్డు మార్గంగా కర్నూలు, హైదరాబాదు నగరాల మధ్యదూరం 250 మైళ్లకు తగ్గుతుంది.

## 2. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో ఏజెన్సీ రోడ్డు పనులు

గిరిజన ప్రాంతాల అభివృద్ధికై రాజ్యాంగపు 275 (1) వ సూత్రం క్రింద భారత ప్రభుత్వం చేసే సహాయంతో తూర్పు గోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం, జిల్లాలలోని ఏజెన్సీ ప్రాంతాలలో అనేక రోడ్డు పనులను చేపట్టారు. ఇప్పటి వరకు సుమారు 300 మైళ్ల నిడివిగల రోడ్డువేశారు ఏజెన్సీ పనులకు ఇప్పటి వరకు దాదాపు కోటి రూపాయలు వెచ్చించారు. అంతర్రాష్ట్రీయ రోడ్లు, ఆర్థిక ప్రాముఖ్యతగల రోడ్లపనులకు భారతప్రభుత్వంఇచ్చే సహాయంతో ఏజెన్సీప్రాంతాలలో మరోరెండు రోడ్డు నిర్మాణాలను చేపట్టారు. వీటిలో ఒకటి మారేడుమిల్లి నుంచి చింతూరు వరకు 33½ మైళ్లపొడవున రూ. 41 లక్షల వ్యయంతో నిర్మించబడుతున్నది. రెండవది తూర్పుగోదావరి జిల్లా కూనవరంనుంచి చింతూరువరకు రూ. 10 లక్షల ఖర్చుతో నిర్మించబడుతున్నది. మారేడుమిల్లి నుంచి చింతూరు వరకూ, చింతూరునుంచి నెల్లిపాక వరకు రోడ్ల నిర్మాణం పూర్తయినట్లయితే రాజమండ్రినుంచి భద్రాచలం వరకు అక్కడినుంచి హైద్రాబాదుకు నేరుగా రాకపోకలకు సౌకర్యం ఏర్పడుతుంది.

ఏజెన్సీ ప్రాంతాలలో ఇప్పుడు జరుగుతున్న రోడ్డు పనులన్నీ పరిసమాప్తి కావడంతో ఎగువ ప్రదేశాలు మొదలు జన వాసంలేని ప్రాంతాల వరకు వివిధ ప్రాంతాలు పరిగణించ దగినంతగా అభివృద్ధి జెందుతాయి. రాష్ట్ర ప్రజలకు ప్రత్యేకించి కొండ జాతుల వారికి ప్రయోజనం కలిగే విధంగా అటవీ సంపదను, ఖనిజ సంపదను వినియోగించడానికి వీలు కలుగుతుంది.

కృష్ణా (రహదార్లు) డివిజనులో భావదేవరపల్లి నుంచి సంగమేశ్వరం వరకు రోడ్డువేసి దానిపై కంకరవేసే పని కొనసాగుతున్నది. మూడవ పంచవర్ష ప్రణాళికలో ప్రారంభించిన కోస్తా మత్స్య పరిశ్రమ గ్రామాలకు రోడ్డువేసే పథకం క్రింద దీనిని చేపట్టారు.

| | |
|---|---|
| ప్రతిపాదిత నిడివి | 7 మైళ్లు |
| రోడ్డు నిర్మాణానికీ, కంకర వేయడానికీ అంచనా వ్యయం | ...రూ. 2,20,000 |
| సవరించిన అంచనా | ...రూ. 2,42,000 |
| 1962 మార్చి చివరి వరకు జరిగిన ఖర్చు | ...రూ. 70,264 |
| 1962 సెప్టెంబరు ముగింపు వరకు జరిగిన ఖర్చు | ...రూ. 1,36,050 |

1962_63వ సంవత్సరంలో ఈ పని బహుశా అన్నివిధాలా పూర్తవుతుంది.

## భారీ, మధ్యరకం సేద్యపు నీటిపారుదల పథకాలు

తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో సేద్యపు నీటి పారుదల కార్యక్రమాల క్రింద మొదటి ప్రణాళిక, రెండవ ప్రణాళిక తాలూకు అసంపూర్ణ పథకాలను పూర్తిచేయడంతో పాటు సాధ్యమైనన్ని కొత్త పథకాలను కూడా ప్రారంభించడం జరుగుతుంది. భారీ, మధ్యరకం పథకాలకు తృతీయ ప్రణాళికలో రూ. 3123 లక్షలు ప్రత్యేకించారు

ఈ మొత్తాన్ని వెనుకటి ప్రణాళికల తాలూకు 24 పథకాలకు, 7 కొత్త పథకాలకు, 18 అదనపు నూతన సేద్యపు నీటి పారుదల పథకాలకు వినియోగిస్తారు. ఈ పథకాల అమలువల్ల మూడవ ప్రణాళికా కాలంలో 5.21 లక్షల ఎకరాలకు నీటి పారుదల జరుగగలుగుతుంది. వరద నిరోధక కార్యక్రమం కూడా సేద్యపు నీటి పారుదల ప్రణాళికలో భాగమే. గోదావరి వరద కట్టలు, వెనుకటి ప్రణాళికల తాలూకు చిన్నపథకాలు, పది కొత్త పథకాల అమలును ఈ కార్యక్రమం లక్షిస్తున్నది. హిమాయత్‌సాగర్‌వద్దవున్న ఇంజనీరింగ్ పరిశోధన సంస్థను రూ. 40.00 లక్షల వ్యయంతో విస్తృత పరిచే పథకం కూడా సేద్యపు నీటి పారుదల కార్యక్రమంలో చేర్చబడినది. ఈ పథకాలకు 1961_62వ సంవత్సరంలో రూ. [illegible]10 లక్షలు ఖర్చుచేశారు. 1962_63వ సంవత్సరానికి రూ. 335.60 లక్షలు కేటాయించారు. టి. బి. పి. ఎగువ కాలువ, పోచంపాడుల వంటి భారీ పథకాలకు కేటాయించిన మొత్తాలు సరిపోవు కాబట్టి ఈ రెండు ప్రాజెక్టులకూ ఒక్కొక్కదానికి అదనంగా రూ. 40 లక్షల చొప్పున ప్రభుత్వం మంజూరు చేసింది.

## చిన్న రకం సేద్యపు నీటి పారుదల పథకాలు

చిన్న రకం సేద్యపు నీటిపారుదల కార్యక్రమానికి అధిక ప్రాధాన్యత ఇచ్చారు. ప. వ. శాఖ క్రింద చిన్న తరహా పథకాలకు రూ. 1250 లక్షలు కేటాయించారు. నూతన చిన్న రకం సేద్యపు నీటిపారుదల పథకాలు, చెరువులు, ఆనకట్టలు, కాలువలు, మురుగు పారుదల కాలువలు, కట్టల వంటి వివిధ రకాల పనులు ఈ కార్యక్రమం క్రింద జరుగుతాయి. వ్యవసాయోత్పత్తిని తీవ్రతరం చేసే ఉద్దేశంతో చిన్నరకం సేద్యపు నీటి పారుదల పథకాలు మొదలైనవాటి నిమిత్తం రాష్ట్రాలకు తాము అదనంగా సొమ్ము కేటాయించ ప్రతిపాదించినట్లు ఆహార, వ్యవసాయ మంత్రిత్వశాఖ రాష్ట్ర ప్రభుత్వాలకు తెలియజేసింది. అఖిల భారత

(మిగతా 66వ పేజీలో)

# నవ భారతం

మండలపర్తి ఉపేంద్రశర్మ

నవ భారత నిర్మిత సరళి
ప్రదేశ ప్రభుతల కార్యకలాపం
కేంద్ర, కార్యకర్తలాకుశలత
సాముదాయిక సంఘటితమ్మూ
ప్రథమ ద్వితీయ ప్రణాళికల పూర్ణత్వం
జాతీయ వికాస సమగ్ర విజయం ॥నవ॥

ఒకపరి చూచిన నొందెదరానందం
నెహ్రూ పండితు నెరసంకల్పం
నందామాత్యుని నాయకత్వమూ
తోడి మంత్రుల త్యాగ దీక్షతా ॥నవ॥

సుఖ, వికాసాల, చేకూర్పగనూ
సునిశితబుద్ధుల సంఘముకూడే
ఆర్ష యువజనుల అఖిలషితము
మానవమేధా నిర్మిత మహాసౌధము ॥నవ॥

సామ్రాజ్యపు నిధుల, న్వినియోగించీ
చదువులు, శ్రమలూ సఫలంబౌటకు
పాడీ పంటలు పెరిగేటందుకు
బీదా సాదా బ్రదికేటందుకు
ప్రజాస్వామ్యమూ పర్వేటందుకు
ప్రణాళికోద్యమాల్ కావాలి ॥నవ॥

కళ్లకందముగ కళకళలాడె
గృహసమూహాల్ కోరాలి
కుటుంబ నియంత్రణల కాంక్షించీ
ఎక్కువ బలయుతులౌ, ఉక్కు బిడ్డలా
కనగల ధార్మిక దృక్కులు దృఢగాత్రులనూ
దేశపు సంపద, మన ఖండము గర్వము ॥నవ॥

అమృత హృదయులు, ఆదర్శ జీవులు
సుస్వభావులు, సుందర మూర్తులు
ఔజ్జ్వల్యముల నుర్వినింపెడి
ఐకమత్యమును ఆశలకంపెడి
కళాకారులూ, మధురభావులూ
తీరుతీయముల మహితాశయములు
సురుచిరకాంతుల, అమర రచనముల
చుబ్బన చూరల పంచి యిచ్చెడి
ప్రజ్ఞాధురంధరుల నరయగావలె ॥నవ॥

శ్యామల కేదారాల్ సృజింపగ
శుచిశుభ్రతల చేకూర్పగ
సామరస్య, సహిష్ణుతల చెలగచేయగ
శ్రద్ధా భక్తుల వృద్ధి పరపగ
వారల సరిరారెవ్వరు
సుకర్మ పరంపర పెంచగలరు గాదా ॥నవ॥

చెడ్డలనన్నిటి సాగనంపెదరు
అంటిన మైలల నణగచేసెదరు
అం టుదోసముల వేటాడెదరు
ఇంటిని, వంటిని, మింటికెత్తెదరు ॥నవ॥

సౌఖ్యము, స్వేచ్ఛా, చేకూర్చి
సుభిక్షపాలనము సమకట్టి
కీర్తికౌముదిని ప్రసరించి
ప్రణాళికలిప్పుడు పూర్తిగ నిండెనెగడుగా ॥నవ॥

అరుగో అరుగో నవభారతనేతలు
ప్రణాళికా పరిణామముగా
రూపొందిన సేవావ్రతులు
ఉత్సాహయుక్తులు ప్రోత్సాహపరులు
పల్లెసీమల ప్రజల విద్యకు
పాటుపడిన, ప్రతిభాశాలురు

సేద్యము, సహకారం
స్వయం సహాయం
ప్రగతికి, శ్రేయస్సునకూ
ప్రణాళికా పద్ధతే పాటించాలి

అభ్యుదయమే కావాలన్నా
అన్యోన్యతయే అమరాలన్నా
శ్రమజీవనమే, చెలగాలన్నా
పశుపోషణమే పెరగాలన్నా

సహజీవనమే అలుముకొనుటకూ
జాతీయతయే జీవించుటకూ
నిరుద్యోగాల్ నిర్మూలించగ
నీటివనరుల్ నిర్మించగనూ
ఆర్థిక సమతల వెలయించగనూ
పాతపుంతలవి అస్తమించగా
కొత్తవ్యవస్థ కొమరు మిగలగా
అపూర్వ పద్ధతులమలుకు రాగా
శ్రీలపొంగే పాలుకారే భరతభూమిని
పునర్మితమ్మీ ప్రణాళికాబాహుళ్యం
ప్రసాదించుగాక ॥నవ॥

~~~~~~~~~~

---

(64వ పేజీ తరువాయి)

తృతీయ ప్రణాళికా లక్ష్యాలలో 20 శాతం పెరుగుదలను సాధించ డానికి తలపెట్టబడినది. ఇందుకొరకు చేసే కేటాయింపులు కేంద్ర ఆర్థిక సహాయపు పరిమితిని మించి జరుగుతాయి. మొత్తం ప్రణాళికా కేటాయింపులు, అదనపు కార్యక్రమాలు, రాష్ట్ర ప్రణా ళికలలోని చిన్న తరహా సేద్యపు నీటి పారుదల కర్యక్రమాలలో భాగంగా వుంటాయి. పై కేంద్ర సహాయంతో కలుపుకొని ప. వ. శా. చిన్నతరహా సేద్యపు నీటి పారుదల సమీకృత కార్యక్రమం రూ. 2060 లక్షల వ్యయంతో కూడుకొని వుంటుంది.

1961–62వ సంవత్సరంలో రూ. 156 లక్షలు ఖర్చు చేశారు. 1962–63వ సంవత్సరానికి రూ. 190.26 లక్షలు కేటా యించారు. ఇదికాక వర్తమాన సంవత్సరానికి అదనంగా రూ. 67.5 లక్షలు కేటాయించవానికి కేంద్రం సిఫార్సు చేసింది. దానితో కలుపుకొని మొత్తం కేటాయింపు రూ. 257.26 లక్షలకు పెరుగుతుంది.


~~~~~~~~~~

# ??? ??
# ప్రశ్నలు - సమాధానాలు
# !!!!!

శ్రీ పి. వి. నారాయణ,

చిన్నబాదాం, శ్రీకాకుళం జిల్లా.

ప్రశ్న: సింగిల్ ట్రాన్స్ఫరబిల్ ఓటును గురించి దయచేసి వివరిస్తారా ?

సమాధానం: ప్రాతినిధ్య సంస్థకు జరిగే ఎన్నికల విధానాలలో సింగిల్ ట్రాన్స్ఫరబిల్ ఓటుద్వారా దామాషా ప్రాతినిధ్య, కల్పించడం ఒకటి. రాజ్య సభకూ, శాసన మండలులంకూ రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి పదవులకు జరిగే ఎన్నికలకు ఈ పద్ధతిని అవలంబిస్తున్నారు. దీనిననుసరించి ఓటర్లకు, ఎంత మంది అభ్యర్థులు పోటీ చేస్తున్నారో అన్ని ఓట్లుకానీ లేదా ఎన్ని ఖాళీలను భర్తీ చేయాలో అన్ని ఓట్లుకానీ లేకుండా ఒకే ఒక ఓటు మాత్రమే వుంటుంది. అయితే వారు తమ ప్రాధాన్య క్రమాన్ని అంటే తాము ఏ అభ్యర్థికి మొదటి ప్రాధాన్యత ఇచ్చేదీ, ఆ తరువాత ఎవరికి ప్రాధాన్యత ఇచ్చేదీ పేర్కొనవచ్చు. వివిధ తరగతులు, వర్గాలవారికి కనీసం వారి సంఖ్యా బలం దామాషాలోనైనా శాసన నిర్మాణ సంస్థల్లో స్థానం కల్పించడమే దామాషా ప్రాతినిధ్య విధానం లక్ష్యం. ఈ విధానవు స్వాభావికమైన ప్రయోజన మేమిటంటే దీనివల్ల అన్ని పార్టీలకూ దామాషా ప్రకారం ప్రాతినిధ్యం లభిస్తుంది. బాగా పేరు ప్రతిష్ఠలున్న అభ్యర్థి మొట్టమొదట ఎన్నిక అవుతాడు. మెజారిటీ పార్టీ అభ్యర్థులకు అనుచితమైన ప్రయోజనం కలుగకుండా కూడా ఇది నిరోధిస్తుంది.

దీని ఆచరణ విధానాన్ని గురించి దిగువ సంగ్రహంగా వివరించ బడినది:

ఎన్నికలో రికార్డు అయిన మొత్తం చెల్లిన ఓట్లను (ఒక్కొక్క ఓటు విలువ 100 చొప్పున పరిగణించబడుతుంది) భర్తీ చేయవలసిన ఖాళీల సంఖ్యలో ఒకటి కలిపి ఆ మొత్తం సంఖ్యతో భాగించి భాగించగా వచ్చిన సంఖ్యలో ఒకటి కలిపి ఆ పూర్తి సంఖ్యను కోటాగా (భిన్నాలను వదిలివేస్తారు.) అంటే అభ్యర్థి ఎన్నికైనట్లుగా ప్రకటించబడటానికి చెల్లిన ఓట్లలో కనీసం అతనికి ఎన్ని ఓట్లు రావాలో వాటి సంఖ్యగా నిర్ణయిస్తారు.

అర్హులైన ఓటర్ల జాబితాలను సిద్ధం చేసిన తరువాత ఎన్నికలు జరపడానికి ఒక తేదీని నిర్ణయిస్తారు. పోలింగ్ స్టేషనులో సీలు వేసిన బాలెట్ డబ్బాను పెడతారు. అక్కడ ప్రతి ఓటరుకూ ఒక బాలెట్ పత్రం ఇస్తారు. దానిలో పోటీచేసే

అభ్యర్థుల పేర్లు వుంటాయి. పేర్లకు ఎదురుగా, ఓటర్లు 1, 2, 3, 4_ఈ విధంగా అభ్యర్థులకు తాము ఇచ్చే ప్రాధాన్య క్రమం సంఖ్యను పేర్కొనడానికి వీలుగా స్థలం వుంటుంది. ఒక వేళ ఓటరు ఏదైనా పేరుకు ఎదురుగా ఒకటి అంకెను పేర్కొనక పోయినా లేదా ఆ అంకెను ఒకటికంటే ఎక్కువ పేర్లకు ఎదురుగా వేసినా లేదా ఒకటి అంకెతో పాటు మరేదైనా సంఖ్యను వ్రాసినా అతని ఓటు చెల్లదు. పోలింగ్ ముగిశాక రిటర్నింగ్ ఆఫీసరు మొదట చెల్లని బాలెట్ పత్రాలన్నింటినీ త్రోసి పుచ్చుతాడు. చెల్లిన బాలెట్ పత్రాల సంఖ్యను తేల్చిన తర్వాత పైన తెలిపిన. కోటాను నిర్ణయిస్తాడు. పిమ్మట చెల్లిన బాలట్ పత్రాలను వాటిపై పేర్కొన్న మొదటి ప్రాధాన్యతను బట్టి అభ్యర్థుల వారీగా వేరు చేస్తారు. నిర్ణీత కోటాకు సమానంగా కానీ లేదా దానికి మించికానీ ఓట్లు పొందిన అభ్యర్థులందరూ ఎన్నికైనట్లు ప్రకటించబడతారు. ఒకవేళ ఏ అభ్యర్థికూడా కోటా మేరకు ఓట్లు పొందని పక్షంలో చెల్లిన ఓట్లలో అందరికంటే తక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి మినహాయించబడి అతని ఓట్లు రెండవ ప్రాధాన్యత ననుసరించి ఇతరులకు పంపిణీ చేయబడుతాయి. అప్పటికి కూడా అభ్యర్థులలో ఎవ్వరికీ కోటా మేరకు ఓట్లు రానట్లయితే ఆ తరువాత అందరికంటే తక్కువ ఓట్లు పొందిన అభ్యర్థి మినహాయించబడి అతని ఓట్లుకూడా, అతనికంటే ముందు మినహాయించబడిన అభ్యర్థులనుంచి అతను పొందివున్న ఓట్లతో పాటుగా పైన తెలిపిన విధంగా పంపిణీ చేయబడతాయి. ఎన్ని స్థానాలు భర్తీ కావాలో అంత మంది అభ్యర్థులే మిగిలేవరకూ అభ్యర్థులను మినహాయించే పద్ధతిని కొనసాగించినప్పటికి కూడా ఏ అభ్యర్థీ కోటా మేరకు ఓట్లు పొందనట్లయితే అందరు అభ్యర్థులు ఎన్నికైనట్లు ప్రకటిస్తారు.

అయితే ఒకవేళ ఒక స్థానాన్ని మాత్రమే భర్తీ చేయవలసి వుండి, ఇద్దరు అభ్యర్థులు అన్ని దశలలోనూ సరిసమానంగా ఓట్లు పొందినట్లయితే రిటర్నింగ్ అధికారి లాటరీవేసి లాటరీలో వచ్చిన అభ్యర్థిని మినహాయించి రెండవ వ్యక్తి ఎన్నికైనట్లు ప్రకటిస్తాడు.

ఒకవేళ కొందరు అభ్యర్థులు కోటాకంటే ఎక్కువ ఓట్లు పొందినట్లయితే మిగులు ఓట్లు అంటే కోటాను మించి పొందిన ఓట్లు లెక్కింపు కొనసాగే ఇతర అభ్యర్థులకు పంపిణీ చేయబడతాయి. ఇక్కడ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఏమిటంటే ఈ మిగులు ఓట్లు అసలు ఓట్ల విలువతోగాక తగ్గింపు విలువతో బదిలీచేయబడతాయి. మిగులు ఓట్లను, ఆ అభ్యర్థి కట్టలోని ఉపయోగించబడని పత్రాలసంఖ్యతో భాగించడం ద్వారా ఈవిలువను నిర్ణయిస్తారు. ఈ విధంగా మిగులు ఓట్ల మార్పిడివల్ల ఎవరైనా అభ్యర్థి కోటా మేరకు ఓట్లు పొందడం జరిగితే ఆ అభ్యర్థి ఎన్నిక అయినట్లు ప్రకటిస్తారు. లేని పక్షంలో పైన వివరించిన మినహాయింపు విధానాన్ని అనుసరిస్తారు. మినహాయించబడవలసిన అభ్యర్థి ఒకవేళ మిగులు పత్రాలలో నుంచి కొన్నింటిని పొందితే మొదట మిగులు ఓట్లనూ తరువాత అభ్యర్థుల అసలు ఓట్లనూ పంపిణీ చేస్తారు. ఈ విధంగా చేయడంలో మినహాయించబడిన అభ్యర్థులు మిగులు ఓట్లను ఏ విలువలో అయితే పొందారో అంతే విలువతో అవి పంపిణీ అయ్యేట్టు జాగ్రత్త వహిస్తారు. కాగా అసలు ఓట్లను పూర్తి విలువతో పంపిణీ చేస్తారు.

ఓట్లు వృధా కాకపోవడం, పేరు ప్రతిష్ఠలలో తరువాతి స్థానంగల అభ్యర్థికి ఓట్లను మార్పిడిచేయడానికి అవకాశం వుండటం సింగిల్ ట్రాన్స్ఫరబిల్ ఓటు విధానం ప్రత్యేకత. ఈ విధానం వల్ల ఓటరు ఉద్దేశం కూడా చాలావరకు నెరవేరుతుంది. అది ఏ విధంగా అంటే ఓటరు మొదటి ప్రాధాన్యత వృధా అయిపోయినా ఆ తరువాతి ఉత్తమ అభ్యర్థిని ఎన్నికచేయడంలో అతని రెండవ ప్రాధాన్యతను కూడా పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది. అయితే అనుసరణలో ఈ విధానం కొంత చిక్కుగా వున్నటనిపిస్తుంది. మిగులు ఓట్లను నిర్ణయించడంలోనూ వాటిని పంపిణీ చేయడంలోనూ అదేవిధంగా వివిధ దశలలో బాలెట్ పత్రాలను వినియోగించని ప్రాధాన్యతలననుసరించి వేరుపరచడంలో చాలా జాగ్రత్త తీసుకోవడం, కచ్చితంగా లెక్కలు వేయడం అవసరమవుతుంది.

శ్రీ జి. ఎస్. ఆర్. శాస్త్రి,
విశాఖపట్నం

ప్రశ్న : పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం కళాశాల నిర్వహణ బాధ్యతను స్వీకరించవలసిందిగా ఆంధ్ర విశ్వవిద్యాలయం సిండికేటు ప్రభుత్వానికి సిఫార్సు చేసింది. రెండు సంవత్సరాల వరకు ఈ కళాశాల నిర్వహణ బాధ్యతను చేపట్టడానికి సాధ్యం కాదని చెప్పి ప్రభుత్వం ఈ సిఫార్సును త్రోసిపుచ్చింది. రెండు సంవత్సరాల వరకు ఈ కళాశాలను స్వాధీనం చేసుకోవడానికి ఎందుకు వీలుపడదో దయచేసి తెలియజేయండి? ప్రభుత్వం ఇదే పరిస్థితులలో తెలంగాణా ప్రాంతంలోనూ, విజయవాడలోనూ, గల ప్రైవేటు కళాశాలలను స్వాధీనం చేసుకోవడం జరిగింది. అయినప్పుడు రెండు సంవత్సరాలవరకు వేచివుండే కంటే ఈ కళాశాలను ప్రభుత్వం తక్షణమే ఎందుకు స్వాధీనం చేసుకోలేదు?

సమాధానం : నర్సాపురం కళాశాలను స్వాధీనం చేసుకునే విషయమై ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలించింది. ప్రస్తుత రాష్ట్ర ఆర్థిక పరిస్థితి దృష్ట్యా ఇప్పుడు ఈ కళాశాలను స్వాధీనం చేసుకోవడం ఆచరణ సాధ్యం కాదని భావించబడింది. * * *

# నూనెపదార్థాల పరిశోధన సంస్థ

మనుష్యులకు కానీ జంతువులకు కానీ ప్రాణ కోటి అంతటికీ కూడా నూనెలు, క్రొవ్వు పదార్థాలు ప్రధానమైన పోషకాహారాలుగా ఉపయోగపడతాయి. అంతేకాక ఇవి పలురకాలైన రసాయనిక పరిశ్రమలకు ముఖ్యమైన ముడిపదార్థాలుగా కూడా వినియోగ పడతాయి. రసాయనిక పరిశ్రమలకై ప్రధానమైన రసాయనిక ముడి పదార్థాలుగా పెట్రోలు, బొగ్గుతోపాటు నూనెలు, క్రొవ్వు పదార్థాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించే దశలో మనం ప్రవేశిస్తున్నామని ఈ రంగంలో నిష్ణాతులైనవారి అభిప్రాయం.

ఆంధ్ర దేశం 1956 వ సం. నుంచి 1961 వ సం. వరకు గల అయిదు సంవత్సరాలలో ప్రధానమైన అయిదు నూనె గింజ పంటల విషయంలో ద్వితీయ స్థానం పొందింది. కాగా ఆముదాలు, తవుడు ఉత్పత్తిలో ఈ రాష్ట్రానిదే అగ్రస్థానం. ఇవిగాక ఇక్కడ అనేక రకాల అటవీ సంబంధమైన నూనె గింజలు లభిస్తాయి.

## పరిశోధన సంస్థ

నూనెగింజలు, నూనెపరిశ్రమలకు సంబంధించిన వివిధ సాంకేతిక సమస్యలను పరిశీలించేనిమిత్తం 1951వ సంవత్సరంలో అనంతపురంలో ఆయిల్ టెక్నలాజికల్ పరిశోధనసంస్థను నెలకొల్పారు. అమెరికాలోనూ, సాంకేతికంగా అభివృద్ధిజెందిన ఇతర దేశాలలోనూ వున్న ఇలాంటి సంస్థల పద్ధతిలో దీనిని రూపొందించారు. నూనెలు, క్రొవ్వు పదార్థాల కెమిస్ట్రీ, టెక్నాలజీలలో ఉన్నత స్థాయిలో అభివృద్ధికరమైన పరిశోధనలను నిర్వహించడానికి ఇచ్చట అన్ని సౌకర్యాలు (పరిశోధనశాల, పైలట్ ప్లాంట్ సాధన సామగ్రి) వున్నాయి.

1951 వ సంవత్సరంలో ఈ సంస్థను స్థాపించినప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ముగ్గురు అధికార్లు (డైరెక్టరుతో సహా) అయిదుగురు పరిశోధక కెమిస్టులతో కూడిన పరిశోధక సిబ్బందిని మంజూరు చేసింది. మూడవ ప్రణాళికా కాలంలో మంజూరైన ఉద్యోగాలన్నింటికీ నియామకాలు జరిగినప్పుడు, ఆరుగురు అధికార్లు, 11 మంది సీనియర్ సైంటిఫిక్ అసిస్టెంట్లు, 12 మంది జూనియర్ సైంటిఫిక్ అసిస్టెంట్లు ఇంకా అయిదుగురు ఇతరులు అంటే మొత్తం 34 మందితో కూడిన పరిశోధక సిబ్బంది వుంటుంది.

## వ్యయం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, భారత కేంద్ర నూనె గింజల సంస్థ (హైదరాబాదు)లు ఆర్థిక సహాయం చేసినందువల్లనే ఈ అభివృద్ధి సాధ్యమైంది. సంస్థను ప్రారంభించినప్పటినుంచి 1962 మార్చి 31 వ తేదీ వరకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు (ఐ.సి.ఎస్.ఓ.సి.) దాదాపు రూ. 22 లక్షలు ఖర్చుచేశాయి. రాష్ట్రప్రభుత్వం సుమారు 16 లక్షలు, కేంద్ర ప్రభుత్వం దాదాపు 6 లక్షలు ఖర్చుపెట్టాయి. మూడవప్రణాళికలో ఈ సంస్థ పరిశోధన ప్రాజెక్టుల కొరకు భారత ప్రభుత్వం దాదాపు రూ. 15 లక్షలు మంజూరు చేసింది. దీనిలో సుమారు లక్ష రూపాయలను భవనాలకు ఉద్దేశించారు (రూ. 63,100 లను మంజూరు చేశారు. మరో రూ. 38,000 లను మంజూరు చేసే విషయమై ఆలోచిస్తున్నారు) పోతే సుమారు 4 లక్షలను సాధన సామగ్రులపై వెచ్చించడానికి ప్రతిపాదించారు. మిగతా మొత్తాన్ని ఆవృత్త వ్యయం క్రింద ప్రత్యేకిస్తారు. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ సంస్థను అభివృద్ధి పరిచే పథకం క్రింద రాష్ట్ర ప్రణాళికలో రూ. 3 లక్షలు కేటాయించారు.

## పరిశోధనలు, సాంకేతిక సహాయం

పరిశోధనలు జరిపి, నూనె పరిశ్రమలకు ప్రాతిపదికగాను, ప్రత్యక్షంగాను ఉపయోగపడే ఫలితాలను సాధించి వాటిని సాధ్యమైనంత విస్తారంగా వ్యాపింప జేస్తూ నూనె తత్సంబంధమైన ఇతర పరిశ్రమలవారికి వాటిని లభింపజేయడం ద్వారా ఉపయోగకారిగా వుండటానికి ఆయిల్ టెక్నలాజికల్ పరిశోధన సంస్థ కృషి చేస్తున్నది. ఇప్పటివరకు 39 పరిశోధన పత్రాలను ప్రచురించారు. ఇంకా దాదాపు 20 పత్రాలు ప్రచురణకు సిద్ధంగా వున్నాయి. త్వరలో వాటిని ప్రకటిస్తారు. నూనె, క్రొవ్వు పదార్థాల విషయంలోనూ, వాటికి సంబంధించిన ఇతర విషయాలలోను కోరిన వారందరికీ సాంకేతిక సహాయం, సలహాలు ఉచితంగా ఇస్తారు. పరిశ్రమలు, నూనెలకు సంబంధించిన సమస్యలపై సాంకేతికమైన సమాచారాన్ని అనేక మంది కోరుతున్నారు. 1955 వ సంవత్సరం నుంచి, నూనెలు తత్సంబంధమైన పరిశ్రమలకు సంబంధించిన వివిధ సమస్యలపై సలహాలు కోరుతూ 460 వరకు అభ్యర్థనలు వచ్చాయి. చాలా అభ్యర్థనల విషయంలో వెంటనే చర్యలు తీసుకోవడం జరిగింది. నూనెగింజలు, నూనెలకు సంబంధించిన వివిధ పరిశోధన విషయాలపై ప్రయోగశాలలో సాధించిన ఆసక్తిదాయకమైన, ఉపయుక్తమైన ఫలితాలు తరువాత క్రమంగా వెల్లడించబడతాయి. * * *

# తొలిప్రజాకవి వేమన

"శ్యామ్ ప్రసాద్"

వ్యావహారిక భాషలో కవిత్వాన్ని వ్రాసిన మహాకవి గురుజాడ అప్పారావు శత జయంత్యుత్సవాలను సమధికోత్సాహంతో జరుపుకుంటున్న ఈ తరుణంలో, ఇంచుమించుగా అయిదు వందల సంవత్సరాలకు పూర్వమే, ఏటికెదురీదినట్లుగా ఆనాటి పరిస్థితులకూ, వాతావరణానికీ లొంగిపోకుండా తనకు నచ్చిన భాషలో–వచ్చిన భాషలో అనుకున్నా అభ్యంతరంలేదు. కవిత్వం చెప్పిన ప్రథమాంధ్ర ప్రజాకవి వేమనను స్మరించుకోవడం సహేతుకమనిపించింది. గాంధీజీ అహింసా సిద్ధాంతానికి బుద్ధుడెలా ప్రాతిపదికలు వేశాడో, అప్పారావుగారి కవితారీతులకు వేమన అలానే పాదులు చేశారనటంలో అతిశయోక్తి లేదు.

విషయమెంత గొప్పదైనా వివరించే తీరును బట్టీ, వాడే భాషను బట్టీ అత్యధిక సంఖ్యాకులకు–దాదాపు అక్షరాస్యులైన ప్రతివారికీ అర్థమయ్యే విధంగా కవిత్వం చెప్పడానికి వీలవుతుందనే విషయాన్ని ఋజువుపరచిన మహానుభావుడు వేమన. ప్రజా సామాన్యము నిత్యమూ ఉపయోగించే తేలిక మాటలతో ప్రతిభాన్వితమైన కవిత్వాన్ని పది కాలాల పాటు నిలిచేటట్లుగా ప్రపథమంగా వ్రాసిన ప్రముఖుడెవ్వరన్న ప్రశ్నకు యెవ్వరు సమాధానంచెప్పినా యింకో పేరు రావడానికి వీలేలేదు. విధిగా వేమన అని మాత్రమే చెప్పడం న్యాయం. అరటిపండొలిచినంత సులభంగా ఆయన పద్యాలను అందరూ అర్థము చేసుకోగలరు. ఆ విధంగా వ్రాసే శక్తి అపురూపంగా యేకొందరికో అబ్బుతుంది. పాండిత్య ప్రకర్షతో గాని కవితా శిల్ప నైపుణ్యంతో గాని ఇటువంటి శైలి అబ్బదు. కవి మనస్తత్వానికీ శైలికీ చాల దగ్గర సంబంధముంటుందంటారు. అది సత్యమేననిపిస్తుంది. ఏ విషయమ్మీదా వ్యామోహం లేనివాడే భాషయొక్క పటాటోపాన్ని తగ్గించుకోగలడు. ఉన్నదున్నట్లు మాట్లాడే స్వభావ మున్నప్పుడే సహజమైన శైలి కుదురుతుంది. ఆయన శైలి ఎంత సహజంగా సాఫీగా ఉంటుందో చూడ్డానికి నిదర్శన మీ పద్యము.

చదువులందు, పాడి మొదవులందును, స్త్రీల
పెదవులందు, రాజ్య పదవులందు,
ఆశలుడిగినట్టి అయ్యలు ముక్తులు.

ఎక్కడికక్కడ అర్థయుక్తంగా విరుగుతూ, లయబద్ధంగా జరుగుతూ, వీనుల విందుగా కరుగుతూ, విషయ విస్తారంగా పెరుగుతూ, ఈ పద్యమొక్కసారి చదివిన వారిని వొదిలిపెట్టకుండా అంటిపెట్టుకుంటుంది. ఇదే వేమన కవిత్వంలోని ప్రత్యేకత. బహుజనాదరణ పొందడం, పది కాలాల పాటు బ్రతకడం, చేరదీసిన వారిని వొదిలిపెట్టకపోవడమనేవి ఉత్తమ కవిత్వ లక్షణాలు. వేమన కవిత్వములోని విశిష్టతకివి నిదర్శనాలు. ఒకరి మెప్పుకోసం, ఒకరి ఉప్పుకోసం, ఒకరి తప్పుకోసం, కవిత్వం వ్రాసినవాడు కాదాయన. ఏది బయటపెట్టడానికీ యేది దాచడానికీ యత్నించినవాడు కాదాయన. అరల తెరల మరుగున అపురూపమైనదేదో ఉన్నట్లు అట్టహాసం చేసే అలవాటు లేదాయనకు.

"గొడ్డుటావు బితుక కుండ గొంపోయిన
పండ్లురాల దన్ను పాలనీదు"
"కడుపునిండ తవుడు గంపలో బెట్టక
చన్నుముట్టనీదు కొన్నబర్రె"
"ఎద్దుకైనగాని ఏడాది తెల్పిన
మాట దెలిసి నడచు మర్మమెరిగి"
"మేక తోక బట్టి మెడచన్ను గుడవగా
ఆకలేలమాను నాశగాక"
"చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా"

"కల్లకిచ్చినట్లు చల్లకియ్యగలేరు
కొల్లకిచ్చినట్లు కుడువలేరు"
"ఎంత సేవ జేసి యేపాటు బడినను
రాచమూక నమ్మరాదురన్న"

మొదలైన పద్యాలూ, "గడ్డి వేసిన చోట్ల గొడ్డు కొమ్మాడించు"–"కుండ చిల్లుబడిన గుడ్డదోపగవచ్చు" "త్రోయనేర్చు కుక్క దొంతులు బెట్టునా"– "పసుల వన్నె వేరు పాలేక వర్ణమౌ" "నేలమీది రాయి నెత్తికెక్కినయట్లు" –"కుమ్మరి కొకయేడు గుదియకొకనాడు"–"బుద్ధిజెప్పువాడు గుద్దితేనేమయా"–'పచ్చికుండ నీళ్ళు పట్టితే నిల్చునా' 'గడుసురాలు మగని గంపబెట్టమ్మురా'– మున్నగు సామాన్యులకు సంబంధించిన సర్వసామాన్యమైన విషయాలను యెత్తి చూపించిన పద్ధతిని బట్టి చూస్తే వేమన రాజ వంశానికి చెందినవాడనడం కంటె రైతు కుటుంబానికి చెందిన వాడనడానికి అవకాశం యెక్కువగా కనబడుతుంది. వేమన కాలాన్నీ ప్రాంతాన్నీ, వంశాన్నీ గురించి తరచే కొద్దీ అనేక సమస్యలెదురై అయోమయమైన పరిస్థితి యేర్పడుతుంది. కొండవీటి ప్రభు వంశానికి చెందినవాడనే కథ ప్రచారములో ఉన్నది గాని అందుకాధారాలు లేవు. అతని పద్యాల్లో రాజవంశీకుని మనస్తత్వమూ యెక్కడా ద్యోతకం కాదు. పైన ఉదహరించిన పద్య భాగాలన్నీ జనసామాన్యము యొక్క జీవిత విశేషాలతో అతని కెంతటి గాఢమైన పరిచయమున్నదో స్పష్టంగా తెలియజేస్తాయి.

అతని పద్యాల్లో ప్రయోగించిన పదాలను బట్టి చూచినా అతనే ప్రాంతము వాడో స్పష్టంగా చెప్పడానికి వీలులేదు. రాయలసీమకు చెందిన మంకు, కద్దు, దొంతులు, దుడ్డు, బైసి, ఒక్కపొద్దు, బాడి, గీకు, సంబళము, గొడ్డు, కబళము, కూయు, దుద్దు, గోకు, కుళ్లగోతు, తాళిక, మున్నగు మాటలు, విరివిగా ప్రయోగించినందువల్లను, అనంతపురము జిల్లా లోని కటారుపల్లిలో వేమన సమాధి ఉండడం వల్లను అతడక్కడి వాడని అభిప్రాయ పడేవాళ్లున్నారు. అదే విధంగా తెలంగాణా ప్రాంతపు పదాలు, పూర్వాంధ్ర ప్రాంతీయాలు కూడ వాడినందునా, ఇంచు మించుగా ప్రతి జిల్లా వాళ్లూ వేమన మావాడేననటం కద్దు. భోగిగా, యోగిగా, విరాగిగా దేశం నలుమూలలా తిరిగినందున వేమన్నకు అన్నిప్రాంతాలకు చెందిన వాడుక మాటలూ అలవడ్డంలో ఆశ్చర్యంలేదు. అందువల్లనే వేమన భాష అంత సజీవంగా సహజంగా వున్నది. ఎక్కడ పుట్టినా ఎక్కడ పెరిగినా ఎక్కడ సమాధి అయినా వేమన ఆంధ్ర దేశాని కంతటికీ చెందిన వ్యక్తి. వేమన చనిపోయిన తరువాత కొంత మంది అతని పేరుతో అనేక ప్రాంతాలలో వ్యవహరించినట్లు తోస్తున్నది. ఆ నకిలీ వేమన్నలలో కూడ కొంత మంది పద్యాలు చెప్పిన వాళ్లున్నట్లున్నది. వాటికి శైలిలోగాని విషయములోగాని వేమన పద్యాల స్థాయి లేకపోగా కొన్ని అందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నవి కూడా లేకపోలేదు. ఒకే వ్యక్తి శైలి కూడా విజ్ఞానమూ, వయస్సూ, అనుభవాలూ, పెరిగే కొద్దీ మార్పు చెందుతూ ఉండడానికి అవకాశము లేక పోలేదు. గాని అంత మాత్రాన పోల్చుకోవడానికి వీలు లేనంతగా అది మార్పు చెందడానికి వీలులేదు. వేమనది విశిష్టమైన శైలి. శ్రద్ధగా పరిశీలిస్తే వేమన పేరుతో చలామణీ అవుతున్న పద్యాలలో అతని రచన లేవో కానివేవో తేల్చడానికి అవకాశం లేకపోలేదు. ఆయన ఎక్కువగా ఆటవెలదులు చెప్పారు. తరువాతివి గీత పద్యాలు. కదాచిద్గా కంద పద్యాలు కూడ వ్రాసినట్లున్నది. ఇతర వృత్తాలాయనవని చెప్పడం అనుమానాస్పదమే.

జంకుగొంకులు లేకుండా చెప్పదలచు కున్నది సూటిగా చెప్పడములో ఆయన కాయనే సాటి. రాజులను, మంత్రులను, మఠాధిపతులను, పీఠాధిపతులను, ఎవరినీ లెక్కజేసిన పాపాన ఆయన యెప్పుడూ పోలేదు. మొగమోటము లేదు. ఎబ్బెరికం లేదు. లొంగు బాటు లేదు. ఎవరిని గురించైనా సరే యే విషయమ్మీదనైనా సరే, చెప్పదలచు కున్నదేదో కుండ బ్రద్దలు గొట్టినట్లు చెప్పగల ధీమా ఆయన కుండేది. ఈ వరుసలోనే దేవతలను గూడా ఆయన వొదిలిపెట్టలేదు. 'కనకమృగము భువిని కద్దు లేదన కుండ తరుణి విడిచి పోయె దాశరథియు, తెలివిలేని వాడు దేవుడెట్లాయెరా ?' అని ప్రశ్నించాడు. అంతేగాదు 'పాలసాగరమందు పవ్వళించిన వాడు గొల్ల వారి పాలు గోర నేల ?' అని సందేహించాడు. 'ఉదధిలోని నీళ్ల ఉప్పులుగా జేసి, పసిడి గద్దు వాని పిసిని జేసి' విత్త మొకరికిచ్చి వితరణ గుణమును చిత్తమొకరి కిచ్చి

చెలిచినాడు. బ్రహ్మచేష్టలన్నీ పాడైన చేష్టలు, అని సృష్టికర్తకే ఒక చురక తగిలించినాడు. యజ్ఞయాగాదులను గూర్చి ఆయనకు సదభిప్రాయం లేదు. అందువల్లనే చాలాఘాటుగా 'లంజ కొరకు మేక నంజుడు తిన సాగి, యజ్ఞమెల్ల కామ యజ్ఞమయ్యె. మొదట సోమయాజి, తుద కామయాజిరా, అని చెడదిట్టాడు. నీతులు జెప్పడములో నిత్యజీవితములోని పోలికలను ఎత్తి చూపించి విను వారిని ఆలోచించేటట్టు చేయడంలో ఇతనిని మించిన వారు లేరు. 'ఇంటి యాలి విడిచి యిల జారకాంతల వెంట దిరుగువాడు వెర్రి వాడు, పంట చేను విడిచి పరిగ లేరిన యట్లు, అనేది యెంత మంచి పోలిక. సత్యం కటువుగా ఉన్నట్లే శ్రేయోభిలాషుల ప్రవర్తన కూడా పెళుసుగా ఉంటుంది 'బుద్ధిజెప్పువాడు గ్రుద్దితే నేమయా ?' అని ప్రశ్నించి కాదని వాదించగల దమ్ములెవరికుంటాయి. యెలా వుంటాయి ? తనకాతిధ్య మిచ్చిన యింటిలో కుటుంబ కలహమున్నట్లు కనిపెట్టి వారిని మందలించిన తీరు చూడండి 'చెప్పులోనిరాయి, చెవిలోని జోరీగ, కంటిలోని నలుసు కాలిముల్లు, ఇంటిలోని పోరు ఇంతింత గాదయా'? వారు తప్పకుండా సర్దుకొని ఉంటారు.

అనుమాన ప్రమాణం కంటే ప్రత్యక్ష ప్రమాణానికి ప్రాముఖ్యత ఇచ్చే అలవాటున్న వాడు గనుక 'విన్నవానికన్న కన్నవాడధికుండు కన్నవానికన్న కలియువాడు' అంటాడు. వెలుగునీడల వలె ఉన్న మంచి చెడ్డ సామీప్యతను వర్ణిస్తూ 'ఇచ్చువాని చెంత. నీని వాడుండినా చచ్చుగాని యీవి సాగనీడు, కల్పతరువు చెంత గ్రచ్చచెట్టున్నట్లు' అని ఉగ్గడిస్తాడు. దారిదప్పిన ప్రయాణీకులు, సమస్యల నర్థము జేసుకోని జిజ్ఞాసువులు, ఆయువు పట్ల నెరుగని అలసులనూ ఉద్దేశించి 'పుట్టమీద గొట్ట భుజగంబు జచ్చునా?' అని ప్రశ్నించి అవును చావదు అని విధిగా అభిప్రాయపడేటట్లు చేస్తాడు. ఇలా ఎన్ని నిదర్శనాలైనా చూపించవచ్చు. వేమన కవిత్వాన్ని పనిగట్టుకొని పట్టుదలగా కూచొని ఆధార గ్రంధాలను ముప్ప వేసుకొని వ్రాయలేదు. ఎప్పటికప్పుడు యే విషయం తనను ఆకర్షిస్తే దానిమీద ఒక పద్యం చెప్పేవాడు. యే అనుభవం తనను కదిలిస్తే దానిమీద ఒక పద్యం చెప్పితే అది నచ్చిన వాళ్ళు, నేర్చుకొనే వాళ్ళు. లేదా వ్రాసుకొనే వాళ్ళు. నిజాని కాయన పద్యమొకసారి విన్న వాళ్ళు మళ్ళీ మరిచిపొయ్యేవాళ్ళు కాదు. అందువల్లనే అవి సజీవంగా ఉన్నాయి. తెలుగు ప్రజలు జీవించి నన్నాళ్ళూ వేమన అమరమూర్తిగా ఉంటాడు.



"నేను నిల్చున్నవాణ్ని నిల్చున్నట్లుగా భగవద్గీత అంతా అప్పచెప్పగలను. దేనికైనా అర్థ వివరణ చెయ్యగలను." అంటూ ఒక ఉత్తమ పురుషుడు ఆవేశ అభినివేశాలతో సభలో మాట్లాడుతుంటే "కూర్చుని చెప్పలేరూ ?" అన్నాడు ఒకకొక్కిరాయి విస్సన్న. ఈ మాటకు సభాసదులు ఆ పెద్దమనిషి నిరుత్తరులై చూస్తుంటే 'అవును వారు నిల్చునీ చెప్పగలరు, కూర్చునీ చెప్పగలరు. మీరు నిల్చునీ చెప్పలేరు, కూర్చునీ చెప్పలేరు గోడ కుర్చీ వేసినా చెప్పలేరు" అని ఠకీమని అన్నాడు ఒక గడుగ్గాయి.

# ఎగువ సీలేరు ప్రాజెక్టు మరి కొన్ని వివరాలు

ఎగువ సీలేరు జలవిద్యుత్ ప్రాజెక్టు (మొదటి దశ) ఆంధ్ర ప్రదేశ్‌లో జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుగా అసమానమైనది. ఈ ప్రాజెక్టు వల్ల అనేక ప్రయోజనాలున్నాయి. ఇది మితవ్యయంతో కూడుకున్నది. సామాన్యమైనది. దీనిని త్వరితంగా నిర్మించవచ్చు. విద్యుచ్ఛక్తి ప్రయోజనాలను శీఘ్రంగా వినియోగించుకోవచ్చు. పెట్టుబడికి ప్రతిఫలం అత్యధికంగా లభిస్తుంది.

మాచ్‌ఖండ్, తుంగభద్ర ప్రాజెక్టుల వద్దనుంచి విడుదలైన నిర్మాణ యంత్రాంగం వగైరాను వినియోగించుకోవచ్చు. ఇందు వల్ల విదేశ మారకద్రవ్యం కనీస ప్రమాణంలో మాత్రమే అవసరమవుతుంది. ఈ ప్రాజెక్టుకు ఇలాంటి నిర్మాణ పద్ధతుల్లో అనుభవజ్ఞులైన ఉద్యోగులు కూడా లభిస్తారు. దేశంలో మితవ్యయంతో కూడిన జలవిద్యుత్ ప్రాజెక్టులలో ఇదొకటి రూ. 6 కోట్ల పెట్టుబడితోనే 120 మె. వా. స్థాపిత ఉత్పాదక శక్తిని సాధించవచ్చు. అంటే ఒక స్థాపిత కి. వా. కు సుమారు రూ. 500 ల చొప్పున ఖర్చు అవుతుంది. భారతదేశంలో యుద్ధానంతరం ప్రారంభించిన విద్యుత్ ప్రాజెక్టులపై ఒక స్థాపిత కి. వా. కు రూ. 1,000 లు మొదలు రూ. 2,000 ల వరకు వ్యయమవుతున్నది.

ఇది సామాన్యమైన ప్రాజెక్టు. ఇదే నదిపై 50 మైళ్ళ ఎగువన వున్న మాచ్‌ఖండ్ జలవిద్యుత్ పథకపు కడపటి జలాలను ఇది వినియోగించుకుంటుంది. దీనికి ఆనకట్ట నిర్మించవలసిన పనిలేదు. సాధారణమైన మళ్ళింపువీర్‌ను మాత్రం నిర్మిస్తే చాలు. జలాశయం మళ్ళింపువీర్ నిర్మించి అనుకొనివున్న ఒక పెద్ద సరస్సు కావడం వల్ల విద్యుచ్ఛక్తికి కాలువ అవసరం లేదు. మళ్ళింపువీర్ నుంచి చిన్న చిన్న నీటి గొట్టాలు (పెన్ స్టాకులు) నేరుగా బయలుదేరుతాయి. ఈ సరస్సును లోయకు అడ్డంగా మట్టి కట్టలు వేసి ఏర్పరిచారు.

ఈ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌కు అత్యవసరం. ఆనకట్టను కానీ, విద్యుచ్ఛక్తి కొరకు కాలువను కానీ, సొరంగాలను కానీ నిర్మించవలసిన అవసరం లేదు కాబట్టి ఈ ప్రాజెక్టును మూడు లేక నాలుగు సంవత్సరాల స్వల్పవ్యవధిలోనే పూర్తి చేయవచ్చును. 1960 వ సంవత్సరారంభంలో ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని చేపట్టారు. విద్యుత్కేంద్రం 1964 వ సంవత్సరం నాటికి బహుశా పని ప్రారంభిస్తుంది.

ఈ ప్రాజెక్టువల్ల చేకూరే విద్యుత్ సంబంధమైన ప్రయోజనాలను, మూడు సంవత్సరాల స్వల్పకాలంలోనే సంపూర్ణంగానూ, సత్వరంగానూ వినియోగించుకోవచ్చును. దీనికి ప్రధాన కారణం, ఆంధ్రప్రదేశ్ అంతటికీ విస్తరించివున్న విద్యున్మార్గం (పవర్ గ్రిడ్) వుండటం. పరిశ్రమల కొరకు భారీ ఎత్తున విద్యుచ్ఛక్తి అవసరం పెరుగుతుండటమే.

పై కారణాల వల్ల ఈ ప్రాజెక్టు అసమానమైన లాభసాటిది అవుతుంది. రూ. 8 కోట్ల పూర్తిపెట్టుబడి (ట్రాన్స్‌మిషన్ లైన్ల ఖర్చుతో సహా) దానిమీద పెరిగిన, వడ్డీపై ప్రాజెక్టు వినియోగంలోకి వచ్చిన నాలుగవ సంవత్సరంలోనే ప్రతిఫలం నికరంగా 11.2 శాతం వరకు వుంటుంది.

జాలాపుట్ వద్ద వున్న స్టోరేజ్ డామ్, ఇదే నదిపై 50 మైళ్ళ ఎగువన వున్న మాచ్‌ఖండ్ విద్యుత్కేంద్రంతో సహా మాచ్‌ఖండ్ జలవిద్యుత్ ప్రాజెక్టు పనులు పూర్తయ్యాయి. దీని స్థాపిత ఉత్పాదక శక్తి 114.75 మె. వా. పై ప్రాజెక్టు నుంచి ఎగువ సీలేరుకు విద్యుదుత్పాదనకై నిరంతరం సుమారు 1,400 క్యూసెక్కుల నీరు రెగ్యులేటెడ్ విధానంలో లభిస్తుంది. నదికి అడ్డంగా తక్కువ ఎత్తున "వీర్" ను మాత్రం నిర్మించడం వల్ల ఎగువ సీలేరుకు విద్యుచ్ఛక్తి నిమిత్తం సుమారు 1,800 క్యూసెక్కుల నీరు నిరంతరం లభిస్తున్నది.

మాచ్‌ఖండ్–సీలేరు బేసిన్ మితవ్యయంతో జలవిద్యుచ్ఛక్తిని అభివృద్ధిపరచడానికి చాలా అనువైనది. మాచ్‌ఖండ్

ప్రాజెక్టు సుమారు 850 అడుగుల ధారను వినియోగించుకొని 114.75 మె.వా.ల విద్యుచ్ఛక్తిని అభివృద్ధి పరుస్తుంది. మాచ్‌ఖండ్ కడపటి జలాల పథకమైన ఎగువ సీలేరు ప్రాజెక్టు బలిమెల డాము విద్యుత్కేంద్రం. ఎగువ సీలేరు విద్యుత్కేంద్రాల వద్ద కలిపి మొత్తం 480 అడుగుల ధారను వినియోగించుకొనగలుగుతుంది. ఈ ప్రాజెక్టు 50 మైళ్ళు దిగువన వుంది. ఎగువ సీలేరు కడపటి జలాల పథకమైన దిగువ సీలేరు ప్రాజెక్టు, ఎగువ సీలేరు విద్యుత్కేంద్రం కడపటి జలాల మట్టం, పొల్లూరు గ్రామం సమీపంలో సీలేరు నది నీటి మట్టాల మధ్య లభించే మొత్తం 800 అడుగుల ధారను వినియోగించుకొనగలుగుతుంది. ఇది ఇదే నదిపై ఇంకా సుమారు 25 మైళ్ళ దిగువన వుంది. మాచ్‌ఖండ్ కడపటి జలాల మట్టం, బలిమెల డాము రిజర్వాయరు మట్టాల మధ్య లభించే హెడ్ 200 అడుగుల వరకూ వుంటుంది. దిగువ మాచ్‌ఖండ్ ప్రాజెక్టును అమలుపరచడం ద్వారా దీనిని వినియోగించుకోవచ్చు. మాచ్‌ఖండ్ విద్యుత్కేంద్రం లోతట్టు ప్రవాహానికి సుమారుగా అరవ మైలు వద్ద ఒక ఆనకట్ట నిర్మాణాన్ని ఈ ప్రాజెక్టు తలపెట్టుతున్నది. ఈ విధంగా ఈ బేసిన్ విద్యుదుత్పాదక శక్తి సుమారు 725 మె. వా. వుంటుంది.

ఎగువ సీలేరు ప్రాజెక్టు మొదటిదశ క్రింద దిగువ పనులు జరుగుతాయి:

1. గుంటవాద వద్ద సుమారు 35 అడుగుల ఎత్తు గల కొద్దిపాటి మళ్ళింపువీర్. దీని ఇరువైపులా తక్కువ ఎత్తున (లో సాడల్స్ వద్ద) మట్టికట్టలు.

2. వీర్‌కి దిగువన సాడల్స్‌కి అడ్డంగా తక్కువ ఎత్తు మట్టి కట్టలతో ఒక సరస్సు. సరస్సులోకి వ్యాపించిన నదీజలాల నుంచి విద్యుచ్ఛక్తికి నీరు తీసుకోడానికి రెగ్యులేటింగ్ గేట్లు.

3. సరస్సు నుంచి విద్యుత్కేంద్రం వరకు చిన్న నీటి గొటాలు (పెన్‌స్టాకులు).

4. విద్యుత్కేంద్రం భవనం. నీరు వెళ్ళిపోవడానికి నది వరకు కాలువ.

5. చివరి దశలో మరో మూడు యూనిట్లను చేర్చడానికి అవకాశం కల్పిస్తూ ప్రారంభంలో 60 మె. వా. ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే రెండు యూనిట్ల స్థాపన.

"ప్రసారం, పంపిణీ పథకం" క్రింద కొత్తగూడెం మార్గంగా ఎగువ సీలేరు నుంచి నాగార్జునసాగర్‌వరకూ సుమారు 200 మైళ్ళ 220 కె. వి. ట్రాన్స్‌మిషన్ లైన్ను, ఎగువ సీలేరు విద్యుత్కేంద్రం నుంచి విద్యుచ్ఛక్తిని ప్రసారం చేయడానికి ఎగువ సీలేరు నుంచి సింహాచలం ఎస్. ఎస్. వరకూ 90 మైళ్ళ పొడవున మరో 220 కె. వి. లైన్ను వేయడానికి అవకాశం కల్పించబడింది.

ఈ పథకాన్ని కేంద్ర జలవిద్యుత్ సంఘం వారితో సంప్రదించి సమగ్రంగా పరిశీలించడం స్థిరపరచడం జరిగింది.

మాచ్‌ఖండ్, తుంగభద్ర ప్రాజెక్టులవద్ద మిగులుగా వున్న నిర్మాణ యంత్రాంగాన్ని ఎగువ సీలేరు ప్రాజెక్టు చాలా వరకు సమర్థంగా వినియోగించుకుంటుంది. ఈ విధంగా నిర్మాణ యంత్రాంగంపై 20 లక్షల మేరకు విదేశమారకం వ్యయం తప్పుతుంది. సీలేరు జలవిద్యుత్ ప్రాజెక్టు మొదటి దశ పనులకు రూ. 200 లక్షల వరకూ విదేశ మారకం అవసరమవుతుంది. విద్యుత్ యంత్రం ఖరీదుకు మాత్రమే విదేశమారక ద్రవ్యం కావల్సి వుంటుంది. దీని ప్రయోజనాలతో పోల్చి చూసినప్పుడు ఇది తక్కువే.

మాచ్‌ఖండ్, సీలేరు బేసిన్‌లో సమీకృత విద్యుచ్ఛక్తి అభివృద్ధి పరంపరలో, ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు మొదటి దశ ఆర్థికంగా లాభసాటియైన ఒక ముఖ్యమైన యూనిటు. దీని మొత్తం విద్యుదుత్పాదక శక్తి సుమారు 725 మె. వా. దశల వారీగా దీనిని అభివృద్ధి పరచవచ్చు.



# అస్సాం, మణిపూర్ ప్రజలను ఆనందపరవశులను చేసిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక బృందం

ఒక రాష్ట్రానికి చెందిన కళాకారులు మరొక రాష్ట్రంలో పర్యటించి ప్రదర్శనలివ్వటానికై భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించి రూపొందించిన పథకాన్ననుసరించి ఈ సంవత్సరం సెప్టెంబరు 14 వ తేదీనుంచి అక్టోబరు ఒకటవ తేదీ వరకు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సాంస్కృతిక బృందం అస్సాం, మణిపూర్ ప్రాంతాలలో పర్యటించింది. ఈ పథకాన్ని ప్రారంభించి మూడు సంవత్సరాలైంది.

ఈ సాంస్కృతిక బృందంలో ఒక కూచిపూడి నర్తకి; పలువురు జానపద నర్తకులు; శాస్త్రీయ, లలిత సంగీత గాయకులు; కవాలీ, బుర్రకథ, నాదస్వరం దళాలతో సహా మొత్తం 33 మంది కళాకారులు వున్నారు. సుసంపన్నము, సంవృద్ధము అయిన మన సంస్కృతీ విశేషాలను ప్రతిబింబింపజేసేవిగా ఈ బృందం రూపొందింది.

ఈ బృందంవారు ఒక్కొక్క రాష్ట్రంలో అయిదేసి చొప్పున మొత్తం పదిప్రదర్శనలిచ్చారు. అవి చాలా విజయవంతమయ్యాయి. రమణీయమైన కూచిపూడినాట్యం, అహ్లాదకరమైన జానపద, కొండ జాతుల నృత్యాలు అస్సాం, మణిపూర్ ప్రజలను బాగా ఆకర్షించాయి. బుద్ధభగవానుని ప్రేరణపై ప్రదర్శించిన బృంద నాట్యం ప్రతిచోటకూడా విశేషంగా ప్రేక్షకులమన్ననలు పొందింది. నాదస్వరవాద్యంకూడా అక్కడి వారికి కర్ణానందం కలిగించింది. భాష బోధపడనప్పటికీ మన బుర్రకథ దళం సమర్పించిన జానపద సంగీతాన్ని అక్కడివారు చెవులూరించి వినడం ఆశ్చర్యం కలిగించింది.

షిల్లాంగ్‌లో అస్సాం ముఖ్యమంత్రి శ్రీ బి.పి. ఛాలియా ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. ఆయన చాలా కార్యక్రమాలను తిలకించారు. కళాకారుల అమోఘమైన ప్రదర్శనలకు ప్రశంసా సూచకంగా వారికి ఆయన పుష్పగుచ్ఛాలను బహూకరించారు. కళాకారులు ఆయనకు అస్సామీ పాటతో స్వాగతమిచ్చారు. కళాకారులు తమ దిన భత్యాలలోనుంచి రూ. 101/-లు ప్రోగుచేసి ముఖ్యమంత్రి వరదబాధితుల సహాయనిధికి సమర్పించారు. వీరి ఈ దాతృత్వాన్ని ప్రతి ఒక్కరూ ఎంతో కొనియాడారు.

మణిపూర్ రాష్ట్రంలో మన బృందం ఉఖ్రుల్ పర్యటన ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఉఖ్రుల్ ఇంఫాల్ నుంచి దాదాపు 64 మైళ్ల దూరంలో వున్న ఒక పర్వత కేంద్రం. ఇచ్చట నాగా ప్రజలు అత్యధికంగా నివసిస్తారు. వీరు మన బృందానికి సంప్రదాయకమైన స్వాగతమిచ్చారు. ఇచ్చట మన బృందంవారు సమర్పించిన కార్యక్రమాలను అయిదు వేల ప్రజలు తిలకించారు.

తిరుగు ప్రయాణంలో గౌహతివద్ద ఆంధ్ర పోలీసు బెటాలియన్ వారు సాంస్కృతిక బృందానికి ఘనంగా విందుచేశారు.

# సంగ్రహ ప్రకటనలు

## ఆయుర్వేద కోర్సు: ప్రభుత్వ వివరణ

హైదరాబాదులోని ఆయుర్వేద కళాశాల విద్యార్థులు కొన సాగించిన ఆందోళన విషయమై ప్రభుత్వం 1962 అక్టోబరు 14 వ తేదీన జారీ చేసిన ఒక పత్రికా ప్రకటనలో ఈ క్రింది వివరణను తెలిపింది:—

ప్రభుత్వం 1960—61 సంవత్సరంలో హైదరాబాదులోని ప్రభుత్వ ఆయుర్వేద, యూనానీ కళాశాలల్లో శుద్ధ ఆయుర్వేద, శుద్ధ యూనానీ కోర్సులను ఆరంభించింది. ఆ తరువాత ప్రభుత్వ ఆయుర్వేద, నిజామియా తిబ్బీ కళాశాలలను ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధపరిచే వుద్దేశంతో శుద్ధ ఆయుర్వేద, శుద్ధ యూనానీ కోర్సులకు ఒక పీఠాన్ని ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఒక లేఖ వ్రాసింది. అయితే, ఈ విషయంలో విశ్వవిద్యాలయం తన అశక్తతను ప్రకటించింది.

ఈ సందర్భంలో ఒక విషయం చెప్పాలి. ఆయుర్వేద యూనానీ వైద్య పద్ధతులు ఏ తీరులో అభివృద్ధి చెందవలసిందీ తెలియజేస్తూ హెల్తు సర్వే, ప్లానింగు కమిటీ ఒక నివేదికను అందజేసింది. ఆయుర్వేద, యూనానీ కోర్సులపై యాజమాన్యం వహిస్తూ, వాటికి ఒకే విధమైన పాఠ్య ప్రణాళికను రూపొందించే విషయాన్ని, భారత ప్రభుత్వం, ప్లానింగు కమీషను తీవ్రంగా ఆలోచిస్తున్నాయి.

ఇట్టి పరిస్థితిలో, దీన్ని గురించి భారత ప్రభుత్వం అంతిమ నిర్ణయం తీసికొనేంతవరకు, ఇక్కడి కళాశాలల్లో పాఠ్య ప్రణాళి కల్ని తీవ్రంగా మార్పుచేయడం మంచిదికాదని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తున్నది. భారత ప్రభుత్వం నిర్దుష్టమైన పద్ధతిని సూచించిన తరువాత కానీ, లేదా విశ్వవిద్యాలయం పీఠాన్ని ఆరంభించిన తరువాత కానీ కోర్సులను మార్పుచేసే విషయం పరిశీలించవచ్చు.

శుద్ధ ఆయుర్వేద విద్యార్థులు సమీకృతమైన కోర్సులు చదవడానికి అనుమతి ఇవ్వాలని కోరారు. అయితే వారు కళాశాలల్లో ప్రవేశించేప్పుడు కోర్సులు శుద్ధ ఆయుర్వేదంలో కానీ, శుద్ధ యూనానీలో కానీ వుంటాయనీ, సమీకృతమైన కోర్సులు వుండవనీ స్పష్టం చేస్తూ ప్రభుత్వం ప్రకటించింది. ప్రస్తుత పరి స్థితుల్లో ముఖ్యంగా ప్లానింగు కమీషను, భారత ప్రభుత్వం ఈ కోర్సుల విషయమై ఒక నిర్దుష్టమైన విధానాన్ని రూపొందిస్తున్న తరుణంలో రాష్ట్ర ప్రభుత్వం తీవ్రమైన మార్పులు చేయడం వాంఛనీయం కాదు.

కోర్సుల కాలపరిమితి దీర్ఘంగా వుండడంవల్ల, కోర్సులను 5 నుంచి $4\frac{1}{2}$ సంవత్సరాలకు తగ్గించాలనీ, హౌస్ సర్జన్‌షిప్ తప్పనిసరిగా వుండకూడదనీ ప్రభుత్వం నిర్ణయించింది. ఇదివరకే రెండేండ్లు చదివిన విద్యార్థుల విషయంలో మొత్తం కోర్సును మిగిలిన కాలంలో పూర్తిచేసే విధంగా, దాన్ని మార్పుచేయడం జరుగుతుంది. కోర్సు ముగిశాక ఉత్తీర్ణులైన విద్యార్థులకు యోగ్యతా పత్రాలు ఇవ్వబడుతాయి. దేశీ వైద్య శాఖలో వైద్యులు గాను లేక హకీంలుగాను నియమింప బడటానికి వారికి అర్హత వుంటుంది. ఈ యోగ్యత పత్రాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర ఆయుర్వేద బోర్డు గుర్తిస్తాయి.

భారత ప్రభుత్వం, ప్లానింగు కమీషను, ఈ కోర్సులకు ఒకే విధమైన పద్ధతిని రూపొందించే విషయమై పరిశీలిస్తున్నాయి గనుక ప్రభుత్వ ఆయుర్వేద, యూనానీ కళాశాలల్లో ప్రవేశాల్ని ప్రస్తుతానికి ఆపివేయాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

## మందుల పరిశోధకులు

1940వ సం॥ మందుల చట్టంలోని 20వ సెక్షను క్రింద హైదరాబాదు, నారాయణగూడలోని ప్రివెంటివ్ మెడిసిన్ ఇన్స్టిట్యూట్‌లో మందులను పృథక్కరించడానికి ప్రభుత్వం ఈ దిగువ పేర్కొన్న వ్యక్తులను ప్రభుత్వ పరిశోధకులుగా నియమించింది: గవర్నమెంటు అనలిస్టు, బయోలాజికల్ స్టాండర్డ్స్ (డ్రగ్స్ స్పెషల్), అసిస్టెంటు డైరెక్టరు డా॥ కె. దత్తాత్రేయులు, 1945 సం॥ మందుల నియమావళిలోని సి. సి. 1 పట్టికలలో పేర్కొనబడిన మందులను పరిశీలిస్తారు. ఈ పట్టికలలోని మందులు మినహా ఇతరములైన మందులను శ్రీ యం. కృష్ణమూర్తి, కెమికల్ ఎగ్జామినర్ డా. టి. ధర్మారెడ్డి పరిశీలిస్తారు.

## ఉచిత వైద్య సౌకర్యాలు

ఇంతవరకు నాన్–గజిటెడ్ ఉద్యోగుల కుటుంబ సభ్యులకు మాత్రమే లభింపజేయబడుతున్న ఉచిత వైద్య సౌకర్యాల్ని అట్టి ఉద్యోగులపైన పూర్తిగా ఆధారపడిన తలిదండ్రులకు కూడా విస్తరింపజేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. కనుక నాన్–గజిటెడ్ ఉద్యోగులపై పూర్తిగా ఆధారపడిన తలిదండ్రులను, కుటుంబంలోని సభ్యులుగా పరిగణించాలని ప్రభుత్వం ఆదేశించింది.

## రాక్షసిబొగ్గు కార్డుల పునరుద్ధరణ

మొదటి అర్ధసంవత్సరానికి అంటే 1962 ఏప్రిల్ నుంచి 1962 సెప్టెంబరు ఆఖరువరకు జారీ చేసిన రాక్షసిబొగ్గు కార్డులను రెండవ అర్ధసంవత్సరానికి అంటే 1962 అక్టోబరు నుంచి 1963 మార్చి ఆఖరు వరకు పునరుద్ధరించుకోవాలని బొగ్గు కార్డులు వున్న వ్యక్తులకు తెలియజేయడమవుతున్నది. కనుక హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలో ఈ కార్డులు గల వ్యక్తులు హైదరాబాదు–1, కంట్రోలు సరుకుల డైరెక్టరుకు దరఖాస్తు పెట్టుకోవాలని కోరబడుతున్నారు. దరఖాస్తులపైన ఒక రూపాయ కోర్టు ఫీజు స్టాంపును అంటించి వాటితో పాటు అసలు కార్డులను జతపరచి పంపాలి. జిల్లాల నుంచి దరఖాస్తులు చేసేవారు తమ ప్రాంతానికి సంబంధించిన వాణిజ్య పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టరు ద్వారా దరఖాస్తులు పంపాలి. కంట్రోలు సరుకుల డైరెక్టరు కార్యాలయానికి జిల్లాల నుంచి నేరుగా వచ్చే దరఖాస్తులు పునరుద్ధరణ కొరకు పరిశీలించబడవు.

## భాషా పరీక్ష నుంచి మినహాయింపు

లోగడ ప్రభుత్వోద్యోగులందరికీ నిర్ణయించబడిన హిందీ లేదా ఉరుదూ భాషా పరీక్షలో ఉత్తీర్ణత పొందటం నుంచి 1961 ఫిబ్రవరి 20 వ తేదీన సర్వీసులో వున్న పోలీసు సబార్డినేట్లందరినీ, ఆంధ్రప్రదేశ్ పోలీసు సబార్డినేటు సర్వీసులోని పోలీసు కానిస్టేబిల్స్ హెడ్ కానిస్టేబిల్స్‌నందరినీ, ఆంధ్రప్రదేశ్ స్పెషల్‌పోలీసు సబార్డినేటు సర్వీసులోని కానిస్టేబిల్స్, లాన్స్‌నాయకులు, నాయకులు, హవాల్దార్లు, హవాల్దారు మేజర్లనందరినీ ప్రభుత్వం మినహాయించింది. అయితే రేడియోసూపర్‌వైజర్లు, టెక్నీషియన్లు, సబ్ఇనస్పెక్టర్లు, జమేదార్లు, జమేదార్స్ అజూటంట్, సుబేదార్లు, సుబేదార్స్‌మేజర్ ఉద్యోగాలకు నేరుగా నియమించబడే వారు మాత్రం ఇక మీదట తమ శిక్షణ కాలంలో పబ్లిక్ సర్వీసు కమిషను నిర్వహించే హిందీలేదా ఉరుదూ పరీక్షలో ఉత్తీర్ణులు కావాల్సి వుంటుంది.

## సహకార వ్యవసాయ సంఘాలు

లోగడ చేసిన ఉత్తర్వులో తెలిపిన విధంగా సహకార వ్యవసాయ సంఘాలకు వాటా ధనం క్రింద రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే రూ. 2,000 ల మొత్తాన్ని సరిసమాన (మాచింగ్) ప్రాతిపదికపై లభింపజేయడానికి ప్రభుత్వం ఆదేశించింది. నిర్వహణ ఖర్చుల క్రింద సహకార వ్యవసాయ సంఘాలకు చెల్లించే రూ. 1,200 ల సబ్సిడీని లోగడ పేర్కొన్నట్లుగా సంవత్సరానికి రూ. 1,200 ల చొప్పున కాక మూడు మొదలు అయిదు సంవత్సరాల వరకు లభింపజేయాలని కూడా లోగడ జారీచేసిన ఉత్తర్వులకు సవరణగా ప్రభుత్వం ఇప్పుడు ఆదేశించింది.

## గడువు పొడిగింపు

1959 నవంబరులోనూ, 1959 అక్టోబరు (3 వ తేదీ) లోనూ జారీ చేసిన రెండు ప్రభుత్వ ఉత్తర్వులననుసరించి ఏర్పడిన అన్ని పంచాయతీ సమితుల అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, నామినేటు అయిన సభ్యులు, ఎన్నిక అయిన సభ్యులు 1962 అక్టోబరు ఒకటవ తేదీన పదవుల్లో వున్న స్థాయీ సంఘాల సభ్యుల (ఈ పంచాయతీ సమితుల సభ్యులు కానివారు) పదవీ కాలాన్ని ప్రభుత్వం 1964 జూన్ 30 వ తేదీ వరకు పొడిగించింది. రద్దు పరచబడిన పల్లిపట్ పంచాయతీ సమితి మినహా, మహబూబ్ నగరంలోని షాద్‌నగర్ బ్లాకు పంచాయతీ సమితి ఇంకా 233 ఇతర సమితులకు ఈ ఉత్తర్వులు వర్తిస్తాయి.

## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ రాష్ట్ర కమీషనరు

జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ డైరెక్టరు హోదాను జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ రాష్ట్ర కమీషనరుగానూ, జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ అసిస్టెంట్ డైరక్టర్ హోదాను రాష్ట్ర అసిస్టెంట్ కమీషనర్‌గాను మార్చడానికి ప్రభుత్వం ఆదేశించింది. * * *

# రండర్రా తమ్ముళ్ళా!

మురళీధర్

ఒకళ్ళమీద ఒకళ్ళు కత్తులు దూయటం మానేసి
ఒకసారి మనమంతా కలుద్దాం రండర్రా, తమ్ముళ్ళూ!
పక్కవాడి పీక నులిమేసే చేతుల్ని
పక్కకు నెట్టేసి
సుఖాన్ని పంచుకొనే రోజును
తీసుకురావటం కోసం
బాధల్ని పంచుకోవడం మొదలెడదాం. రండర్రా!

అన్నం బదులు గడ్డితిని బ్రతికినట్లు
మనల్ని మనం విడగొట్టుకుని పోగొట్టుకున్నాం–
మనం విడిపోవడానికి
కావలసినన్ని
కష్టాలు, కార్పణ్యాలు,
మతాలు, కులాలు, కూటాలు, కుతంత్రాలు.
ఒకటౌటానికి మాత్రం
ఒక్కటేసూత్రం–
మనమందరం మనుషులం
ఒకేగ్రహంపైన
అనాదినుంచీ కాపురముంటున్నాం–
నదుల్ని మరలించుకుని
కొండల్ని పిండి
అడవుల్ని నరికి
సంపదను సంతరించుకున్నాం–
చిన్న చేపల్ని తిన్న పెద్ద చేప
మరోప్రాణికి ఆహారమైనట్లు
లోకంలో ప్రతివాడూ
ఇంకొకడి దాహానికి ఆహుతి!

ఒక కోర్కె కొండ మీద నుంచి
మరోకోర్కె కొండమీదకు దూకుతూన్నప్పుడు
మధ్య నున్న లోయలో పడి
మాయమైనవాళ్ళ సంఖ్య కోకొల్లలు–
కుప్పి గంతులతో
యోజనాల దూరాన్ని సాధిస్తూన్న మనిషి
ఇంకా పసి బిడ్డడు!
మనిషి అనాది నుంచీ
ఋషిత్వం లేని అగస్త్యుడు
కోర్కెల ఆజానుబాహుడు
విలువల్లో వామనుడు
తన వెలుగుతోనే తన కళ్ళు పోగొట్టుకొన్న
దివాంధుడు.

లోకం ఒక పీడకలై
ప్రతివాడూ భస్మాసురుడై
రక్తంతో అణువణువూ అణుబాంబై
విలువల పూలవనాన్ని
దగ్ధం చేస్తూన్నప్పుడు
అనిమేషుడైన కవికి
గుండెల్లో గునపాలు గుచ్చుకుంటాయి
కళ్ళల్లోంచి రక్తాశ్రువులు కారతాయి.
అప్పుడు
రక్తం జలపాతంలా పొంగి
మనసు ఎడార్లను మాగాణి భూమ్ముల్లాగ
మార్చేస్తుంది.

బూడిద కుప్పల్లాగ
మనిషి విలువలు కూలి పోతున్నాయి.
ఇకనైనా మనం ఒకటౌదాం రండర్రా!
వెలుగు పలుగుతో
చీకటిని చీల్చుకుంటూ
బాధల్ని దండించి
మనిషి శ్రమను పండిద్దాం రండర్రా–

ఒకళ్ళ మీద ఒకళ్ళు కత్తులు దూయటం మానేసి
ఒక్కసారి మనమంతాకలుద్దాం రండర్రా!
తమ్ముళ్ళూ!

# ఆంధ్రప్రదేశ్ జనాభా

ఆంధ్రప్రదేశ్ జనాభా 1961 మార్చి 1 వ తేదీ నాటికి 38,983,447 అనీ, విస్తీర్ణం 106,286చ. మైళ్ళనీ, జనసాంద్రత చదరపుమైలు 1 కి. 339 మందిఅనీ రిజిస్ట్రార్–జనరల్ విడుదల చేసిన తుది జనాభా లెక్కల వల్ల తెలుస్తున్నది.

జనాభా పరిమాణం విషయంలో భారత దేశంలోని రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ నాలుగవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అంటే దేశం మొత్తం జనాభాలో 8.20 శాతం ఆంధ్ర రాష్ట్రంలోనే వుందన్న మాట. విస్తీర్ణం విషయంలో ఆంధ్రప్రదేశ్‌కు ఐదవ స్థానం వస్తుంది. ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం దేశం మొత్తం విస్తీర్ణంలో 9.03 శాతం.

## జనాభా పెరుగుదల

1951 నుంచి 61 వరకు ఒక దశాబ్దంలో రాష్ట్ర జనాభా 15.65 శాతంపెరిగింది. అంటే 4.9 మిలియన్లు మంది పెరిగారన్న మాట. జనాభాలో ఈ లెక్కన పెరగడం ఎక్కువే ఐనా అఖిల భారత సగటుతో–21.50 శాతం– దాన్ని పోల్చి చూస్తే అదికొంత తృప్తి కరమైన విషయమే. ఈ శతాబ్దారంభం నుంచి గత అరవై ఏళ్ళలో–1901 నుంచి–రాష్ట్ర జనాభా 88.7 శాతానికి పెరిగింది. అంటే 19 మిలియన్ల నుంచి 36 మిలియన్లు–దాదాపు రెట్టింపు అయిందన్న మాట. 1911–21లో ఇన్‌ఫ్లూయింజా వ్యాధి వ్యాపించిన ఫలితంగా జనాభా పెరుగుదల చాలా తగ్గింది. లేకుంటే 1901 నుంచి జనాభా నూటికి నూరు శాతం పెరిగివుండేదే. 1901 నుంచి జనాభా పెరుగుదల పదేళ్ళ కొకసారి ఏరీతిగా పెరిగిందీ ఈ క్రింది పట్టిక వివరిస్తుంది.

| సంవత్సరం | మొత్తం జనాభా | | పదేళ్ళలోని తేడా శాతం. |
|---|---|---|---|
| 1901 | 19,065,921 | | — |
| 1911 | 21,447,412 | + | 12.49 |
| 1921 | 21,420,448 | — | 0.13 |
| 1931 | 24,203,573 | + | 12.99 |
| 1941 | 27,289,340 | + | 12.75 |
| 1951 | 31,115,259 | + | 14.02 |
| 1961 | 35,983,447 | + | 15.65 |

జిల్లాలలో గుంటూరు జిల్లాలో (3,009,900) ఎక్కువ జనాభా వుంది. అది జనాభా విషయంలో ప్రథమ స్థానం పొందుతుంది. అదిలాబాద్ జిల్లాలో (1,009,292) తక్కువ జనాభా వుంది. అది చివరిస్థానానికి వస్తుంది. 1951 నుంచి ఖమ్మంలో (30.88 శాతం) జనాభా పెరుగుదల చాల హెచ్చుగా వుంది. మహబూబ్‌నగర్‌లో ఈ పెరుగుదల చాలా తక్కువగా అంటే 9.92 శాతం వున్నట్లు తెలుస్తున్నది. ఎక్కువ జనసాంద్రత గల కోస్తా జిల్లాలలో తక్కువ జనసాంద్రత గల తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో కన్నా జనాభా పెరుగుదల తక్కువగా వున్నట్లు కూడా తెలుస్తున్నది.

## స్త్రీ, పురుషుల నిష్పత్తి

రాష్ట్రం మొత్తంలో ప్రతి వెయ్యి మంది పురుషులకు 981 మంది స్త్రీలున్నట్లు అది అఖిల భారత స్త్రీ పురుషుల నిష్పత్తి ఐన 941 కన్నా ఎక్కువైనట్లు తెలుస్తున్నది. కోస్తా ఆంధ్ర జిల్లాలలో ఈ తేడా చాలా ఎక్కువగా వుంది. శ్రీకాకుళం, విశాఖపట్నం, మహబూబ్‌నగర్, నిజామాబాద్ జిల్లాలలో స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యను మించివుంది.

ఈ సందర్భంలో భారతదేశ జన గణన ప్రధానాధికారి (కమీషనర్) ఈ క్రింది విధంగా తెలిపారు:

“స్త్రీ పురుషుల నిష్పత్తి ప్రకారం జిల్లాలను, రాష్ట్రాలను విభజిస్తే, కొండజాతి ప్రజలు ఎక్కువగా వున్న మధ్యప్రదేశ్ తూర్పు ప్రాంతం, బీహార్ మినహా మిగిలిన ప్రాంతాలలో ఒక విచిత్రమైన విషయం కానవస్తుంది. ఆ విశేషం ఏమంటే 22 వ డిగ్రీ అక్షాంశరేఖకు ఉత్తరాన ఈ స్త్రీ పురుషుల నిష్పత్తి దక్షిణ భాగంలోకన్నా చాలా తక్కువ. ఈ నిష్పత్తి తేడా ఉత్తర, దక్షిణాలలోని పట్టణ ప్రాంతాలలో కూడా వుంది. ఉత్తరదేశంలోని పట్టణాలలో ఎక్కడా స్త్రీ పురుషుల నిష్పత్తి సరిసమానంగా లేదు. ఇటువంటి పట్టణాలు లేక నగరాలు దక్షిణాదిన ముఖ్యంగా–ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ, మద్రాసు రాష్ట్రాలలో చాలా కొద్ది. ఈ రాష్ట్రాలలో స్త్రీ పురుషుల నిష్పత్తి ప్రతి వెయ్యి మంది పురుషులకు తొమ్మిది వందల స్త్రీలకన్నా తక్కువ. భారతదేశంలో

పట్టణాలను ప్రణాళికాబద్ధం చేయడానికి ఇది సాంఘిక రీత్యా ఎంతో ఉపకరిస్తుంది."

## అక్షరాస్యత

ఈ రాష్ట్రంలో 21.2 శాతం మంది మాత్రమే అక్షరాస్యులు. అక్షరాస్యత విషయంలో భారతదేశ రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలలో మన రాష్ట్రం 1?వ స్థానాన్ని ఆక్రమిస్తుంది. నూటికి 52.7 శాతం మంది అక్షరాస్యులున్న ఢిల్లీ రాష్ట్రానిది అక్షరాస్యత విషయంలో ప్రథమ స్థానం. ఆ తర్వాత స్థానం —46 8 శాతం అక్షరాస్యులున్న—కేరళది. మన చుట్టు ప్రక్కల రాష్ట్రాలైన మద్రాసు (31.4 శాతం), మహారాష్ట్ర (29.8 శాతం), మైసూరు (25.4 శాతం), ఒరిస్సా (21.7 శాతం) లు మనకన్నా ముందున్నాయి. 1951 నుంచి పదేళ్ళలో మన రాష్ట్రంలో అక్షరాస్యుల శాతం 8.1 మాత్రమే పెరిగింది. అంటే 1951 లో వున్న 13.1 శాతం 1961లో 21.2 శాతం అయిందన్నమాట. పురుషులలో అక్షరాస్యుల శాతం 30.2 శాతం కాగా స్త్రీలలో అది 12.0 శాతం మాత్రమే.

రాష్ట్రంలో గల జిల్లాలలో హైదరాబాదు జిల్లాలో 35.0 శాతం మంది అక్షరాస్యులున్నందున అక్షరాస్యుల శాతం విషయంలో హైదరాబాద్ జిల్లాదే ప్రథమ స్థానం. ఇందుకు కారణం హైదరాబాద్ నగరంలో కేంద్రీకృతమైన ఎక్కువ అక్షరాస్యుల సంఖ్య. హైదరాబాద్ తర్వాత కృష్ణా (31.2 శాతం), పశ్చిమ గోదావరి (30.8 శాతం), గుంటూరు (27.7 శాతం) వస్తాయి. అక్షరాస్యుల జనాభా జాబితాలో ఆదిలాబాద్ జిల్లా (11.7 శాతం) చివరకి వస్తుంది.

## పట్టణ జనాభా

రాష్ట్ర జనాభాలో 6,274,508 మంది అంటే నూటికి 17.4 వంతుల మంది మాత్రమే పట్టణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. అఖిల భారత శాతపు సగటు సంఖ్య అయిన 17.97 కు ఇది అనుగుణ్యంగా వుంది. ఈ రాష్ట్రంలో 212 పట్టణాలు, పట్టణ సముదాయాలు వున్నాయి. జనాభా దృష్ట్యా వీటిని ప్రక్కనున్న పట్టికలో తెలిపిన విధంగా వివిధ తరగతులలో విభజించారు

| పట్టణం తరగతి | పట్టణాల సంఖ్య | ఆయా తరగతికి చెందిన ప్రతి పట్టణంలోనూ నివసించే జనాభా శాతం |
|---|---|---|
| 1 | 2 | 3 |
| మొదటి తరగతి—నగరాలు (100,000 అంతకంటే ఎక్కువ) | 11 | 42.66 |
| రెండవ తరగతి (50,000—99,999) | 8 | 8.48 |
| మూడవ తరగతి (20,000—49,999) | 51 | 24 24 |
| నాలుగవ తరగతి (10,000—19,999) | 71 | 15.82 |
| అయిదవ తరగతి (5,000—9,999) | 70 | 8.74 |
| ఆరవ తరగతి (5,000 కంటే తక్కువ) | 1 | 0.06 |

## గ్రామీణ జనాభా

రాష్ట్ర జనాభాలో 29,708,939 మంది అంటే నూటికి 82.6 వంతుల మంది గ్రామాలలో నివసిస్తారు. రాష్ట్రంలో మొత్తం 27,084 గ్రామాలున్నాయి. జనాభా దృష్ట్యా విభజించబడిన వివిధ తరగతులకు చెందిన గ్రామాలలో నూటికి ఎంత మంది ప్రజలు నివసించేదీ దిగువ పట్టిక వివరిస్తుంది. 1951, 1961 వ సంవత్సరాలకు సంబంధించిన వివరాలు కూడా ఇందులో పొందు పరచబడినాయి :

| గ్రామాలు, వాటి జనాభా | ఆయా తరగతులకు చెందిన ప్రతి గ్రామంలోనూ నివసించే జనాభా శాతం. | |
|---|---|---|
| | 1951 | 1961 |
| 500 కంటే తక్కువ | 8.95 | 7.37 |
| 500—999 | 16.49 | 14.33 |
| 1000—1999 | 31.27 | 28.90 |
| 2000—4999 | 36.74 | 38.45 |
| 5000—9999 | 6.35 | 9.81 |
| 10,000 + | 0.20 | 1.14 |

రాష్ట్రంలో 4,973,616 మంది నిమ్నజాతుల వారు, 1,324,368 మంది నిమ్నతెగల వారు వున్నారు. అంటే రాష్ట్రం మొత్తం జనాభాలో నూటికి 13.8 వంతుల మంది నిమ్నజాతుల వారు, 3.7 వంతుల మంది నిమ్నతెగల వారు ఉన్నారన్నమాట. కాగా ఈ రెండు తరగతుల వారు కలిసి రాష్ట్ర జనాభాలో 17.5 శాతం మంది వున్నారు.

### పని పాటలు చేసుకునే వారు

ఇప్పటి జనాభా లెక్కలలో జనాభాను స్థూలంగా పనివారల క్రిందా, పనివారలు కాని ఇతరుల క్రిందా విభజించడం జరిగింది. పనివారలను మళ్లీ తొమ్మిది వర్గాల క్రింద విభజించారు. రాష్ట్ర జనాభాలో నూటికి 51.9 వంతుల మంది ఆర్జనపరులైనట్లు కనుగొనబడింది. ఆయా పనులలో ప్రతి దానిలోనూ నూటికి ఎంత మంది చొప్పున పనిచేసేదీ స్త్రీ పురుషుల వారీగా దిగువ పట్టికలో వివరాలు ఇవ్వబడినాయి :

| పనివారల వర్గం | మొత్తం స్త్రీలు లేదా పురుషులలో ఆయా పనులలో నిమగ్నులైన వారి శాతం | |
|---|---|---|
| | పురుషులు | స్త్రీలు |
| 1. వ్యవసాయదార్లు | 25.6 | 15.9 |
| 2. వ్యవసాయ కార్మికులు | 13.5 | 16.2 |
| 3. గనుల త్రవ్వకం, రాళ్లపని, పశువులు, అడవుల సంబంధమైన పనులు వగైరా | 2.6 | 0.5 |
| 4. గృహ సంబంధమైన పరిశ్రమలు | 6.3 | 3.7 |
| 5. గృహ సంబంధమైన పరిశ్రమకు చెందని ఇతర ఉత్పత్తులు | 2.1 | 0.5 |
| 6. నిర్మాణాలు | 1.0 | 0.3 |
| 7. వర్తక, వాణిజ్యాలు | 3.3 | 1.2 |
| 8. రవాణా, స్టోరేజి, రాకపోకలు | 1.3 | స్వల్పమాత్రం |
| 9. ఇతర సర్వీసులు | 6.5 | 3.0 |
| మొత్తం పనివారలు | 62.2 | 41.3 |
| 10. పనివారలు కాని ఇతరులు | 37.8 | 58.7 |
| మొత్తం | 100 | 100 |



పట్టణ జనాభా కంటే గ్రామీణ జనాభాలో పనివారలు ఎక్కువ మంది వున్నట్లు దిగువ ఇచ్చిన పట్టిక తెలుపుతుంది :

| | ప్రతి వెయ్యి మందిలో | | | |
|---|---|---|---|---|
| | గ్రామీణ జనాభా | | పట్టణ జనాభా | |
| | పనివారలు | పనివారలు కాని ఇతరులు | పనివారలు | పని వారలు కాని ఇతరులు |
| వ్యక్తులు | 552 | 448 | 360 | 640 |
| పురుషులు | 643 | 357 | 524 | 476 |
| స్త్రీలు | 460 | 540 | 187 | 813 |

★

# ఏలేశ్వరం త్రవ్వకాలు

మహమ్మద్ అబ్దుల్ వహీద్ ఖాన్

నల్లగొండ జిల్లా దేవరకొండ తాలూకాలో కృష్ణానది ఒడ్డునగల ఏలేశ్వరం ఇప్పుడు నిరాడంబరంగా వుండే ఒక ఆధునిక గ్రామం. ఈ గ్రామం నాగార్జున సాగర్ లోయకు ప్రక్కనే వున్న 5 చ. మైళ్ల లోయలో వుంది. ఈ రెండు లోయల చుట్టూ కొండలు వలయాకారంగా వున్నాయి. మధ్యగా కృష్ణానది ప్రవహిస్తూ ఆ రెంటిని వేరు చేస్తుంటుంది. ఆ గ్రామం ఒకప్పుడు ఇక్ష్వాకుల కాలంలో మహోజ్జ్వలంగా వెలుగొందిన నగరం. ఇక్ష్వాకువంశ స్థాపకుడు శ్రీ శాంతమూల అని కొందరి అభిప్రాయం. శ్రీ శాంతమూల శాతవాహన రాజైన రుద్రశాత కర్ణిని సింహాసనాచ్యుతుణ్ని చేసి కోస్తా, ఆంధ్ర, తెలంగాణాలలోని అతని ప్రాంతాలను స్వాధీనం చేసుకుని బహుశా క్రీ. శ. మూడవ శతాబ్దారంభంలో స్వతంత్ర రాజ్యంగా పాలించడం మొదలు పెట్టాడని వారి అభిప్రాయం. ఇక్ష్వాకుల అనంతరం ఈ లోయ ఎందరి చేతుల్లోకో మారి తుట్టతుదకు తూర్పు చాళుక్యుల హయాములో మత సంబంధమైన కార్యకలాపాలకు ముఖ్య కేంద్రంగా విలసిల్లింది. మరి కొందరు పండితులు ఈ ఏలేశ్వరం అనేది నల్లగొండలో కనుగొనబడిన ఒక శాసనంలోవున్న ఏలిశ్రీ అనే పేరునుంచి వచ్చిందని అంటారు. ప్రాచీన పత్రాలలో ఒక దానిలో ఏలిశ్రీ మూడవ ఇక్ష్వాకు వంశపాలకుడైన ఇహువుల శాంతమూల క్రింద సర్వ సైన్యాధ్యక్షుడుగా వుండినాడనీ, సర్వ దేవాధివాసమైన దేవాలయాన్ని నిర్మించినాడనీ పేర్కొనబడివుంది. ఇది సకల దేవతలకు నిలయమని ప్రతీతి. అయితే అది శివాలయమేనని డాక్టర్ బి.సి.హెచ్. ఛబ్రా అభిప్రాయం. సర్వ దేవాధివాసమంటే శివుడు వుండే స్థానమనీ సర్వ అనే పదానికి శివుడు అనే అర్థం వుందనీ, ఆయన వివరణ. శివునికివున్న వివిధ నామాలలో శర్వుడు ఒకటి. సర్వాంః శివాః స్థాణుః అనేవాటిని పోల్చి చూడండి. సర్వసేన వంటి పదాలలో సర్వ అనే పదం శివుణ్ణి సూచిస్తుంది. అది రుద్రశేన అనే దానికి సమానార్థం. రుద్రుడు అనేది శివునికివున్న పేర్లలో మరొకటి. బహుశా మొదటి శివలింగాన్ని సర్వసైన్యాధ్యక్షుడైన ఏలిశ్రీ కృష్ణానది ఉత్తర ముఖంగా మలుపు తిరిగిన చోట ప్రతిష్ఠించి వుండవచ్చు. ఆ శివునికి ఏలేశ్వరం అనే పేరు పెట్టారు. పూర్వ కాలం నుంచీ దూర ప్రాంతాల యాత్రికులను ఈ లోయలోని ఏలేశ్వరస్వామి ఆలయం అమితంగా ఆకర్షిస్తూ వచ్చింది. నాణెములు, ఇతర ప్రాచీన చిహ్నాలు యీ లోయకు పాతరాతి యుగం ఆదినుంచి మధ్య యుగం రెండో భాగం లేక ఆధునిక యుగం వరకు ఎంతో చరిత్ర వున్నట్లు తెలుపుతున్నాయి. శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు ఆ తర్వాతి పాలకులక్రింద పాతరాతి యుగం, కొత్తరాతి యుగం, లోహ యుగం మొదలైన యుగాలకు చెందిన చారిత్రక చిహ్నాలు సమృద్ధిగా లభించినట్లు ఇతర ఏ ప్రాంతంలోనూ లభించలేదు. వారి శిథిలాలలో కూడా గత మహోజ్జ్వల యుగ ప్రాభవం ఉట్టిపడుతుంటుంది. నాగార్జున సాగర్ డామ్ ప్రాజెక్టు నిర్మాణం పూర్తవగానే యీ లోయ ఒక పెద్ద జలాశయంగా ఉపయోగపడుతుంది.

ఇక్కడి సాంస్కృతిక సంపదను పరిరక్షించడానికై యీ ముఖ్యమైన స్థలంలో త్రవ్వకాలు సాగించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఏలేశ్వరంయొక్క సుదీర్ఘమైన గత చరిత్రను ఆరు విభాగాలు చేయవచ్చు. ప్రప్రథమంగా ఇక్కడ నివసించిన వారు రాతి యుగానికి చెందినవారు. వారు మృతదేహాలను భూమిలో 12 నుంచి 15 అడుగుల లోతులో పాతిపెట్టేవారు.

## త్రవ్వకం

ఏలేశ్వరం లోయకు నైరుతి దిశలో ఆలయం వద్ద అడుగు నుంచి పై వరకు త్రవ్వగా లభించిన వస్తువులను వెలికి తీయగా అవి ఆరు విభిన్న కాలాలకు సంబంధించిన చిహ్నాలుగా కనుపిం

చాయి. ఒక కాలానికీ మరో కాలానికీ ఏవిధమైన సంబంధమూ లేదు. ఫలానిది ఫలాని కాలానికి చెందిందని నిక్కచ్చిగా చెప్పడం కష్టం. అయితే విభిన్నమైన ఆధారాలనన్నింటినీ ఒక చోట చేర్చి దాదాపు కాల నిర్ణయాలు చేయవచ్చు. ఆ స్థలంలో బయటపడిన రాతి యుగానికి చెందిన మృతదేహాలు క్రీ. పూ. ఒకటి, రెండు శతాబ్దాల నాటివని గుర్తించటం జరిగింది. ఈ కాలంలో పాతరాతి యుగ ప్రజ నివసించిన ప్రదేశాన్ని తెలపటం సాధ్యపడదు కాని ఆ విషయం మృతిచెందినవారిని భూస్థాపితం చేసిన విషయంలో వాళ్ళు తీసుకొన్న జాగ్రత్తల వల్ల కొంత సూచనాత్మకంగా తెలుస్తుంది. ఈ త్రవ్వకాలలో నాలుగు రకాల సమాధులు బయల్పడినాయి. ఆ నాలుగు రకాలు యీ క్రింద వివరంగా తెలుపబడినాయి.

1. మధ్యలో చిన్నరాతి ఫలకం వున్న పేటిక. రాతి ఫలకం పేటికను రెండుగా విభజిస్తుంది. వాటికి ఎట్టి రంధ్రం వుండదు.

2. రంధ్రం వున్న పేటిక. ఈ పేటికలో మరొక చిన్న పేటిక వుంటుంది.

3. గుండ్రని పిరమిడ్ వంటి కట్టడం.

4. పెద్దలను పూడ్చడానికి వాడే మట్టి పాత్రలు.

## డెల్మనాయిడ్ పేటికలు

1. ఆలయానికి ఆగ్నేయ దిక్కుగా బౌద్ధుల కాలానికి చెందిన ఒక స్తూపం వుంది. ఆ స్తూపం యొక్క ఈశాన్య భాగంలోని వస్తువులు ఏలాంటివో తెలుసుకొనేందుకై దానిని మెల్లగా పగుల కొట్టడం జరిగింది. ఉపరితలం నుంచి దాదాపు తొమ్మిదడుగుల లోతున గ్రైనైట్‌రాయి వేసిన ఒక పెద్ద రాతి మూత వుంది. దాని పక్కనే గులకరాళ్ళతో నింపడానికి ఒక పెట్టె వంటి ఖాళీ ప్రదేశముంది. ఆ పెద్ద శిలను తొలగించిన తర్వాత పొడిమట్టి, గులకరాళ్ళవంటివి బయల్పడినాయి. వాటిని కూడా తొలగించాక ఒక డెల్మనాయిడ్ పేటిక, మధ్య గోడకట్టి రెండుగా విభజించబడ్డ పేటిక–బయల్పడింది. ఆ పేటికకు సమీపంలో నున్నగా వున్న ఒక ఎర్రమట్టి కుండ కనుపించింది. మధ్యగా వున్న గోడవద్ద ఒక చిన్న కుండ–ఎరుపు నలుపు మట్టిది– కనుపించింది. పైన తెలిపిన పేటికలో తూర్పు దిక్కుకు అభిముఖంగా వున్న భాగంలో రెండు అస్థిపంజరాలు, ఎముకల ముక్కలు బయల్పడినాయి. ఈ ఎముకల దగ్గరే రావి ఆకు ఆకారంలో ఎరుపు, నలుపు రంగులో ఒక కుండీ దానిపై గొట్టపు ఆకారంలో నల్లరంగు వేయబడిన మూత కనుపించాయి. ఆ పేటిక రెండవ భాగంలో కూడా కొన్ని ఎముకల ముక్కలు వున్నాయి. ఆ పేటికలో ఎట్టి రంధ్రాలు ఇనుప సామగ్రి కూడా లేవు.

2. అలాగే చరిత్ర దశకు ముందుదని భావించబడుతూ పైన తెలిపిన పేటిక దశలోనే వున్న మరొక డెల్మనాయిడ్ పేటిక ఏలేశ్వరస్వామి ఆలయావరణలో కనుపించింది. ఇది వాయువ్యాభిముఖంగా వుంది. అయితే యీ పేటికకు దాదాపు 16 అంగుళాల వ్యాసం రంధ్రం ఒకటి గ్రైనైట్ రాతితో పూడ్చబడి వుంది. ఈ పేటికకు పైన ఒక ఎర్రమట్టి పాత్ర, ఒక నల్ల రంగు మూత వున్నాయి. దాని ప్రక్కనే ఒక చేతి బాకు కూడా వుంది. ఈ ఎర్రమట్టి పాత్రలో కొన్ని ఎముకలు కూడా బయల్పడినాయి. ఈ పేటికపై పెద్ద శిలను తొలగించిన తర్వాత అందులో మరొక పేటిక పశ్చిమాభిముఖంగా కనపడింది. దక్షిణ భాగంలో ఉన్న పలకకు పోటీగా పై భాగం నుంచి రెండు చిన్న స్తంభాలున్నాయి. ఈ స్తంభాలలో ఒక దాని మీద విరిగిన ఎముకలున్నాయి. ఈ శవపేటిక బ్రహ్మగిరి రాతియుగ కాలం నాటి శవపేటికవలె వామ వర్తులంగా కాక దక్షిణ వర్తులంగా స్వస్తిక ఆకారంలో వుంది. రెండు పేటికల్లోనూ అడుగు భాగంలో రాతి పలకలున్నాయి. చిన్న రాతి పలక కాస్త యెత్తులో అమర్చబడి వుంది. బ్రహ్మగిరి, మస్కీల్లోలాగానే సమాధులను మళ్లీ మళ్లీ ఉపయోగించినట్లు సాక్ష్యాధారాలు యిక్కడేమీ లేవు.

## గుండ్రని పిరమిడ్ వంటి కట్టడం

ఇటీవలి త్రవ్వకాలలో దేవాలయం వద్ద ఒక స్తూపాన్ని భూమట్టం నుంచి 7 అడుగుల లోతు దాకా త్రవ్వడం జరిగింది. అక్కడికి దక్షిణ భాగంలో రెండు పెద్దరాతి మూత పలకలు కనిపించాయి. వాటిపైన అస్తవ్యస్తంగా చిన్నచిన్న రాళ్ళు పేర్చబడి వున్నాయి. స్తూపం అడుగు భాగాన్ని పగులకొట్టి, రాతి మూతను వెలికి తీయగా, అందులో పగిలిపోయిన ఒక ఎర్రటి కుండ కనిపించింది. ప్రక్కనే ఒక ఎముక కూడా వున్నది. ఇది బహుశా గుఱ్ఱం యెముక అయివుండవచ్చు. ఈ రాతిమూతలన్నీ పిరమిడ్ ఆకారంలో ఒక చోట పేర్చబడి వున్నాయి. వాటిపైన వున్న మట్టిని, కంకర రాళ్లను, చిన్నచిన్న తెల్లని గులకరాళ్లను తీసివేయగా ఉత్తర దక్షిణాలుగా పొడుగైన గుండ్రని పిరమిడ్ వంటిది ఒకటి కనిపించింది. గుంట పొడవు $8\frac{1}{2}$ అడుగులు, వెడల్పు $3\frac{1}{2}$ అడుగులు, లోతు సుమారు $3\frac{1}{2}$ అడుగులు. అందులో మట్టితో తయారైన వస్తువులు ముఖ్యంగా వర్తులాకారంలో వున్న ఒకస్టాండు. చిన్నగాజు స్టాండు, వట్రువ ఆకారంలో వుండి పొడువైనమూత

గల కూజా బయటపడినాయి. ఇవన్నీ నల్లరంగులో వున్నాయి. పర్షియన్ పింగాణీ పాత్రలకూ వీటికీ మధ్య సన్నిహితమైన పోలిక ఉన్నట్లు తెలుస్తున్నది. ఏలేశ్వరంలో లభించిన పుర్రెలను గూర్చి కలకత్తాలో మానవ శాస్త్ర శాఖలో పనిచేస్తున్న శ్రీయుతులు పి. గుప్తా, పి. సి. దత్తా తమ అభిప్రాయాల్ని ప్రచురించారు.— (ఇండియాలో మానవుడు సంపుటి 42 సంఖ్య 1) అందులో మానవుని పుర్రెల తీరు తెన్నులను బట్టి ఈ తెగకు చెందిన వారి పూర్వీకులు ఇతర దేశాలకు చెందినవారై వుండవచ్చునీ, సియాల్‌క్రాతి యుగపు నిర్మాతలతో పోలికలు దగ్గరగా వున్నాయనీ, సైకితో ఇరానియన్ వర్గానికి చెందినవారనీ వారు అభిప్రాయం వెలిబుచ్చారు. పర్షియన్‌లు ఇనుమును భారతదేశానికి తీసుకొని వచ్చారని డాక్టర్ వీలర్ అభిప్రాయం. వర్తులాకారంలో ఉన్న స్టాండుకు త్రిభుజ, చతురస్రాకారపు డిజైనులలో చిన్న రంధ్రములు తొలచబడివున్నాయి. స్టాండు మీద 1 అడుగు 2 అంగుళముల వ్యాసమున్న పెద్ద పళ్లెమును వుంచవచ్చును. స్టాండు ప్రక్కలు నిటారుగా వున్నాయి. పళ్లెం పైన పిడికల మూత వుంది .మూతపైన సన్నని గీతలు క్రాసు ఆకారంలో వున్నాయి. ఇవే కాక రకరకాల అంచులతో పాత్రలు నలుపు, ఎరుపు రంగుల్లో రావి ఆకు ఆకారంలో కుండీ కూడా బయటపడినాయి. తేలికైన ఎరుపు రంగులో ఉండి చేతితో పట్టుకొని పోవడానికి వీలైన పాత్రకూడా కనుగొనబడింది. వర్తులాకారంలోవున్న స్టాండు ఆహార పదార్థాలను వేడిగా వుంచేందుకై ఉపయోగపడుతూ వుండవచ్చని తోస్తున్నది. శవాలను ఖననం చేసే చోట మరో విషయం కనిపించింది. కుండ పాత్రల క్రింద ఒక దానిపైన ఒకటి వున్న అస్థిపంజరాలు కామ దృశ్యాన్ని తెలిపే విధంగా వున్నాయి. ఇది విచిత్రమైన విషయం. నాకు తెలిసినంత వరకూ భారత దేశంలో కానీ, మరే దేశంలో కానీ యిటువంటిది యెక్కడా లేదు. లోతాల్ లోనూ ఏలేశ్వరంలోనూ అస్థిపంజరాలు ప్రక్క ప్రక్కనే వున్నాయి కాని ఒకదానిపైన మరొకటి లేవు. తాంత్రికమైన ఆచారాలతో వీటికి సంబంధం వుందని అనుకోవడానికి వీలులేదు. సహగమనం చేసిన భార్యభర్తల అస్థిపంజరాలు కావచ్చు. లేదా వ్యభిచారం చేసిన స్త్రీ పురుషులకు విధించిన శిక్షవల్ల ఇవి యీ విధంగా వుండవచ్చు. ఏది ఏమైనా యీ విషయంతో ఇదమిద్ధమని నిర్ణయం చేయడం కష్టం. తగిన ఆధారాలు లేనందు వల్ల యీ విషయంలో ఊహాగానాలు చేయకూడదు. ఈ అస్థిపంజరాలకు కుడి ప్రక్కన గుంటకు ఎడమవైపున $5\frac{1}{2}$ అడుగుల పొడవుగల ఈటె తునాతునకలైవుంది. ఈటె పై భాగంలో మేకుపలె ఉన్న ఒక చీల, బాకు అమర్చబడివున్నాయి. గుంటకు దక్షిణ భాగంలో కొన్ని ఎముకలు కనిపించాయి. బహుశా యివి గుత్తానివై వుండవచ్చును. ఒక్క చోటనే ఖననం చేయబడిన మానవ అస్థిపంజరాలను బట్టి, భగవంతునిలో ఐక్యం కావాలనే కాంక్ష ఆ కాలం వారిలో వున్నట్లు మనం భావించవచ్చు. భగవదన్వేషణకై పాటుపడే వారనీ, భగవంతుడు నిత్యమయుడని వారు విశ్వసించారనీ వీటిని బట్టి మనం తెలుసుకోగలం. ఇలాంటి భావాలన్నీ దృష్టిలో వుండబట్టే, ఇవి భగవద్విలాసమైన సంసారం, నిర్వాణములలో ప్రస్ఫుటమై వున్నాయి. శరీరంలోని మలమాంసాదులను తీసివేసిన తరువాత అస్థికలు గుంటలో పూడ్చబడివున్నాయి. అడుగు భాగంలో రెండు అంగుళాల దళసరిలో బూడిద వుంది. దానిపైన ఇవి కనుపించాయి.

## అస్థిక పాత్రలు

స్తూపానికి వాయవ్యదిశన చరిత్రాత్పూర్వక కాలానికి చెందిన అస్థికలపాత్ర ఒకటి కనిపించింది. వయస్సు వచ్చిన వ్యక్తి అస్థిపంజరపు ఎముకలు ఒక ఎర్రని కుండవంటి పాత్రలో వున్నాయి. కుండ మూతమీద బోర్లించిన గిన్నెవుంది. దానిపై 2 అడుగుల $1\frac{1}{2}$ అంగుళం పొడవు గల రాతితో చేయబడిన మూత వుంది. కుండలోపల ఎముకలతో పాటు ఒక బాకు నలుపు ఎరుపు వర్ణములో రెండు పాత్రలు ప్రక్కకు ఒరిగి వున్నాయి.

ఆలయానికి ఉత్తర దిశలో మరొక శవపేటిక కనిపించింది నలుపు ఎరుపు రంగు పాత్రలు, ఉలి లేక కత్తిని పోలిన ఇనుప పరికరాలు అస్థిపంజరానికి కుడి ప్రక్కన వున్నాయి.

రాతి గోరీలలో లభించిన ఇనుప వస్తువులన్నీ చాలా వరకు ఆయుధ పరికరాలే. ఆ కాలపు ప్రజలు కయ్యానికి కాలుదువ్వే వారనీ, సదా యుద్ధానికి సంసిద్ధులైవుండే వారనీ, వీటిని బట్టి ద్యోతకమవుతుంది. ఆ కాలంలో పదునైన ఇనుప వస్తువులు విరివిగా ఉండడం గమనిస్తే, ఇనుప రాళ్లను త్రవ్వి, వాటిని కరిగించి పోత పోయడంలో ఆ కాలం ప్రజలు నిపుణత కలవారని తెలుస్తుంది.

ఈ త్రవ్వకాలను పరిశీలించి చూస్తే, చరిత్రాత్పూర్వపు కాలంనుంచి ప్రజలు ఈ లోయ ప్రాంతంలో నివసించారని తెలుస్తున్నది. వారు క్రీస్తుపూర్వం 2వ శతాబ్దం మధ్యలోనో, మొదటి శతాబ్దంలోనో నివసించి వుంటారని చెప్పవచ్చు. * * *

అక్టోబరు 1 : కేంద్ర రవాణా, కమ్యూనికేషన్ల మంత్రి ఉదక మండలంలో యాత్రికాభివృద్ధి మండలికి ప్రారంభోత్సవం చేశారు.

అక్టోబరు 6 : మహారాష్ట్ర గవర్నరు డాక్టర్ పి. సుబ్బరాయన్ కొద్ది రోజులుగా అస్వస్థులుగా ఉండి స్వర్గస్థులయ్యారు.

అక్టోబరు 11 : మూడురోజుల పాటు జరిగిన విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షుల సమావేశాన్ని కేంద్ర విద్యా మంత్రి ప్రారంభించారు.

అక్టోబరు 12 : ద్వితీయ అఖిల భారత సెకండరీ విద్యా సమావేశం కటక్‌లో ప్రారంభమైంది.

అక్టోబరు : 17 గృహ నిర్మాణ శాఖా మంత్రుల సప్తమ సమావేశాన్ని న్యూఢిల్లీలో ప్రధాన మంత్రి ప్రారంభించారు.

అక్టోబరు 18 : రెండు రోజులపాటు జరిగిన రాష్ట్ర విద్యా మంత్రుల సమావేశం న్యూఢిల్లీలో ప్రారంభమైంది.

అక్టోబరు 20 : మెక్‌మెహాన్‌రేఖకు దక్షిణంగా భారత, చైనా దళాలకు మధ్య తీవ్రమైన పోరాటం జరిగింది.

విదేశాలలో

సెప్టెంబరు 22 : బ్రిటన్‌లో పత్రికలకు సంబంధించిన ఒక రాయల్ కమీషను తన నివేదికలో బ్రిటన్‌లోని వార్తా పత్రికలకు ఏ విధమైన సబ్సిడీ యివ్వకూడదని తెలిపింది.

నేపాల్ విదేశాంగ మంత్రి శ్రీ ఋషీకేశ్ షాను మంత్రిమండలి నుంచి తొలగించారు.

సెప్టెంబరు 26 : స్వతంత్ర ఆల్జీరియా పార్లమెంటు ప్రప్రథమ సమావేశం జరిగింది.

సెప్టెంబరు 27 : వాషింగ్టన్‌లో హాన్‌ఫార్డ్ వద్ద ప్రపంచంలో కెల్లా బ్రహ్మాండమైన ఒక అణు విద్యుదుత్పత్తి కేంద్రాన్ని నిర్మించడానికి సంబంధించిన శాసనంపై అమెరికా అధ్యక్షుడు కెన్నెడీ సంతకం చేశారు.

సెప్టెంబరు 29 : శ్రీ మహమ్మద్ బెన్‌బెల్లా నాయకత్వాన ఏర్పడిన 19 మంది సభ్యులు గల మంత్రివర్గాన్ని ఆల్జీరియా పార్లమెంటు అత్యధిక ఓట్లతో ఆమోదించింది.

అక్టోబరు 5 : జనరల్ డిగాల్ తలపెట్టిన రాజ్యాంగ సంస్కరణలపై వచ్చిన అభిశంసన తీర్మానం నెగ్గగా ఫ్రెంచి ప్రభుత్వం పడిపోయింది.

అక్టోబరు 6 : భారతదేశంలో ఐదు రోజుల పాటు అధికార హోదాలో పర్యటించడానికి మెక్సికో అధ్యక్షులు న్యూఢిల్లీ వచ్చారు.

---

# “రసభావ బంధురమైన రత్నం”

## భీమన్న నవరచన

**గ్రంథ సమీక్ష**

అనాది కొన నుంచి అనంత తత్వంలోకి:— రచయిత శ్రీ బోయి భీమన్న. ప్రాప్తిస్థానము-సాహితీ లత ప్రచురణలు, 20, బాచులర్స్ క్వార్టర్స్, మోజంజాహి మార్కెట్ రోడ్, హైద్రాబాదు-1. వెల రూ 4/—

ఆధునికాంధ్రకవులు పాశ్చాత్యుల ననుకరించుచు చేయుచున్న నవ్య ప్రయోగములలో వచనగేయమొకటి. గణయతి ప్రాసల నియమ మేమియులేని స్వేచ్ఛారచన యిది. అభ్యుదయ కవులు పలువురిట్టి రచనలే కావించుచున్నారు. శ్రీ భీమన్న గారింతవరకు ప్రచురించిన కావ్యములను సలక్షణములైన పద్యములందో గేయములందో మాత్రమే వ్రాసినను ఈ నూత్న కావ్య సంపుటియందలి కావ్యములన్నిటిని వచన గేయములందే రచించినారు. ఇందు కొంచెము తక్కువగా నూరు వచన గేయములున్నవి.

ఇందలి ఖండ కావ్యములలో పెక్కు-ఆత్మాశ్రయములైన ప్రణయ గేయములు; కొన్ని ప్రకృతి వర్ణనాత్మకములు; కొన్ని తాత్త్వికములు; కొన్ని అర్థాంతర గర్భితములు; కొన్ని వ్యంగ్య హేళనాత్మకములు. ఇందేజాతికి చెందినను అన్ని గేయములందు అజ్ఞాతయైన ఒక 'ప్రేయసి' చోటు చేసికొనుచుండును. శ్రీ భీమన్న గారుపోద్ఘాతములో సూచించినట్లామె సందర్భమును బట్టి ఆత్మతా పరమాత్మతల నవలంబించు నద్భుత వ్యక్తి. కావ్యారంభమున నీరాజన మెత్తబడినదీమెకే కావచ్చు లేదా యీమె దేనికి ప్రతి రూపమో ఆ పరమాత్మకు కావచ్చును.

ఆ ప్రేయసి ప్రేమమూర్తి. ప్రేమనుండి తొలగించినచో ఆమె లేదు. ఆమెకును కవికిని అవినాభావము. ఆమె నుండి తొలగించినచో అతడు లేడు. ఆమె అతని పూజాజ్యోతి. అతని రసకవితా కోకిల కామె వసంతశోభ. ఆమె సార్వత్రిక సౌందర్య జ్యోత్స్నలో అతడు జాబిల్లి. ఆమె సర్వార్తవసమాహార సౌందర్య శారద అగుటచే అతడామెకు ప్రేయసి అను సంకేతము చేసినాడు. అతని ఆనందమునకామెను గూర్చి ఆలోచించుటయే ఉదాహరణము. ఆమె వియోగమతనికి దుర్భరము. పూర్ణానుభూతి కొఱకే కాక పూర్ణస్వేచ్ఛ కొఱకు కూడ ఆమె సాన్నిధ్య మతనికవసరము. అతడామెకై యేమైనను భరించును; ఏమైనను త్యజించును. ఆమె అతనికి సత్యశివసుందరమూర్తి. వారిరువురు నాత్మైక్యము పొందిన కతమున ఒకరిలో నొకరై మహాకావ్యముగా రూపొందజాలినారు. ఈ విధముగా నిందలి ప్రణయగేయములన్నిటిలో కవి నిశితము, గాఢము, అసాధారణము అయిన ప్రేమ విశేషమును ప్రకటించును. ఇంత ప్రేమకు పాత్రమైన ఆ ప్రేయసిని ఊర్వశీ మేనకారంభాదులను వలెనే లోకమేమనియైననవచ్చును. దానికసహనమే కారణమగుటచే నామే యేమియు దిగులు పడనవసరము లేదు. ఏమన కవి ఊహలో " ప్రణయం పవిత్రం ప్రకృతికి—ఆనందం అమృతం జీవితానికి. "

నీకేసి, నిజమే కాని, నీకళ్లలో నాక్షేమం మున్నగు గేయములు ప్రేయసిని గూర్చియే వ్రాయబడినను అందు పరమాత్మ సంబంధము కూడ వ్యంజితమగుచున్నది. అందుచే సూక్ష్మముగా పరిశీలించినప్పుడే ప్రేయసీ ప్రణయము కేవలకామపూరితము గాక బ్రహ్మానంద రసానుభూతి పరిపూర్ణముగా గోచరించును.

ఇందలి ప్రేయసికి శ్రావణి, శరత్ప్రభ, ఫాల్గుని, వైశాఖి మున్నగు ముద్దు పేర్లున్నవి. వీరందరెవరని కవిని నిశితముగా ప్రశ్నించువారును లేకపోలేదు. ''ఆది ఎవరో యెందుక్కా-వాలి నీవే ఎందుకు కాగూడ"దని కవి సమాధాన మట్లడుగు నారాధ్యదేవతకు. ఎవరి కొఱకు తాను పూజా పుష్పాలు పెంచు కొని యుండెనో వారిని తనకు దూరము చేసి ఆ పూవులు తమ పూజకు తన్ను మలపుకొనుచున్నవని కవి వేదన. దౌర్జన్య ప్రాబల్యానికి భౌతిక దేహము లొంగినను హృదయము కరుగ దనియు-హృదయము కావలసినచో జాలిపడుటయు, ఆత్మ కావల సినచో ఆరాధించుటయు నవసరములనియు కవి తన ఆరాధ్యదేవత కిచ్చు నుపదేశము. పరులతో పోల్చుకొని యేడ్చుట నరకమనియు తన్నుదిద్దు కొనుటయే స్వర్గమనియు, త్యాగమే సుకృతమునకు గుర్తనియు, అసూయ అబలత్వానికి చిహ్నమనియు కవి భావము. ప్రేయసిని విడువలేక ఆరాధ్యదేవతననునయించలేక కవి అనుభ వించు మనోమథన మీగేయములలో ప్రకటిత మగుచున్నది.

తాత్త్విక గేయాలు భావగంభీరములుగా నున్నవి. కవికి లోకమునెడగల భావములనివి వ్యక్తముచేయుచున్నవి. "సర్వరసభావ సౌందర్యాలకు మహాకావ్యం శరీరం-దాని తృప్తే సంతృప్తి సమస్తానికీ" అని కవి భావము. "నాది కాని సౌందర్యం, నాకు గాని రసానుభూతి, ఎంత వుండి ఏం లాభ" మని:అతని ప్రశ్న "హృదయాన్ని రంజించేది ప్రణయమేకాని ప్రాభవం" కాదని అతని అనుభవము. "పనిని బట్టి విలువ-స్థానాన్ని బట్టి పేరు-వ్యక్తిత్వాన్నిబట్టి సాఫల్యం" కలుగుచుండగా ఈ అధికత్వాల్పత్వ కురుక్షేత్ర మేలదుకని అతని ఆవేదన. భూత భవిష్యత్తులకై భయపడక వర్తమానపు వ్యాసభూమిలో చీకటి పొలి మేరల నడుమ వెలుగు పొడుగున అటునిటు కేరము త్రొక్కుచు గతము నుండి నవజీవనమును భవిష్యత్తునకు తోడి పోయు కృషీవలునివలె నుండవలెనని అతని ఊహ. పాత చింతకాయ పచ్చడి నంజుకొనుచు చప్పిడి పథ్యము చేయు ఛాందస సాహిత్య కులకు ప్రకృతి సిద్ధమైన సౌందర్య విశేషము రుచింపదని అతని అభిప్రాయము. అది వారికే నష్టము "వాన కోయిల గుర్తించక పోతే వసంతవనం వికసించదా" అని అతని ఆత్మానునయము, గృహమొక అజ్ఞానపు గూడని సన్న్యసించిపోవు కాషాయవస్త్ర ధారులపై నతనికభిమానము లేదు. స్త్రీ పురుష సంబంధము మహా పాపమని చెప్పు నీతి పాలు త్రాగి రొమ్ము గ్రుద్దుటవంటిదనియు, నిరంకుశులు ఆచరణ సాధ్యము కాని నీతిని విధించి అవినీతిని పెంచివేసినారనియు అతని దృఢ విశ్వాసము. ద్వైధీపీలలో అతని తాత్త్విక భావములు చక్కగా ప్రకటింపబడియున్నవి.

ఇందలి వర్ణనాత్మక గేయములు కవి ప్రకృతి పరిశీలనను భావపుష్టిని, వ్యక్తీకరణ లాఘవమును వెలిపుచ్చుచు రమ్యములుగా నున్నవి. చెలరేగిన ప్రకృతి, రేయి, హేమంతనిశీథం, ఫాల్గుని ద్వైధీపీల, వాసక సజ్జిక, కోరుకొన్న అతిథి. పూదోట పురిటి గదిలో-అనుగేయములు పఠించిన నీ విషయము వెల్లడియగును. వీనిలో పెక్కు చోట్ల కవికి గల ఖగోళశాస్త్ర పరిజ్ఞానము వెల్లి విరియుచున్నది. వాని కుపోద్ఘాతములో కవిగారు చక్కని సంక్షేప వ్యాఖ్యానము చేసియున్నారు. నక్షత్ర రూపములను భావోచితముగా గేయములందిముడ్చుట ప్రశంసనీయముగా నున్నది.

కవి అత్యంత సౌందర్యాభిమాని. ఆ సౌందర్యాభిమానము సౌందర్యకాంక్ష, ఉన్న అందాన్ని చెఱపకు అనుగేయములలో ప్రతి ఫలించుచున్నది. జీవిత పుణ్యక్షేత్రమను గేయములో ఆంధ్రభూరమాహంసోత్తరీయమైన వైనతేయము వర్ణింప బడినది. ఇందుకవి అభిజనాభిమానము సువ్యక్తమగుచున్నది. విజ్ఞానయుగము విలయ వైభవమని కవిగారి అభిప్రాయము, ఆ గేయములో ఈ యుగమున క్రియాశూరతకన్న వాక్శూరతమిన్న అని అన్యాపదేశముగా చెప్పబడినది. ద్వైధీలీలలోని "శంకర శిఖరాగ్రంపై నిల్చివున్న" అను భాగములో కవి యోగ విజ్ఞాన పరిచయము వెల్లడి యగుచున్నది.

''లోకంతీరు" "నీకళ్లల్లో నాక్షేమం" "తారతమ్యం" మున్నగునవి అన్యాపదేశ రచనలు. వానిలో నిశితమైన విమర్శ దాగి యున్నది. ''మిత్రులవలె కనిపిస్తాయి, శత్రువులై పీడిస్తాయి, పయోముఖ విషకుంభాలు గోముఖ వ్యాఘ్రాలు ఈ కోరికలు" మున్నగు గేయములిందుకు నిదర్శనములు. ''మనిషికి మార్గం మనసే" మున్నగు గేయములలో అప్రస్తుతవర్ణనచే ప్రస్తుత వస్తువు ద్యోతితమగుచున్నది.

ఇందు కొన్ని చక్కని వ్యంగ్య రచనలున్నవి. అందలి గేయములు — గంభీరమైన అర్థాంతరమును స్ఫురింపజేయు చున్నవి. గాలిపటం—రైలు ప్రయాణం అను గేయములిందుకు చక్కని ఉదాహరణములు. "మనోరథం—వసంత రచన—పుట్టు పూర్వోత్తరాలు—ఒక జత దుస్తులు—కాటుకకలలు—హద్దు ల్లేవా — నిరయాగ్నికొలిమి — అను కావ్యములుదాత్తభావ

సంపన్నములై పఠితలందు నూత్న చైతన్యమును ప్రేరేచు మంచి రచనలు. "ఇవతలి వొడ్డుకు—జీవిత పుణ్యక్షేత్రము—ద్వైధీ లీల"——మున్నగునవి దీర్ఘములైన కావ్యములు. కొన్ని గేయము లలోని భావములతిగూఢములుగా నుండుటచే బహువారములు చదివి అవగాహనము చేసికోదగియున్నవి.

గేయముల రచనలో సర్వత్ర ఒక నిగ్గు కనిపించుచున్నది. గణ యతిప్రాసాదులు లేకపోయినను వానిలో అదృశ్యమైన ఒక లయ గోచరించుచున్నది. భాష ఆద్యంతము సరళ సుకుమారముగా నున్నది, శైథిల్యత—ఆధిక్యత వంటి పదములు, సరస్విని. రాజీవని. ఉషస్విని వంటి ప్రయోగములు కొన్ని ఉన్నవి. మేఘాండ భూతివంటివి కవిగారు క్రొత్తగా సృజించిన పదబంధములు. "పందెంలోగెలవలేని సూర్యునికందిన చెమట ముఖంలా" "చీకటి పచ్చగడ్డివి వేగుచుక్క గడ్డిగంపలో కూరుతన్న ఉషఃకన్యలా" "విశ్వవస్తు ప్రదర్శనంలో స్త్రీల ప్రత్యేక దినంలా వుంది నభం" వంటి చక్కని ఉపమానములు కవి భావనా పటిమను సూచించుచున్నవి. కొన్నిచోట్ల "భావోదయ శిఖర పతత్ప్రాకరస్రవత్ప్రిస్తులు" వంటి దీర్ఘ సమాసము లున్నవి. కాని అట్టివాని సంఖ్య చాల తక్కువ. మధురమంజులమైన తెలుగు నుడికారముల సొగసులు కావ్యమందంతట కనిపించుచున్నవి. "రచన రసభావ బంధురం కాకపోతే ప్రత్యంశం సౌందర్యం నిండకపోతే——అందులో ఏలా విహరిస్తావు నీవు" అని ప్రేయసిని గూర్చి కవిగారి భయము. అందుచే ఆమె చుట్టును అల్లబడిన యీ గేయలతాజాలములలో ప్రత్యంశము రసభావ బంధురము చేయబడినది.

ఈ జాతి కావ్య వర్గమున ఒక ప్రశస్త రత్నముగా భాసించు ఈ గేయ సంపుటి మన ముఖ్యమంత్రులు శ్రీ డా. నీలం సంజీవ రెడ్డిగారిని వలచుట "పడియారు వన్నె బంగారమునకు పద్మరాగము తోడి" సంపర్కమును తలపించుచున్నది.

దివాకర్ల వెంకటావధాని

---

# ర చ యి త లు

డాక్టర్ నీలం సంజీవరెడ్డి—ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. హైదరాబాదు.

శ్రీ రాయప్రోలు సుబ్బరామయ్య. వేములకోట. మార్కాపురం తాలూకా, కర్నూలు జిల్లా.

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. ఆర్థిక, సహకారశాఖల మంత్రి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

"ఉదయభాను", హైదరాబాద్.

శ్రీ బి. వి. కుటుంబరావు, ఎం.ఎ.,తెలుగు లెక్చరర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్—7.

కవిరాజు శ్రీ కొండవీటి వెంకటకవి, పొన్నూరు, గుంటూరు జిల్లా.

శ్రీ బి. కృష్ణమూర్తినాయుడు, బి.ఏ., డి.ఎస్.ఎస్.ఏ., హైదరాబాద్.

శ్రీ జి. భాను, బి.ఏ., (ఆనర్స్), వి. యస్. ఆర్. కాలేజి, తెనాలి, గుంటూరు జిల్లా.

శ్రీ జి. జోసపు, గోకనకొండ. వినుకొండ తాలూకా, గుంటూరు జిల్లా.

శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు, ఖర్గపూర్.

డాక్టర్ యం. చెన్నారెడ్డి, ప్రణాళికా శాఖా మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

"మహాఫణి", హైదరాబాద్.

డాక్టర్ గిడుగు వెంకటసీతాపతి, ఖైరతాబాద్. హైదరాబాద్,

శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ, ఎం.ఏ., ప్రాచ్యభాషా శాఖాధిపతి, హిందూ కళాశాల. గుంటూరు.

"శ్యామ్‌ప్రసాద్" హిమాయత్‌నగర్, హైదరాబాద్.

శ్రీ ఏ. మురళీధర్, లా కాలేజీ, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్.

శ్రీ మహమ్మద్ అబ్దుల్ వహీద్‌ఖాన్, డైరెక్టర్, పురావస్తు శాఖ, హైదరాబాద్.

గ్రంథసమీక్ష

డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, ఎం.ఏ.,పి.హెచ్‌డి. తెలుగు రీడర్. ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్.

# సహకారోద్యమానికి చేయూత

(5 వ పేజీ తరువాయి)

సంఘాల ద్వారా, భూమి తనఖా సహకార సంఘాల ద్వారా లభింప జేయడానికి 1961 జూలై నుంచి సంపూర్ణ ఋణ సహాయ పథకాన్ని అమలుపరుస్తున్నారు.

30,000 ఎకరాల విస్తీర్ణాన్ని తరీ సేద్యం క్రిందికి తేవడానికై మూడుసంవత్సరాలలో రూ. 75 లక్షల మేరకు దీర్ఘకాలిక ఋణాలు లభింపజేయడానికీ, మొదటి మూడు సంవత్సరాలు వరుసగా రూ. 8 లక్షలు, 16 లక్షలు, 24 లక్షల మేరకు స్వల్పకాలిక ఋణాలు ఇవ్వడానికి, ఈ పథకం తలపెట్టుతున్నది. ప్రభుత్వహామీపై స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా దీర్ఘకాలిక పరపతి సౌకర్యాల కార్యక్రమాలకు పెట్టుబడి పెట్టే నిమిత్తం అపెక్స్ భూమి తనఖా బ్యాంకుకు రూ. 25 లక్షల ఋణం మంజూరుచేసింది. 1962 మార్చి వరకు రూ. 18 లక్షల మేరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వడం జరిగింది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మంజూరు చేసిన ఋణంలో నుంచి వినియోగమైన మొత్తాన్ని భర్తీ చేయడానికి అపెక్స్ భూమి తనఖా బ్యాంకు ప్రత్యేక అభివృద్ధి డిబెంచర్లను జారీ చేసింది.

వ్యవసాయదార్ల పరపతి అవసరాల విషయమై తెలుసుకునే నిమిత్తం రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియాకు చెందిన ఒక ప్రతినిధి నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో పర్యటించారు. ప్రాజెక్టు ప్రాంతంలో సహకారాభివృద్ధికై ఒక "బృహత్ ప్రణాళిక" ను రూపొందించడానికి ప్రతిపాదించారు.

## మార్కెటు సదుపాయాలు

సహకార సంఘాల సభ్యుల వ్యవసాయోత్పత్తుల విక్రయానికి తగు ఏర్పాట్లు జరగనిదే సహకార పరపతి సౌకర్యాల విస్తృతీకరణ కార్యక్రమం విజయవంతం కాజాలదు. అందువల్లనే, రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ విషయంలో తగు చర్యలు తీసుకోవడం జరిగింది.

రెండవ ప్రణాళిక ఆఖరు వరకు 196 ప్రాథమిక మార్కెటింగ్ సంఘాలు, 15 జిల్లా సంఘాలు, ఒక అపెక్సు సంఘం ఉన్నాయి. మూడవ ప్రణాళిక కాలంలో క్రొత్తగా 40 ప్రాథమిక సంఘాలను ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. 1961–62 వ సంవత్సరంలో 12 సంఘాలను ఏర్పాటు చేశారు. అన్ని సంఘాలలోనూ తగినంత వాటా ధనాన్ని పెట్టుబడి పెట్టడమే గాక రెండవ ప్రణాళిక కాలంలో 549 ముఖ్య సహాయకగోదాముల నిర్మాణానికి ఆర్థిక సహాయం అందజేయడం జరిగింది. ప్రత్తి యంత్రాలు, వేర్లు శనగవిత్తులు తీసే యంత్రాలు, బియ్యం వగైరాల వంటి 73 ప్రొసెసింగ్ యూనిట్లను నెలకొల్పడంలో ఆర్థిక సహాయంకూడా అందజేశారు. మూడవ ప్రణాళిక కాలంలో అదనంగా 660 గోదాములు, 50 ప్రొసెసింగ్ యూనిట్లను నెలకొల్పాలని నిర్ణయించారు. సభ్యుల ఉత్పత్తులపై ఋణాలు జారీచేయడం, వారి ఉత్పత్తుల అమ్మకం, ఎరువుల పంపిణీ, యితర ఉత్పత్తి అవసరాలను తీర్చడమే యీ సంఘాల ముఖ్య కార్యక్రమాలు. మూడవ ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో మార్కెటింగ్ సహకార సంఘాల ద్వారా సభ్యుల ఉత్పత్తులను రూ. 23 కోట్ల మేరకు అమ్మకం జరపాలని అంచనా వేశారు.

## ఎరువుల పంపిణీ

ఎరువుల పంపిణీ పథకాల నిర్వహణలో సహకార సంఘాలు నిర్వహించిన పాత్ర పేర్కొనదగినది. నత్రజని ఎరువులన్నింటి పంపిణీ బాధ్యతను సహకార సంఘాల పరం మాత్రమే చేయడం జరిగింది. అన్ని ముఖ్య గ్రామాలలో మార్కెటింగ్, గ్రామీణ సహకార సంఘాలు ప్రారంభించిన చిల్లర డిపోల ద్వారా యీ ఎరువులపంపిణీ జరుగుతుంది. ప్రస్తుత సంవత్సరంలో రూ. 10 కోట్లు విలువ చేసే దాదాపు 2.74 లక్షల టన్నుల ఎరువులను సహకార సంఘాలు పంపిణీచేయాల్సి ఉంది. లోగా తెల్పినట్టు ఎరువుల పంపిణీ, ఇనుము, ఉక్కు పంపిణీ పథకాలను సహకార ఎపెక్సు బ్యాంకులు అమలుపరచడానికై స్టేట్ బ్యాంకు ఆఫ్

ఇండియా నుండి రూ. 2.70 కోట్లు రుణంగా పొందడానికి వీలుగా రాష్ట్ర ప్రభుత్వం హామీ వహించింది.

చక్కెర ఉత్పత్తిదారులు స్వయంగా సహకార పద్ధతిలో సహకార చక్కెర ఫ్యాక్టరీలను విజయవంతంగా నెలకొల్పడం సహకార రంగంలోని ముఖ్య విశేషం. యీ ఫ్యాక్టరీల నిర్వహణను ఉత్పత్తిదారులే వహిస్తారు. ఏటికొప్పాకలోని సహకార చక్కెర ఫ్యాక్టరీయే గాక ఆముదాల వలస, చోడవరం, చిత్తూరు, పాలకొల్లు, నిజామాబాదులలో ఐదు సహకార చక్కెర ఫ్యాక్టరీలను ప్రారంభించడానికి లైసెన్సులు జారీ చేయడం, రెండవ ప్రణాళిక క్రింద వాటికి సహాయం చేయడం జరిగింది. మొదటి నాలుగు ఫ్యాక్టరీలు (నిజామాబాదు మినహా) 1962_63 సంవత్సరం నుండి బహుశా ఉత్పత్తిని ప్రారంభిస్తాయి. అంతేగాక 400_500 టన్నుల చెరకు పిండే శక్తిగల రెండు లఘు యూనిట్లు గల చక్కెర ఫ్యాక్టరీలను సహకార పద్ధతిపై నెలకొల్పారు. తుమ్మపాల, తునిలలో వీటిని ప్రారంభించారు. యివి ప్రణాళికలో చేరనివి మాత్రమే కాక ప్రభుత్వ ఆర్థిక సహాయం కూడా లేకుండా వీటిని నెలకొల్పారు.

ప్రణాళిక క్రింద నెలకొల్పబడిన ఐదు సంస్థలకు ఒక్కొక్కదానికి రు. 20 లక్షల వరకు వాటా ధనాన్ని ప్రభుత్వం అందజేసింది. నిర్మాణ దశలో అభివృద్ధిచెందుతున్న ఆముదాలవలస, చిత్తూరు, చోడవరంలలోని మూడు ఫ్యాక్టరీలకు 1961_62వ సంవత్సరంలో రూ. 5 లక్షల చొప్పున ప్రభుత్వం యిచ్చింది. 1962_63వ సంవత్సరంలో పాలకొల్లులోని చక్కెర ఫ్యాక్టరీకి కూడా యిదే విధంగా రూ. 5 లక్షలు యివ్వడానికి కేటాయింపులు జరిగాయి. నిజామాబాదులో స్థాపించబడే చక్కెర ఫ్యాక్టరీకి కూడా అవసరమైనప్పుడు సహాయం చేయడానికి పరిశీలించడం జరుగుతుంది. యీ సంస్థలు ప్రభుత్వం హామీపై పారిశ్రామిక ఆర్థిక కార్పొరేషను నుండి రూ. 90.00 లక్షల చొప్పున రుణాలు కూడా పొందాయి. (చిత్తూరు సంస్థ రూ. 75 లక్షల రుణం పొందింది) భారత జీవిత భీమా కార్పొరేషను నుండి రూ. 20 లక్షలు రుణం పొందాయి.

## సహకార సేద్యం

సహకార సేద్యం అభివృద్ధికి, ఒక క్రొత్తరంగం. మూడవ ప్రణాళికలో దీనికి ప్రత్యేక ప్రాముఖ్యత యివ్వడం జరిగింది. ప్రభుత్వ నిర్ణయాల ప్రకారం సహకార సేద్య సంఘం వ్యవసాయదారుల స్వచ్ఛంద సంఘం. మానవ శక్తితో పాటు యితర వనరులను యితోధికంగా వినియోగించుకోవడానికి వీలుగా యీ సంఘాల ఏర్పాటు జరుగుతుంది. భూమి సమీకరణ, సేద్యంలోని కష్టనష్టాలను సభ్యులందరూ సమంగా పంచుకోవడం, సహకార సేద్యంలోని కొన్ని ముఖ్య ఉద్దేశాలు. యీ సంఘాలను యేర్పాటు చేయడంలో యెట్టి నిర్బంధం ఉండదు. అంతేగాక మూడు సంవత్సరాల తర్వాత సభ్యులు సంఘంనుండి విరమించుకోదలిచితే వారు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు. రాష్ట్రంలో సహకార సేద్య సంఘాలకు ప్రోత్సాహం యివ్వడానికి వీలుగా మూడవ ప్రణాళికలో రు. 40 లక్షలు కేటాయించారు. ప్రతి జిల్లాలో 20 పైలట్ ప్రాజెక్టుల క్రింద 200 సంఘాలను నెలకొల్పడానికీ, ఇతర ప్రాంతాలలో యెన్ని సాధ్యమైతే అన్ని సంఘాలను ఏర్పాటు చేయడానికి కార్యక్రమంలో ఉద్దేశించారు.

జాతీయ సహకార సంఘాల అభివృద్ధి, గిడ్డంగుల బోర్డు నియమించిన వినియోగదారుల సహకార సంఘాల కమిటీ సిఫార్సులను అనుసరించి మూడవ ప్రణాళికకాలంలో రాష్ట్రంలో 200 వినియోగదారుల సహకార సంఘాలకు అభివృద్ధి చేసే కార్యక్రమాన్ని చేపట్టారు. 1961_62వ సంవత్సరంలో రాష్ట్రంలో నిర్ణీతమైన 21 వినియోగదారుల సహకార సంఘాలకు సహాయం చేయడంతో యీ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ముఖ్యపట్టణాలలో ప్రభుత్వోద్యోగుల సౌకర్యార్థమై వినియోగదారుల సహకార సంఘాలను నెలకొల్పి, నిర్వహించే పథకం పరిశీలనలో ఉంది.



# నేడు మనం సైనికులం

(7వ పేజీ తరువాయి)

## ప్రాతిపదిక పరిశ్రమలు

పంచాయితీ రాజ్యం ద్వారా సమాజవికాసం సాధించాలని, తద్వారా ప్రజల చైతన్యశక్తితో దేశ ఆర్థికాభివృద్ధి సాధించాలని మన ప్రయత్నం. ఆర్థిక నిమ్నోన్నతాలు తొలగించుకోనిదే మన చరమ లక్ష్యమైన సోషలిస్టు తరహా సమాజ స్థాపన సాధ్యంకాదు. దేశంలో గల ప్రకృతి వనరులను పూర్తిగా వినియోగించుకుని తగినంత ఉన్నత స్థాయిలో ప్రాతిపదిక పరిశ్రమలను స్థాపించు కోవడం అవసరం. గడచిన రెండు ప్రణాళికకాలంలో కొన్ని ముఖ్యమైన భారీ పరిశ్రమలను దేశంలో స్థాపించుకోవడానికి కృషిజరిగింది. ఆ పదేళ్ల కాలంలో మన జాతీయాదాయం 42 శాతం పెరిగింది, అలాగే తలసరి సగటు ఆదాయం 16 శాతం వరకు పెరిగింది, మూడో ప్రణాళికకాలంలో సాలుకు 5 శాతం వంతున జాతీయాదాయం పెంచాలనేది మన లక్ష్యం. జాతీయ సంపదను ఏటేటా వృద్ధి చేసుకోవడం, ప్రజల జీవన ప్రమాణం పెంచడం మొదలైన కార్యక్రమాలు సోషలిస్టు తరహా సమాజ స్థాపనకు దోహదకారులు. అయితే మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు భారీ పరిశ్రమల రంగం కొంత వెనుకబడివున్న మాట నిజమే. మన రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన వనరులు పుష్కలంగా వున్నాయి. దీనికి తోడు అభ్యుదయ కాముకులైన పారిశ్రామిక వేత్తలు పరిశ్రమలు స్థాపించడానికి ముందుకు వస్తే, సాధ్యమైనన్ని సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం ఎల్లప్పుడూ సిద్ధంగా వుంది. మనకు గల వసతులను సద్వినియోగపరచుకుని రాష్ట్ర పారిశ్రామికాభ్యుదయం సాధించడానికి మనం తీవ్రంగా కృషి చేయవలసివుంది. అందుకే అవకాశం లభించినప్పుడల్లా మన రాష్ట్రంలో భారీ పరిశ్రమలను స్థాపించవలసిన ఆవశ్యకతనుగురించి కేంద్ర ప్రభుత్వానికి నచ్చచెప్పడంకూడా జరుగుతున్నది. దక్షిణ భారతానికంతటికి ప్రసిద్ధి చెందిన సింగరేణి బొగ్గు గనులలో ఉత్పత్తి పెంచడానికి కృషి జరుగుతున్నది. మన రాష్ట్రంలో సింథెటిక్ మందుల ఫ్యాక్టరీ, హెవీ ఎలక్ట్రికల్స్ కర్మాగారం త్వరలోనే స్థాపించ బడతాయి.

పారిశ్రామికాభ్యుదయ సాధనకు దోహదకరంగా విద్యుచ్ఛక్తిని ఎక్కువ చేసుకోవడం అవసరం. నదుల రాష్ట్రమని ప్రసిద్ధ చెందిన మన రాష్ట్రంలో జలవిద్యుచ్ఛక్తి పథకాలకు ప్రత్యేక ప్రాధాన్యం వుంది. మూడో ప్రణాళికకాలంలో శ్రీశైలం పథకాన్ని అమలు పరచడానికి ప్రయత్నం జరుగుతున్నది. అలాగే ఇటీవలి వరకు సీలేరు పథకం విషయంలో మనకూ ఒరిస్సా ప్రభుత్వానికీ గల అభిప్రాయ భేదాలు తొలగించుకుని ఒప్పందం చేసుకున్నాం. సీలేరు ఒప్పందం మన రాష్ట్ర జలవిద్యుత్ చరిత్రలో ఒక ప్రధానమైన ఘట్టం. ఎందుకంటె ఇతర రాష్ట్రాలలో వివిధ రంగాలలో. మనకుగల అభిప్రాయభేదాలను సామరస్యంతో మంచితో తొలగించుకోవచ్చుననే విషయాన్ని అది ప్రత్యక్షంగా ఋజువు చేసింది. నదీ జలాల పంపిణీ విషయంలో గల పేచీలు కూడా త్వరలోనే తొలగిపోగలవని ఆశిద్దాం. కొత్తగూడెంవద్ద మూడో ప్రణాళికకాలంలో ఏర్పాటు చేయనున్న థర్మల్ విద్యుత్ కేంద్రానికి ప్రపంచ బ్యాంకు నుండి మనకు ఆర్థిక సహాయం లభిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి మన రాష్ట్రంలో స్థాపితమైన విద్యుత్ యంత్రాల ఉత్పత్తి శక్తి 98900 కి. వా. తరువాత ఆరేళ్ల కాలంలో మాచ్‌ఖండ్, తుంగభద్ర, రామగుండం పథకాల ద్వారా యీ ఉత్పత్తి శక్తి 122825 కి.వా. కు పెరిగింది. అలాగే యీ ఆరేళ్ల కాలంలో విద్యుచ్ఛక్తి లభించిన పట్టణాలు, గ్రామాల సంఖ్య 789 నుండి 4120 వరకు పెరిగింది

## ప్రజలు త్యాగం చేయాలి

ప్రణాళికాబద్ధంగా ఆర్థికాభివృద్ధికి ప్రయత్నం జరుగుతున్నప్పుడు వివిధ రంగాలలో భారీ పథకాలను అమలుపరుచుకోవలసి వుంటుంది. దీనికి తగిన ఆర్థిక స్తోమత సాధించుకుంటేనే గాని ఆ పథకాలను అమలుపరుచుకోలేము. పథకాల సంఖ్య పెరిగినకొలదీ ప్రజానీకానికి సౌకర్యాలు కూడా పెరుగుతూనే ఉంటాయి. ఈ ఉద్యమంలో తమ పాత్ర నిర్వహించడానికి ప్రజలు వెనుకాడకూడదు. ప్రజల నుండి లభించిన పన్నులు, ఋణాలు, విరాళాల

ద్వారానే ఇంత పెద్దపెద్ద పథకాలను అమలుపరచడం సాధ్యమవుతుంది. ఇప్పటి ప్రభుత్వమే కాదు ఏ ప్రభుత్వం వచ్చినా పన్నులు వేయక తప్పదు. మరొక విషయమేమంటే ఇదంతా ఏ పార్టీ కోసమో కాదు. దేశాభివృద్ధికి, ప్రజల జీవన ప్రమాణం పెంచడానికి ప్రణాళికల ద్వారా మనం ఆశించిన ప్రయోజనం ప్రతి ఒక్కరికి ఆనందదాయకమైన జీవితం. ప్రజలు కూడా కొంత త్యాగబుద్ధిని చూపడం అవసరం. ఎక్కువ ప్రయోజనాలు పొందడానికై ఎక్కువైనాసరే పన్నులను ప్రజలు భరించవలసి ఉంటుంది. కృష్ణా గోదావరి జలాలను ఇంకా విరివిగా ఉపయోగించుకోడానికి ప్రాజెక్టులు నిర్మించుకోవాలి. ముఖ్య కార్యక్రమాలు చాలా ఉన్నాయి. అందువల్ల పన్నులు పెంచరాదనే ఆందోళన న్యాయసమ్మతమైనది కాదని నా అభిప్రాయం.

మరొక విషయమేమంటే ఆందోళనలు చేయవలసిన సమయం మనదేశంలో ఏనాడో పోయింది. అదంతా పరప్రభువులు పరిపాలిస్తున్న రోజులకు సంబంధించిన గత చరిత్ర. నేడు మన చరిత్రలో నిర్మాణాత్మక కృషి అనే నూతనాధ్యాయం ప్రారంభమైంది. ప్రజలు తమ శక్తి సామర్థ్యాలను నిర్మాణాత్మకంగా దేశ సేవకు వినియోగించవలసిన తరుణమిది. దేశాభివృద్ధి కుంటుపడడానికి దోహదం చేసే ఏవిధమైన ఆందోళనలు కూడా నేడు మనం తలపెట్టకూడదు. మన ప్రజల శక్తిసంపదఅంతా జాతీయాభివృద్ధి కార్యక్రమం వైపు మళ్ళించాలి. అంతే కాక దేశమంతటికీ ప్రయోజనకరమైన ఒక బృహన్నిర్మాణోద్యమం జరుగుతున్నదనీ, దానిలో మనందరం భాగస్వాములమనే చైతన్యంతో పనిచేయాలి. కుల, మత వర్గ ప్రాంతీయ ప్రాతిపదికపై గల సంకుచిత దృష్టిని మనం వదలివేయాలి.

## ప్రతి ఒక్కడూ ఒక సైనికుడు నేడు

జాతీయ స్థాయిలో ఒక మహోద్యమంలాగా ప్రణాళికా కార్యక్రమాలను అమలుపరిచి ప్రశాంత విప్లవం సాధించడానికి కృషిచేస్తున్న తరుణంలో, మన దేశ ఉత్తర సరిహద్దులలో చైనా బెడద వచ్చిపడింది. ఇది మనకు అగ్ని పరీక్ష. గత ఏడెనిమిది రోజుల్లో చైనా సైనికులు మన భూభాగం మీద దండయాత్ర ప్రారంభించారు చైనా తన దుష్ట లక్ష్యాలను ఇప్పుడు బైటపెట్టింది. మన స్వాతంత్ర్యానికి మన మనుగడకు ముప్పు వాటిల్లిన యీ సమయంలో భారతీయులందరూ సుశిక్షితులైన సైనికులవలె ప్రభుత్వానికి అండగా నిలవడం అవసరం. ఈ జాతీయ ఉపద్రవాన్ని ధైర్యంగా ఎదుర్కోడానికి ప్రజలందరూ నడుం కట్టి సర్వసిద్ధంగా ఉండాలని మన ప్రియతమ నాయకుడు నెహ్రూ విజ్ఞప్తి చేశారు. ఎంతటి త్యాగమైనా చేయడానికి మనం సిద్ధంగా ఉండాలి. చైనా సమస్య తేలేవరకు, మన భూభాగం నుండి చిట్టచివరి చైనా సైనికుడు గెంటివేయబడే వరకు, మనకు విశ్రాంతి లేదు. ప్రణాళికా కార్యక్రమాలు జరుగుతూనే ఉంటాయి. అయితే మనం ఇప్పుడు అభివృద్ధికోసం కృషి చేస్తున్న కార్యకర్తలమే కాదు, ప్రాణాలు తెగించి పోరాడడానికి తయారుగా వున్న సైనికులం కూడా. జైహింద్

---

# శ్రీ గోపీచంద్ హఠాన్మరణం

ప్రముఖ రచయిత, నవలాకర్త అయిన శ్రీ త్రిపురనేని గోపీచంద్ నవంబర్ 2వ తేదీ సాయంత్రం హృద్రోగం వచ్చి అకస్మాత్తుగా స్వర్గస్థులయ్యారు.

శ్రీ గోపీచంద్ 1913 సెప్టెంబర్ 8వ తేదీన జన్మించారు. వీరు కీ.శే. త్రిపురనేని రామస్వామి చౌదరి గారి పుత్రులు.

శ్రీ గోపీచంద్ సాహితీ రంగంలోనే కాక, సినిమా రంగంలో కూడా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు రాష్ట్ర సమాచార శాఖ డైరెక్టరుగా నియమితులై, ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం జాయింట్ డైరెక్టరుగా కొద్దికాలం పనిచేసి 1957 నుంచి ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంలో గ్రామస్థుల కార్యక్రమాల ప్రొడ్యూసరుగా వున్నారు.

రాష్ట్ర సమాచారశాఖ కార్యాలయోద్యోగులు నవంబర్ 3వ తేదీ మధ్యాహ్నం సమావేశమై శ్రీ గోపీచంద్ హఠాన్మరణానికి తమ గాఢ సంతాపాన్ని వ్యక్తం చేశారు.

Edited & Published by the Director of Information and Public Relation, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్ డివిజన్లు
(1961 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | | 223 |
| జనసాంద్రత (చదరపు మైలుకు) | | 340 మంది |

## పంచవార్షిక పశుగణన — 1961

(వేలలో)

| | | |
|---|---|---|
| పశువులు | ... | 123,45 |
| గేదెలు | ... | 69,49 |
| గొర్రెలు | ... | 83,63 |
| మేకలు | ... | 42,47 |
| గుర్రాలు | ... | 71 |
| ఇతర జంతువులు | ... | 6,76 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| వివరాలు :— | 1959_60 | 1960_61 | 1961_62 |
|---|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 | 378 |
| సగటున వేయిగ్రామాలకుగల బ్లాకులు ... | 10.66 | 16 | 17 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 16 | 16 |
| బ్లాకులక్రింద వున్న గ్రామాలు ... | 178,87 | 20,901 | 245,02 |
| బ్లాకు ప్రాంతాలో నివసించే ప్రజలు | 187,31 | 205,73 | 235,65 |

## ఖనిజోత్పత్తి

| | 1959_60 టన్నులు | 1960_61 టన్నులు |
|---|---|---|
| బొగు ... | 2296,000 | 2596,000 |
| ముడిఇనుము ... | 203,000 | 233,000 |
| మాంగనీస్ ... | 16,000 | 24,000 |
| అభ్రకం ... | 3,000 | 3,000 |
| సున్నపురాయి ... | 776,000 | 1,036,000 |

